ఆంధ్ర దేశమంతటా!

తాను కాలిపోతూ చీకటింట్లో వెలుగునింపే
దీపంలాంటిది ఆడది!




# మూగనోము

డైరెక్షన్ డి. యోగానంద్ · మాటలు డి.వి.నరసరాజు B.A.

నవయుగ

AVM
PRODUCTIONS

# ఉత్తరాలు

పాఠకులకి, రచయితలకి, రచయిత్రులకి మా ఉగాది శుభాకాంక్షలు —సం॥

## కథలు

28—2—69 పత్రికలో మీరు ప్రచురించిన అల్లరికథ చాల బాగుంది.

డి. చతుర్విజయలక్ష్మి (నిజామాబాద్)

*   *

ఈవారం 21—2—69 ఆంధ్ర సచిత్ర వారపత్రిక చదివాను. యీ సంచికలో పి. చిదంబర రాజగోపాల్ గారి సంతృప్తి, భవానిగారి ముగింపు, జి. చిరంజీవిగారి తెరలు అన్న కథలు మాకునచ్చాయి. ఈ వారం పత్రిక ఉత్తరాల శీర్షికలో ఒక పాఠకుడు మహబూబ్‌నగర్‌నుంచి వ్రాసిన లేఖ చూసి మీకు రాస్తున్నాను. ఒక పాఠకునికి సినిమా శీర్షికలు నచ్చలేనంతమాత్రమున ఆ శీర్షికని తీసివేయుటము భావ్యం కాదంటాను.

అవనిజ, (పాత పాలమూర్.)

*   *   *

28—2—69 వార పత్రికలోని రెండు కథలు "అల్లరికథ", "తీపి విషం" విద్యార్థుల కలంలోంచి వెలువడిన యీ రెండు కథలు యీనాటి విద్యార్థి మనస్తత్వానికి చక్కటి ప్రతిబింబాలని చెప్పక తప్పదు. ఊహకన్నా ఉద్రేకానికి, శక్తి కన్నా ప్రోత్సాహానికి చోరవ ఎక్కువవుండే వయస్సులో జీవితమే ఒక అనుభూతుల కలగా కనిపించే విద్యార్థి జీవితంలో ఉండే రెండు విచిత్ర విభిన్న అనుభవాలకి యీ రెండు కథలు చక్కటి దృష్టాంతరాలు.

అల్లరి కథలోని "అల్లరి"లోని అమాయకత్వం, తీపి విషంలోని విషాదం రెండు కూడా, విద్యార్థి తరానికి యీనాడు సుపరిచితం. నాలుగు కాలాల పాటు గుర్తువుండే కథలు రాసిన చి. సౌ. సాయి కుమారి, శ్రీ సోంబాబుకు నా అభినందనలు.

మల్లాది సూరిబాబు, (బందరు)

*   *   *

28—2—69 సంచికలో ప్రచురితమైన జి. వి. సాయికుమారిగారి 'అల్లరికథ' చాలా చాలా బాగుంది. చిత్ర రచనలుచేసే ఎ. ఎస్. మూర్తి గార్కి నా అభినందనలు తెలుపండి. కొత్త సీరియల్ ఏదినత్యం, ఏదసత్యం చాలా బాగుంది.

ముంకర సత్యనారాయణ, (విజయవాడ)

## సీరియల్

14—2—69 పత్రికలో "అడకత్తెరలో మనిషి" సీరియల్ చాలా బాగుంది. కానీ మంచి సమయంలో యింకా ఉంది అని చూసేసరికి చాలా బాధపడినాను. దుర్గపాత్ర కథ చివరివరకు ఉంటుంది అనుకున్న నేను ఆపాత్ర ముగియగానే చాలా విచారించాను. అసలు కథకూడా చాలాబాగుంది.

ఎస్. ఎస్. స్వామి., ఎస్. శ్యామలాదేవి (విశాఖపట్నం)

*   *   *

ఆంధ్రుల అభిమాన ఆంధ్రసచిత్రవార పత్రికలో ప్రచురింపు చున్న "అడకత్తెరలో, మనిషి" సీరియల్ చాలా బాగుంది. ఈ వారం 14—2—69 చదవడం పూర్తిచేయునరికి కనులలో నీరు నిండు కొంది. దుర్గవంటి ఆదర్శమూర్తి భవానీ శంకర్‌కు దూరమగుట బాధాజనకమైనది. యిందు ప్రతీ ఒక్క పాత్రతో నూతన విశిష్టత పేర్కొన్న రచయిత్రి అభినందనీయురాలు.

సింహగిరి పట్నాయక్ (షడోల్)

*   *   *

వనితాలోకం వ్యాసరచనపోటీలో మొదటి రెండవ, మూడవ బహుమతులు పొందిన రచయిత్రుల జీవిత వివరాలు ఫోటోలు ఈదిగువ ప్రచురిస్తున్నాము. ప్రత్యేక బహుమతులు పొందిన రచయిత్రుల ఫోటోలని జీవిత వివరాలని పై సంచికలలో ప్రచురిస్తాము. —సం



శ్రీమతి మునుపల్లె సరోజిని



శ్రీమతి ఎం. అన్నపూర్ణారెడ్డి



శ్రీమతి బి. వెంకట సత్య కేదారేశ్వరి

### మొదటి బహుమతి

శ్రీమతి మునుపల్లె సరోజినీదేవి గారు 1934 లో గుంటూరు జిల్లాలోని 'మునుపల్లె' గ్రామంలో జన్మించారు. చదువు బాపట్ల, గుంటూరులలో జరిగింది. బి. ఎస్. సి. డిగ్రీ చేసుకున్న తర్వాత ఆమె హైకోర్టులో క్లర్కుగా చేరారు, నేటికీ అక్కడే పనిచేస్తున్నారు. 'వివాహితను. ముగ్గురు పుత్రులు' అని రాస్తున్నారు. వీరికి తెలుగుభాషా సమితివారి పోటీలో కుటీర పరిశ్రమలుఅనే పుస్తకానికి బహుమతి వచ్చింది. ఆంధ్రప్రభ వారపత్రిక పోటీలో నవలా రచనకి ప్రథమ బహుమతి వచ్చింది.

### రెండవ బహుమతి

శ్రీమతి అన్నపూర్ణారెడ్డిగారు అనంతపురం జిల్లాలోని ఖాద్రిపురంలో జన్మించారు. కదిరి హైస్కూలులోను, మదనపల్లె కళాశాలలోనూ, గుడివాడ హోమియో వైద్యకళాశాలలోనూ పెన్సిల్వేనియా స్టేట్ (అమెరికా)లోని అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హోమియోపతి కళాశాలలోనూ చదువుకున్నారు. భర్త డా. ఎమ్. వి. రెడ్డిగారు బాపట్ల ఎగ్రికల్చరల్ కాలేజిలో ఎసోసియేట్ ప్రొఫెసరు ఆఫ్ బాటనీ; శ్రీమతి అన్నపూర్ణారెడ్డిగారు తెనాలిలో హోమియో వైద్యం ప్రాక్టీసు చేస్తున్నారు.

### మూడవ బహుమతి

శ్రీమతి బులుసు వెంకట సత్య కేదారేశ్వరిగారు ప్రస్తుతం నెల్లూరులో ఉంటున్నారు. వారి భర్త శ్రీ బి. వి. సుబ్బారావుగారు అక్కడ ఇన్‌కమ్ టాక్సు ఆఫీసరు. రచయిత్రి జన్మస్థలం రాజమండ్రి. బి. ఎస్. సి. రెండవ సంవత్సరంలో 'వివాహరీత్యా చదువు ఆగిపోయింది. ఇరవయిరెండు గేళ్ల వయసు కల వీరికి ఇద్దరు పిల్లలు. అభిరుచులు తెలుగు సాహిత్యం, లలిత సంగీతం, ఫోటోగ్రఫీ. అభిమాన రచయితలు నన్నయ, పోతన, ముక్కు తిమ్మన్న, దాశరధి, కృష్ణశాస్త్రి, విశ్వనాథ, ఆరుద్ర. ఇది వీరి మొదటి రచన. ★

చూచి
ఆనందించండి



యన్. రంగారావు సమర్పించు శ్రీదేవి కంబైన్స్

# భలే అబ్బాయిలు

దర్శకత్వం
పేకేటి శివరామ్ B.A

నిర్మాత
తోట సుబ్బారావు

STUDIO Ketha JOTHEE

డిస్ట్రిబ్యూటర్స్ ఆంధ్ర జ్యోతి సీడెడ్ జయలక్ష్మి నైజాం దివ్యదత్తా



అది అలా వదలదు అందులో దెయ్యం వుంది
ప్రజలలో మార్పు రావాలి గాని చట్టం వల్ల మద్యపాన నిషేధం జరుగదు
తగులబడి పోతున్న ఓడ
షాక్ ట్రీట్ మెంట్
హెచ్చరిక నిప్పుకు దూరంగా వుంచండి
సుబ్రహ్మణ్యం రాజీనామా
ప్రేలుడు పరిస్థితి

# బెంగాలు ఎన్నికల ఫలితాల అర్థం ఏమిటి?

జూలియస్ సీజార్‌కి తను హత్య చెయ్యబడ పోతున్నట్లు సోదిచెప్పి హెచ్చరించటం జరిగిందిట; అలాగే ఇప్పుడు వచ్చిన బెంగాలు ఎన్నికలు కాంగ్రెసుకి అతి ముఖ్యమయిన హెచ్చరిక!

## సమస్యల నగరం

బెంగాలు క్షామం వచ్చినప్పటినుంచీ కలకత్తా సమస్యల — నగరం అయిపోతూ వచ్చింది. సర్వ జనోద్ధరణ జాతీయ ధ్యేయం అంటారు కాని కలకత్తాలో బీదలమధ్య— కలవారిమధ్యా తేడాలు అధికం అవుతున్నాయి. 1947 నుంచీ భారత దేశాన్ని పాలించినవారు దేశంలోని బాగా వెనుకబడిన ప్రాంతాలనుంచి వచ్చినవారే— ఉదాహరణకి ఉత్తర ప్రదేశం, బీహారు. ఒకప్పుడు బెంగాలు కేంద్రప్రభుత్వంలో మంచి పలుకుబడి కలిగిఉండేది. ఇప్పుడు బెంగాలుకి తగిన ప్రాతినిధ్యం లేదు. డాక్టరు బిధాన్ చంద్రరాయి బెంగాలుకి మంచి ప్రాజక్టులు వచ్చేటట్లు చూసుకునేవారు కాని ఆయన కూడా (శ్రీ నెహ్రూవలె) మర్రిచెట్టు లాంటి వారు. మర్రిచెట్టుకింద మరొక వృక్షం పెరగదు. నెహ్రూ తర్వాత కాంగ్రెసు పార్టీలో కుళ్ళు మొదలు పెట్టింది. అలాగే డాక్టరు రాయి మరణం తర్వాత బెంగాలులో కాంగ్రెసు నశించటం ప్రారంభించింది. రాజకీయాలద్వారా ప్రజా సేవ చేసే బదులు రాజకీయ వాదులు స్వార్థాన్నే ధ్యేయంగా పెట్టుకున్నారు. ఇదే బెంగాలులో కాంగ్రెసు నాశనానికి ముఖ్యకారణం.

## ప్రభువుల ఆమోదం

బీహారు, ఒరిస్సా, మధ్య ప్రదేశం, ఉత్తర ప్రదేశాలలో వందల కోట్లరూపాయల కర్చులతో పెద్ద, పెద్ద ప్రాజక్టులు నిర్మించారు. 'ఎందుకూ?' అంటే అప్పటికాలంలో ఈ ప్రాంతాలవారు కేంద్రప్రభుత్వంలో పలుకుబడికలవారయి ఉండేవారు. బొకారోలో ఇనుప ఖనిజాలు దొరకవు. కాని, బొకారో ఉక్కు పరిశ్రమ అమెరికా రష్యాల తర్వాత ప్రపంచంలో కెల్లా పెద్దది. దక్షిణభారత ప్రాంతంలో ఇనుము ఉండే ఖనిజాలకి కొరతలేదు. అక్కడ ఉక్కుమిల్లు పెట్టటంమాత్రం వీలులేక పోయింది. మూడవ ప్రణాళికలో కేరళకి నూనెశుద్ధి కర్మాగారం కేటాయించారు. ఒక నౌకానిర్మాణశాలకూడా కేటాయించారు. కలకత్తాలో కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చినతర్వాత హూగ్లీమీద మరొక వంతెనకి శాంక్షన్ ఇచ్చారు.

## శ్రీ ధర్మవీర హెచ్చరికలు

కమ్యూనిస్టులు తిరిగి ఎన్నికలలో గెలిస్తే ఏమవుతుందో చెప్పటానికి శ్రీ ధర్మవీర మూడుసార్లు న్యూఢిల్లీకి వచ్చారు; ప్రధాన మంత్రితో చెప్పగా ఆమె ఉపప్రధాన మంత్రిని చూడమన్నారు; ఉప ప్రధాన మంత్రి అంతరంగిక వ్యవహారాల శాఖమంత్రిని చూడమన్నారు. చివరికి శ్రీ ధర్మవీరకి ఏమి అర్థమయిందో మనకి తెలియదు.

శ్రీ మొరార్జీదేశాయి కాంగ్రెసు పార్టీలో ఉండి ఏమి చేస్తున్నారో అర్థంకాదు. ఆయన ఆశయాలు మూడు—ఒకటి శ్రీమతి గాంధీగారి ఆజ్ఞానుసారం ఉపప్రధాని ఉద్యోగం నిర్వహించటం, జాతి సమైక్యత పేర హిందీని అందరి మీద రుద్దటం, మహాత్మగాంధీ పేర మద్యపాన నిషేధాన్ని అమలుపరచటం.

## మాస్కో వ్యాఖ్య

పశ్చిమ బెంగాలులో కమ్యూనిస్టుల ఎన్నికని గురించి సోవియట్ వారపత్రిక న్యూటయిమ్స్ ఇలా రాసింది—

'పశ్చిమ బెంగాలు, ఉత్తర ప్రదేశం, పంజాబు రాష్ట్రాల శాసన సభల ఎన్నికలని పరిశీలిస్తే వామ, ప్రజాస్వామ్య శక్తుల ప్రభావం ఎంతగా పెరుగుతున్నదో తెలుస్తుంది.

'పశ్చిమ బెంగాలులో కమ్యూనిస్టుల నాయకత్వం కింద పన్నెండు పార్టీల, యునైటెడ్ ఫ్రంట్ విజయమే దీనికి తార్కాణం. ఈ ఫ్రంట్‌కి 280 సీట్లలో 214 సీట్లు లభించాయి. కమ్యూనిస్టులు (కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా, దానితో సమంగా నడుస్తున్న రెండవ కమ్యూనిస్టు పార్టీ) తమ సీట్ల సంఖ్యని రెట్టింపు చేసుకోగలిగారు. యునైటెడ్ ఫ్రంట్ ముఖ్య శత్రువయిన ఇండియన్ నేషనల్ కాంగ్రెసుకి 55 సీట్లు మాత్రమే లభించాయి. (1967 ఎన్నికల తర్వాత ఆ పార్టీకి 127 ఉండేవి.) జనసంఘం, స్వతంత్రపార్టీల వంటి రియాక్షనరీ పార్టీలు ఒక్క సీటు కూడా గెలుచుకోలేక పోయారు.

'పశ్చిమ బెంగాలులో యునైటెడ్‌ఫ్రంట్ విజయం తేలికగా సాధించినది కాదు. ఇక్కడ జరిగినంత తీవ్రంగా ఏ రాష్ట్రంలోనూ పోటీలు జరుగలేదు. పోటీలో ఒక వయిపు కార్మికులు మరొక వయిపు పెద్ద బూర్జువా వర్గాలు. భారతదేశంలోని పెట్టుబడి దారులు, విదేశాల నుంచి వచ్చి పెట్టుబడి చేసినవారు రాజకీయాలలో కలుగచేసుకుని ప్రజాస్వామ్య పక్షాలని ఎదిరించే వారందరికీ ధనసహాయం చేస్తారు.

## బొంబాయి షేర్ మార్కెట్

'భారతదేశంలోని అధిక ధనవర్గాలమీద యునైటెడ్‌ఫ్రంట్‌యొక్క ప్రభావం ఎటువంటిదో బొంబాయి షేర్‌మార్కెట్ ధోరణినిబట్టి గ్రహించవచ్చు. మొదటిరోజునే— ఫలితాలు తెలియగానే షేర్ల ధరలు పడిపోయాయి. మార్చి 15న ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఛాంబర్స్ ఆఫ్ కామర్స్ ఎండ్ ఇండస్ట్రీవారి సాంవత్సరిక సమావేశం జరుగుతుందనీ, ఆనాడు సభ్యులు పశ్చిమ బెంగాలుని పరిపాలిస్తున్న యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం విధానాలని చర్చిస్తారనీ 'టయిమ్స్ ఆఫ్ ఇండియా' పత్రిక రాసింది. ఈ మనోవరిసంప ఒక

రాజకీయ సంబంధమయిన విషయాన్ని తప్పించడం గమనార్హం. పశ్చిమబెంగాలులో తప్ప మరెక్కడయినా పెట్టుబడి పెడతామని పెద్ద వ్యాపారస్థులు దడిపిస్తున్నారన్న మాట, అప్పుడే.

### కార్మికవర్గం పాత్ర

'యునైటెడ్‌ఫ్రంట్ గెలుపుకి ఎన్నో కారణాలు ఉన్నాయి. అన్నిటికన్నా ముఖ్యమయినది. కమ్యూనిస్టు నాయకత్వంక్రింద కార్మికవర్గం నిర్వహించినపాత్ర. రాష్ట్ర రాజధాని అయిన కలకత్తా పెద్ద పారిశ్రామిక కేంద్రం. అక్కడి కార్మికవర్గం గొప్ప విప్లవ—సాంప్రదాయాన్ని పెంపొందించింది. మానోపలీ పరిపాలనని ఎదిరించి కార్మికుల పురోగమనానికి తోడ్పడే సంస్కరణల ఉద్యమంలో ఈ వర్గానిదే పయిచెయ్యి. గ్రామప్రాంతాలలోని కార్మిక వర్గాలు, బీదరయితులుకూడా బాగా పని చేశారు.

'మరొక ముఖ్యకారణం ఏమిటంటే భారత కమ్యూనిస్టుపార్టీ స్థానికవర్గాలు రెండవ కమ్యూనిస్టుపార్టీతో కలిసి పని చెయ్యటమే. 1964లో పార్టీ చీలికకి సహాయపడిన విభేదాలని మరిచిపోగలిగారు.

### చిహ్నం

'పశ్చిమబెంగాలు ఎన్నికలు వర్గయుద్ధానికి చిహ్నం. కాని, తక్కిన మూడు రాష్ట్రాలలో ఏశక్తులమధ్య పోరాటం జరిగిందో తెలుసుకొనటం కష్టం. ఉత్తర ప్రదేశం, బీహారు, పంజాబులో భూస్వామ్య వర్గాల బలం ఇంకా మిగిలి ఉంది, వర్గ వ్యత్యాసాలు పోలేదు. అందుచేతనే జనసంఘం అకాలీదళంవంటి మత వర్గ ప్రధానమయిన పార్టీలు చురుకుగా పనిచేస్తున్నాయి. ఈ రాష్ట్రాలలో వామ, ప్రజాస్వామ్యశక్తులు వేరువేరుగా పోటీచేశాయి. ఫలితాలు మారాయి.

'ఈ ఎన్నికలు భారతదేశంలో రాజకీయ శక్తులు ఏవిధంగా పనిచేస్తున్నాయో సూచిస్తాయి. వామ, ప్రజాస్వామ్యశక్తుల ఐక్యమత్యం ఎంత ముఖ్యమో తెలుపుతాయి. పశ్చిమబెంగాలు ఎన్నికల ఫలితాలు పరిశీలించి సరయిన నిర్ణయాలకి రావలసినదని భారత కమ్యూనిస్టుపార్టీ తక్కినపార్టీలని కోరింది. ఈ విధంగా దేశంలోని వామ, ప్రజాస్వామ్యశక్తులని ఏకంచెయ్యవచ్చునని అభ్యుతి. పెద్దవయిన మూడు వామపక్షాలూ—భారత కమ్యూనిస్టుపార్టీ, రెండవ కమ్యూనిస్టుపార్టీ, సమ్యుక్త సోషలిస్టుపార్టీ—కలిసి పనిచేస్తే ఈ ఆశయం కొంతదాకా నెరవేరుతుంది. రియాక్షనరీశక్తులని అరికట్టటం వీలవుతుంది.'

### ఆమోదముద్ర

శ్రీ మధూలిమాయేగారి సం.సో.పా.కి మాస్కో ఆమోదముద్ర లభించిందన్న మాట. పశ్చిమబెంగాలులో వర్గయుద్ధం ఉందని మాస్కో అభిప్రాయం అన్నమాట. ఈ యుద్ధంలో ఒకవయిపు వామపక్షాలూ మరొకవయిపు రియాక్షనరీ — దక్షిణ శక్తులూ. ఈ యుద్ధంలో శ్రీమతి గాంధీ గారి కాంగ్రెసుపార్టీ ఎవరిపక్షం?

తూర్పుబెంగాలులో అలజడులు బయలుదేరాయి. అక్కడివారికి పంజాబీల పాలన అంటే గిట్టదు. అలాగే కలకత్తాలో కూడా కేంద్రప్రభుత్వంపట్ల అసంతృప్తి, ద్వేషం ప్రబలి ఉన్నాయి. వంగరాష్ట్రం

(80 వ పేజీ చూడండి)

ఆటలు

## పెద్ద పోటీలలో సమస్యలు

ఒక బ్యాట్స్‌మాన్ సెంచరీ పూర్తి చేసే వరకు దాని ప్రకటన ఆలస్యమవడానికి కారకుడు కెప్టెను అవుతాడు. ఈ కెప్టెను ఇలా ఆలస్యం చెయ్యవచ్చునా? అనేది ప్రశ్న. ఇలాంటి ఆలస్యాలవల్ల కష్టనష్టాలు కన్పిస్తున్నాయి. ముఖ్యంగా, ఇలాంటి సమస్యలు అంతర్‌రాష్ట్ర క్రికెట్ పోటీలలోను, అంతర్జాతీయ క్రికెట్ పోటీలలోనూ ఎదురవుతుంటాయి. స్కిప్పర్లు ఆలశ్యం చేసి ఇన్నింగ్సును తికమక పెట్టటం కూడా చాలా సందర్భాలలో జరుగుతూ వుంటుంది. ఇది, స్వంత బౌలర్లకి సమయం చిక్కి ప్రతిపక్షాన్ని పడగొట్టడానికి అవకాశాలు ఏర్పరచుతూ వుంటుంది. ఇలాంటి అవకతవకలు జరక్కుండా కెప్టెను అప్రమత్తుడై, ఫలితాన్ని వెంటనే తెలియపరుస్తే ఏ చిక్కూ వుండదు. బేట్స్‌మన్ ఛాన్సుల్ని పోగొట్టడం ద్వారా కెప్టెన్లు విమర్శలకు గురి అవుతూ వుంటారు. కాని ఇది ఒక్కొకసారి తప్పనిసరే అవుతుంది!

హైద్రాబాద్‌లో దులీప్ ట్రాఫీ గేమ్ జరిగింది. అక్కడి వెస్ట్‌స్కిప్పర్ సి. బోర్డే. రెండో ఇన్నింగ్సులో ఆలశ్యంగా ప్రకటించాడు. అప్పుడు పెద్ద రగడ జరిగింది. బోర్డే అలా చెయ్యడానికి కారణం లేకపోలేదు. విజయ్ భోస్లే సెంచరీ చెయ్యడానికి సిద్ధంగా వున్నాడు. ఫస్టు ఇన్నింగ్స్‌లో బోర్డే ప్రయోజనం పొందుదామనుకొన్నాడు. తర్వాత ఆ మాచ్ ఒకఫార్సు కింద జరిగింది. అప్పుడు పటపుడీనవాబ్ బౌలరు. ఒక బాట్స్‌మన్‌కి సాయం చేద్దామన్న ఆలోచనతో డిక్లరేషన్ ఆలశ్యం చేశారు. తద్వారా లాభాన్ని పొందారు. అయితే ఇది క్రికెట్ ఆట ధర్మంకాదు. వెస్టు, ఫస్టు ఇన్నింగ్స్‌లో మళ్ళీ ట్రాఫీ తీసుకున్నారు. (ఏడుకి 333—383) సౌత్ 251 కే పడిపోయింది. ఫస్టు ఇన్నింగ్స్‌లో జైసింహా ఒకసారి అవుట్ అయ్యాడు. అజిత్, వాడేకర్, భోస్లే, దవాన్ శతాలు కొట్టారు. అజిత్‌పాయ్ మొదట్లో 6 వికెట్లు తీసుకున్నాడు.

కౌలాలంపూర్‌లో డేవిస్‌కప్ పోటీ జరిగింది. పందొమ్మిదేళ్ళ గౌరవ్‌మిశ్రా, పదిహేడేళ్ళ ఆనంద్‌అమృతరాజు ఎంతో ప్రతిభ చూపించి పోటాపోటీలుగా ఆడారు. వీరు అన్ని మ్యాచిల్లోనూ పాల్గొన్నారు. ఆర్. క్రిష్నన్ ఒక మ్యాచిలో మాత్రం పాల్గొని నెగ్గాడు. భారతదేశానికి కీర్తి ప్రతిష్ఠలు తీసుకు రావడానికి క్రిష్నన్‌తో పాటు లాల్, ముఖర్జీలు కూడా గట్టిగా కృషి చేస్తున్నారు. మిశ్రా తండ్రి పేరును నిలబెడుతూ మంచి రికార్డును సృష్టిస్తున్నాడు.

—కె. ఎస్. నరసింహన్



# ముగ్గురు మూర్ఖులు

## మహేష్

# కప్ప

### ౙ కథ ౙ



ఏ అంత దీక్షగా చూస్తున్నావు దేన్ని?'అని చూడామణిని ప్రశ్నించాడు చిదంబరం.

'కప్పను.'

'కప్పను అంత దీక్షగా చూడవలసిన అవసరం యేమిటి వచ్చింది?' అని చిదంబరం తిరిగి ప్రశ్నించాడు.

'ఈ కప్పను చూడగానే నాకు రాముల వారి కథ ఒకటి జ్ఞాపకం వచ్చింది. ఆ కథలో ఉన్న కప్ప మాదిరిగానే ఉంది నేటి భారతీయుల పరిస్థితి' అన్నాడు చూడామణి.

'ఏమిటా కథ?' అని చంద్రాలావు ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'శ్రీరామచంద్రుడు వనవాసం చేస్తూ, ఒకప్పుడు పంపా సరోవరం దగ్గరకు వచ్చాడు. అప్పుడు అతనికి బాగా దాహం వేసింది. సరోవరం గట్టున గడ్డి దట్టంగా మొలిచి ఉంది. శ్రీరాముడు తన చేతిలో ఉన్న బాణాన్ని ఆ గడ్డిలో గుచ్చి, సరోవరంలోనికి దిగి, దాహం తీర్చుకొన్నాడు.

తరువాత శ్రీరాముడు గట్టు మీదకు వచ్చి, తన బాణాన్ని తీసికొన్నాడు. ఆ బాణం యొక్క చివరను రక్తం ఉంది. అప్పుడు శ్రీరాముడు బాణం గుచ్చిన చోట ఉన్న గడ్డిని తొలగించి చూడగా, అక్కడ ఒక కప్ప కనిపించింది. దాని శరీరం నుండి కూడా రక్తం కారుతూ ఉంది. శ్రీరాముడు దాన్ని చూసి, జాలిపడి దానితో యిలాగ అన్నాడు:

'కప్పా! నేను బాణం గుచ్చేటప్పుడు నువ్వు నన్ను పిలవలేక పోయేవా? నువ్వు యేమాత్రం చప్పుడు చేసినా, నేను నిన్ను చూసేవాడిని కదా! అప్పుడు నీకు యీ గాయం కలిగేదికాదు కదా!'

'శ్రీరామ చంద్రా! ఇతరులు యెవరైనా నాకు హాని చేస్తూ ఉంటే, 'ఓ శ్రీరామా! నన్ను రక్షించు అని నిన్ను పిలిచి ఉండే దాన్ని. కాని అందర్నీ రక్షించవలసిన నువ్వే నాకు హానిని చేస్తున్నప్పుడు నేను యెవరిని పిలవాలి? అందుచేత నేను యే చప్పుడూ చేయులేదు.' అని ఆ కప్ప శ్రీరామునికి సమాధానం యిచ్చింది. అప్పుడు శ్రీరాములవారు ఆ కప్పను అనుగ్రహించారు.

'నేడు భారతదేశాన్ని పరిపాలిస్తున్న వ్యక్తులను శ్రీరామచంద్రునితో పోల్చడం భగవదపచారమే అవుతుంది కాని భారతీయుల పరిస్థితి మాత్రం పై కథలోని కప్ప పరిస్థితి వలెనే ఉంది' అని చూడామణి అన్నాడు.

'భారతీయుల పరిస్థితిని ఆ కప్ప పరిస్థితితో యెలాగ పోల్చగలవు?' అని చిదంబరం ప్రశ్నించాడు.

'భారతీయులను యితరులు యెవరైనా మోసం చేస్తుంటే, వారిని ఆ మోసం నుంచి కాపాడవలసిన బాధ్యత ప్రభుత్వం మీద ఉంది కదా!' అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'అటువంటప్పుడు, ప్రభుత్వమే ప్రజల్ని మోసం చేస్తుంటే ఆ ప్రజల మొరల్ని వినేవారెవ్వరు? విదేశాల్లో భారతదేశ ప్రతిష్ఠను కాపాడవలసిన బాధ్యత కూడా ప్రభుత్వం మీదనే ఉంది. కాని ప్రభుత్వమే భారతదేశం అంతర్జాతీయరంగంలో అపహాస్యానికి గురి అయ్యేలాగ ప్రవర్తిస్తుంటే, యెవ్వరేం చెయ్యగలరు?

అలాగే దేశ ప్రయోజనాల్ని రక్షించవలసిన బాధ్యత యెవరిది? ప్రభుత్వానిదే కదా! కాని ప్రభుత్వమే బుద్ధిపూర్వకంగా దేశప్రయోజనాలకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నప్పుడు యిక దేశానికి దిక్కేముంది?' అంటూ నిట్టూర్చాడు చూడామణి.

'ప్రభుత్వమే ప్రజలను మోసం చేస్తున్నదనీ, అంతర్జాతీయరంగంలో దేశాన్ని ప్రభుత్వమే అపహాస్యానికి గురి చేస్తున్నదనీ, నువ్వు యెలాగ, రుజువు చెయ్యగలవు? అని' తిరిగి ప్రశ్నించాడు చిదంబరం.

కచ్ విషయంలో మనదేశానికి పాకిస్తానుకు జరిగిన తగాయిదా విషయం నీకు తెలుసు కదా! కచ్ ప్రాంతానికి చెందిన కంజర్‌కోట ఛాడ్‌బెట్ వగైరాలు మనదేశానికి చెందినవని ప్రభుత్వం అనేకసార్లు ప్రకటించింది. వాటి మీద పాకిస్తాన్ దురాక్రమణ జరిగినప్పుడు మన ప్రభుత్వం కూడా, అక్కడకు సైన్యాలను పంపింది. యుద్ధం జరిగింది. భారత ప్రభుత్వపు చర్యను అన్నిపక్షాల వారూ సమర్థించారు.

కచ్ తగాయిదా జరుగుతున్నప్పుడు, సదరు ప్రాంతాలు మనకే అనే విషయంలో 'కాస్ట్ అయిరన్ కేసు' అనగా పోత పోసిన యినుము

అంత గట్టిగా మన వాదం ఉంది.' అని అప్పటి ప్రధానమంత్రి మిగిలిన మంత్రులు కూడా యథావిధిగా ప్రకటనలు చేశారు. ప్రజలు వాటిని నమ్మారు.

'తరువాత కచ్ తగాయిదా అంతర్జాతీయ ట్రిబ్యునల్‌కు వెళ్ళింది. కంజర్‌కోట, ఛాద్‌బెట్ వగైరాలతో సహా మూడు వందల చదరపు మైళ్ళ ప్రాంతం పాకిస్తానుకు చెందుతుందనీ ఆ ట్రిబ్యునల్ తీర్పు యిచ్చింది. ఆ తీర్పును అనుసరించి భారత ప్రభుత్వం సదరు ప్రాంతాన్ని పాకిస్తాన్‌కు యిచ్చివేయడానికి నిర్ణయించింది.

'కంజర్‌కోట, ఛాద్‌బెట్ ప్రాంతాలను పాకిస్తాన్‌కు యిచ్చివేయడానికి భారతప్రభుత్వం చేసిన నిర్ణయం చెల్లదంటూ శివకుమార్ అనే ఒక భారత పౌరుడు ఢిల్లీ హైకోర్టులో రిట్ పిటీషన్ దాఖలు చేశాడు.

ఆ సందర్భంలో ప్రభుత్వం ఢిల్లీ హైకోర్టులో ఒక అఫిడవిట్‌ను దాఖలు చేసింది. 'కంజర్‌కోట, ఛాద్‌బెట్' ప్రాంతాలు యెప్పుడూ కూడా భారత దేశానికి చెంది ఉండలేదని' ప్రభుత్వం ఆ అఫిడవిట్‌లో ప్రమాణపూర్వకంగా పేర్కొంది.

'అంటే కంజర్‌కోట, ఛాద్‌బెట్ ప్రాంతాలు మనదేశానికి చెందినవేనని ప్రభుత్వం యిదివరకు చెప్పిన మాటలు అబద్ధమా?'

'లేకపోతే, సదరు ప్రాంతాలు మనదేశానికి చెందవని' ప్రభుత్వం ఢిల్లీ హైకోర్టులో దాఖలు చేసిన అఫిడవిట్‌లోని విషయాలు అబద్ధమా?

ఈ రెండు విషయాలూ కూడా నిజం కావడానికి అవకాశం లేదు కదా! అంటే యీ రెండింటిలో యేదో ఒకటి అబద్ధం అయి ఉండాలి.

ఆ ప్రాంతాలు నిజంగా మనవి కాకపోతే వాటి నిమిత్తం పాకిస్తాన్‌తో యెందుకు యుద్ధం చేయాలి? మనవికాని ప్రాంతాలను మనవేనని చెప్పి దేశాన్ని యుద్ధంలోనికి దించడం ప్రజలను మోసం చేయడం కాదా?

ఆ ప్రాంతాలు నిజంగా మనదేశానివే అయినట్లయితే, కోర్టులో దాఖలు చేసిన అఫిడవిట్ అబద్ధం కాదా? ఇది మాత్రం ప్రజలను మోసం చేయడం కాదా?

ట్రిబ్యునల్ తీర్పునకు ముందూ, తరువాత మన ప్రభుత్వం వారు చేసిన ప్రకటనలను విదేశాల వారు చూసి 'భారతీయులు అబద్ధాలకోర్లు' అని వారు అనుకొంటే వారి తప్పు యేమైనా ఉందా?— ఇకముందు యే విషయంలోనైనా విదేశీయులు మన మాటలను నమ్ముతారా? ఇది భారతదేశానికి అప్రతిష్ఠను తీసికొని వచ్చే చర్య కాదా?' అని చూడామణి తిరిగి ప్రశ్నించగా చిదంబరం యేమీ సమాధానం యివ్వలేదు.

'సరే. ఇది బాగానే ఉందికాని ప్రభుత్వమే బుద్ధిపూర్వకంగా, దేశప్రయోజనాలకు వ్యతిరేకంగా **ప్రవర్తిస్తున్నదని నువ్వు అన్నావు కదా! దాన్ని** యెలాగ రుజావు చెయ్యగలవు?' అని ప్రశ్నించాడు చంద్రరావు.

'1968—డిశంబరు నెలలో అనంతపురంలో జరిగిన అఖిలభారత దళిత జాతుల మహాసభలో కేంద్ర ఆహారమంత్రి, కాంగ్రెసు పార్టీలో సీనియర్ నాయకుడూ అయిన శ్రీ జగజీవన్‌రావ్ యిలాగ అన్నాడు.

'మిషనరీలు హరిజనులను క్రైస్తవులుగా మార్చడం, యిలాగే కొనసాగితే మరో పది పదిహేను యేండ్లలో క్రైస్తవులకు ప్రత్యేకంగా 'క్రిస్టియనిస్తాన్'ను యేర్పాటు చేయాలని భారత్‌పై ఒత్తిడి రావచ్చును.'

'హరిజనులను క్రైస్తవులుగా మార్చడంలో మిషనరీల కార్యకలాపాలు యిటీవలి సంవత్సరాలలో యెక్కువైనాయి. త్వరలోనే యీ మతాంతరీకరణలు దేశానికి పెద్ద జాతీయ సమస్యను సృష్టిస్తాయి.'

పై సభలో కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ నిజలింగప్ప, లోకసభ సభాపతి అయిన శ్రీ నీలం సంజీవరెడ్డి కూడా పాల్గొన్నారు. అటువంటి సభలోనే శ్రీ జగజీవన్‌రావ్ వంటి బాధ్యత కలిగిన నాయకుడు 'క్రైస్తవ మిషనరీల కార్యకలాపాల వల్ల రాబోయే ప్రమాదాన్ని గురించి హెచ్చరించాడు' అంటే క్రిస్టియనిస్తాన్ ప్రమాదాన్ని ప్రభుత్వం పూర్తిగా గుర్తించినదన్న మాటే కదా!

'అయితే అటువంటి ప్రమాదాన్ని ముందుగా అరికట్టడానికి ప్రభుత్వం తీసికొంటున్న చర్య లేమిటి? అని ప్రజలు అడగవచ్చును కదా' దానికి ప్రభుత్వం యేమి సమాధానం యిస్తుంది?

'క్రైస్తవ మత ప్రచారకుడూ, వివాదాస్పదమైన వ్యక్తి అయిన ఫెర్రల్ లాంటి వారిని భారతదేశానికి తిరిగి రానివ్వడం యీ ప్రమాదాన్ని అరికట్టడానికి తోడ్పడుతుందా? అని ప్రజలు ప్రభుత్వాన్ని ప్రశ్నించవచ్చును గదా!

'ఫెర్రల్ లాంటి వివాదాస్పదమైన వ్యక్తులను దేశంలో ఉండనివ్వడం దేశ ప్రయోజనాలకు వ్యతిరేకంగా బుద్ధిపూర్వకంగా ప్రవర్తించడం కాదా?' అని చూడామణి ప్రశ్నించాడు

'ఫెర్రర్ చేసేది సంఘసేవ అనికదా, కొందరు అంటున్నారు దానికి యేమిటంటావు?' అని తిరిగి ప్రశ్నించాడు చంద్రరావు.

'అధికారాన్ని చేజిక్కించుకోవడానికి రాజకీయ నాయకులు, తాము చేసే ప్రయత్నాలకు 'ప్రజాసేవ' అనే ముసుగును కప్పుతారు. అలాగే యీ మిషనరీలు తమ మతాంతరీకరణ కార్యకలాపాలకు 'సంఘసేవ' అనే ముసుగును కప్పుతారు. అంతే తేడా' అని చూడామణి సమాధానం యిచ్చాడు

'వర్షం వచ్చే సూచనలు ఉన్నాయి' అంటూ చిదంబరం లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు. ●




# నేడు వనితాలోకం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య ఏమిటి?








*[వనితాలోకం వ్యాసరచన పోటీలో పాల్గొన్నవారందరికీ మా కృతజ్ఞతలు. పోటీకి చాలా వ్యాసాలే వచ్చాయి; వాటిలో సుమారు **40** శాతం వరకట్నమే నేటి వనితల ముఖ్య సమస్యకింద పేర్కొన్నాయి. సుమారు **30** శాతం సమాజంలో వనితాలోకం యొక్క స్థానం పురుషుల స్థానంకన్నా తక్కువగా ఉండటమే ముఖ్య సమస్య అని వివరించాయి. మిగిలిన వ్యాసాలలో ఉద్యోగినుల బాధలు, శీల సంరక్షణ, విద్యా సౌకర్యాలు, ఆర్థిక స్వాతంత్ర్యంలేమి, వ్యంగ్య చిత్రకారులు, తోటి స్త్రీల ఈర్ష్య, సినిమాలు. అసభ్య వస్త్రాలంకరణ, కుటుంబ నియంత్రణ— వీటిని వనితాలోకం ముఖ్య సమస్యలుగా చెప్పటం జరిగింది.*

*పోటీలో మొదటి మూడు బహుమతులనీ అందుకున్న వ్యాసాలని ఈ సంచికలో వేస్తున్నాము. మిగతావాటిని విలునిబట్టి ముందు వెలువడపోయే సంచికలలో ప్రచురిస్తాము.*

*అయిదు ప్రత్యేక బహుమతులు అందుకున్నవారి పేర్లు :*

*1. కుమారి జ్యోతిర్మయి, 2. కుమారి సి. భారతి, 3. శ్రీమతి పర్వతరెడ్డి సుజనీరెడ్డి 4. శ్రీమతి మన్నెం శారద 5. శ్రీమతి గోపరాజు హైమవతి.*

*—సం.]*

**నేడు వనితాలోకం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్యల్లో వరకట్నం అతి ముఖ్యమైనదని నా అభిప్రాయం.**

దేశ, కాల, పరిస్థితులు పరికిస్తే మనం సంధియుగంలో ఉన్నామని తెలుతుంది; పాత క్రొత్తల మేలుకలయిక కావాలి మన జీవితాలు. కానీ నిజాన్ని పరికిస్తే మనం పురోగమించే బదులు తిరోగమిస్తున్నామేమోనన్న శంక కలుగుతూంది.

మనిషి జీవితంలో వివాహం ఓ ముఖ్యమైన ఘట్టం. ఆ ఘట్టం పూర్తికాందే జీవితం పరిపూర్ణత సంతరించుకోదని అన్నికాలాల్లోనూ అన్నిదేశాల్లోనూ ఆమోదించిన వగ్న సత్యం. కాగా మన హిందూ సమాజంలో వివాహం చేయడమంటే [illegible] ప్రాణగండంలా పరిణమించింది.

నాగరికత ప్రబలిన కొద్దీ, సంఘ సంస్కర్తల కంఠ శోషల ఫలితంగానేమి పురుషునితో పాటు స్త్రీకి సమాన హక్కులు కల్పించి సంఘంలో పురుషునితో పాటు స్త్రీకి సముచిత స్థానం లభింప చేయాలని బద్ధకంకణులై [illegible] కొందరు మహాత్ముల కృషి ఫలితంగా స్త్రీకి కూడా విద్య అవసరం అని గ్రహించి పురుషులతో పాటు, తల్లిదండ్రులు తమ కన్యలకు విద్యార్హతల్ని కలిగిస్తున్నారు. ఆవిధంగా కొంత పురోగమించాం అని మనం సంతోషించినా మనం పూర్తిగా ప్రగతి పథం వైపు పయనించటంలేదు.

వధువుకి విద్యార్హతతో పాటు, సంగీతం, సాహిత్యం, గృహ కృత్యాలలో నేర్పరితనం వీటన్నిటితో పాటు కట్నం కూడా విధిగా ఉండవలసి వస్తోంది. ఎంత పై చదువులు చదివిన వరుడైనా తనకు కాబోయే వధువు సద్గుణ సంపన్న, సౌందర్యరాశి విద్యా వినయ సంపన్నురాలుగానే కాక ఐశ్వర్యవంతురాలు కావాలనీ తనతో పాటు ఓ పెద్ద మూట పట్టుకురావాలనీ కోరుతూనే ఉన్నాడు. ఎంత చదివినా కట్నం కోరకుండా కన్య యొక్క గుణగణాదులనీ చదువు చక్కదనాలనీ మెచ్చి వివాహం చేసుకోవటంలేదు. కట్నం తీసుకోవటం ఓ ఘనత క్రింద జమ అయింది. ఆ భావం నేటికీ యువతరం వారి మస్తిష్కాల నుంచి తొలగిపోలేదు. వారు తమ తల్లిదండ్రుల్ని ధైర్యంగా అందుకు వప్పించటం లేదు. అందరికీ సుఖజీవితం మీద, విలాస జీవితం మీద మోజేకాని నిరాడంబరమైన స్వచ్ఛమైన జీవితం గడపాలని ఎవరికీ లేదు. విషయలాలసత రోజు రోజుకీ పెరుగుతున్నదే కాని తరగటం లేదు. రోజు రోజుకీ జీవితావసరాల్ని పెంచుకుంటున్నారే గాని తగ్గించుకునే ఉద్దేశ్యం ఎవరికీ లేదు. కష్టపడకుండ అవతల వారి నుంచి ధనం ఎలా లాగాలా అన్నదే ధ్యేయంగా కనిపిస్తోంది కానీ ఆత్మగౌరవం, ఆత్మస్థైర్యం, ఆత్మవిశ్వాసం ఎవరికీ లేవు.

వరుల మార్కెట్టు చూచిన వధువుల తలిదండ్రులు కళ్ళు తేలవేస్తున్నారు. నేటి కంటె గతించిన కాలమే మెరుగేమో అన్న భ్రమ కల్పిస్తున్నారు నేటి యువకులు.

మొగపిల్లలతో పాటుగా ఆడపిల్లలకి విద్య నేర్పించటమే కష్టంగా ఉంటే ఆ పైన కానుకలిచ్చి పెళ్ళి చేయటం మరీ కష్టంగా ఉంటోంది. అందువల్లనే చాలమంది మధ్యతరగతి కుటుంబీకులు తమ కన్యల వివాహాలు చేయాలన్న విధినే మర్చిపోజూస్తున్నారు. చదువు చెప్పించి ఉద్యోగం చేయిస్తున్నారు. ప్రభుత్వం కల్పించుకొని కట్నాన్ని నిషేధించింది. ఇచ్చిన వారినీ పుచ్చుకున్న వారినీ శిక్షించేందుకు సిద్ధంగా ఉంది. అయినా మిగతా సరుకుల విషయంలో బ్లాకు మార్కెట్టు ఎలా నిరభ్యంతరంగా సాగుతోందో వివాహంలో కూడా అలాగే జరుగుతోంది. పైగా కట్నం యిచ్చేవాడు యింత కట్నం యిచ్చానని బాహాటంగా చెప్పుకునే అర్హత కూడా కోల్పోయాడు. ఎవరి గుండెల మీద కుంపటి వాళ్ళు దించుకుందాం అనే ఆదుర్దాలో చట్టాన్నే ధిక్కరిస్తున్నారు.

**వనితాలోకం వ్యాసరచన పోటీలో మొదటి బహుమతి పొందిన వ్యాసం**

ఈ కట్న పిశాచానికి బలైన ఎందరో కన్యలు వయస్సు ముదిరిపోయినా అవివాహితలుగానే ఉండి పోతున్నారు. తమకి సంసార జీవితం రాసి పెట్టి లేదు కాబోలనుకుని కుమిలిపోతున్నారు. అభిమాన ధనులైన యువతులు లోలోపల బాధ పడుతున్నా పైకి చిరునవ్వులు ఒలకబోస్తూ కాలాన్ని భారంగా దొర్లిస్తున్నారు.

కొందరు తల్లిదండ్రులు ఈ విషమ పరిస్థితులకి తట్టుకోలేక కొన్ని వింత పనులు చేస్తున్నారు చదువు చెప్పించి ఉద్యోగంలో చేర్చి కొంతకాలం ఆ పిల్ల సంపాదన ఆదా చేసి దాన్నే కట్నంగా యిచ్చి కన్య చెర బాపుతున్నారు. కానీ అలా తన స్వయం సంపాదనతో కొన్న భర్తపై ఆ కన్యకి ఎంతటి గౌరవాభిమానాలుంటాయో పాఠకులే గ్రహించ గలరు. ఎన్ని కన్యాశుల్కం నాటకాలొస్తేనేం ఎందరు సంఘసంస్కర్తలు తమ జీవితాలు ధారపోస్తేనేం ఈ సమస్య ఎప్పటిలా 'ఎక్కడున్నావే గొంగడీ అంటే వేసిన చోటనే ఉన్నా' నన్నట్లు వేళ్ళాని కదలక మెదలక ఉన్నది.

అయితే ఈ సమస్యకి పరిష్కారమార్గం లేదా? ఎందుకు లేదు? ఆలోచిస్తే అందరికీ బోధపడుతుంది. ఆచరించాలన్న బుద్ధి ఉంటే ఎంత సేపు? వివాహయోగ్యులైన యువకులూ యువతులూ ప్రతిజ్ఞ పూనితే అదే అవుతుంది. 'ఏమైనా కానీ నేను కానీ కట్నం తీసుకోను. అలా చెయ్యగల్గిన రోజునే వివాహం చేసుకుంటానని యువకుడూ, ఏమైనా కానీ, నేను కానీ కట్నం అయినా యివ్వను. అలా కట్నం కోరని యువకుడినే వివాహం చేసుకుంటు. లేకుంటే ఆజన్మ బ్రహ్మచారిణిగా ఉంటాను' అని యువతీ ప్రతిజ్ఞ పూనితే ఈ సమస్య కొన్ని ఏళ్ళకైనా పరిష్కారం అవుతుంది. అంతే కాదు కన్యలని కన్న తల్లిదండ్రులు కొంత వ్యక్తి స్వాతంత్ర్యం తమ కన్యల కిచ్చి కులాంతర, మతాంతర వివాహాలకి అడ్డు చెప్పక తమ కన్యలకి అండగా నిలచి, వారి వివాహం వారి యిష్టానికే వదలితే ఈ సమస్య తేలిగ్గా విడిపోతుంది. ఎందరో కన్యలు స్వతంత్రించి తమ భావాలకు ఆశయాలకు సరిపడిన యువకుల్ని తామే ఎంచుకొని వివాహమాడి సుఖించ గలరు.

అప్పుడే సంఘం బాగుపడుతుంది. తద్వారా దేశం బాగుపడుతుంది. అప్పుడే భార్యాభర్తలు తమ సంతానం 'ఆడపిల్లల'నగానే క్రుంగిపోకుండా, ఆడపిల్ల అనే భావంతో చులకనగా చూడకుండా, తమ గుండెల మీద కుంపటి అవతరించిందని తమలో తాము కుమిలి క్రుంగిపోకుండా, తమ సంతానాన్ని అసహ్యించుకోకుండా, ఆడపిల్ల కూడా సంతానమేనని అందుకు విచారించవలసిన పని లేదని, అనుకోగల్గుతారు. ఈ సమస్యాపరిష్కార బాధ్యత యువతీయువకుల భుజస్కంధాలపై ఉన్నది. ●

సూక్ష్మంలో మోక్షాన్నిచ్చే దివ్య ఔషధి సినిమా. మనస్సుకు ఆహ్లాదాన్ని, ఆనందాన్ని యివ్వడమే గాక మానవుని నైతిక ప్రవృత్తి యెలా వుంటే, జీవితం సుఖమయం కాగలదో ఆ సూత్రాన్ని సినిమా (కథ) ప్రస్ఫుట పరుస్తుంది; సినిమాలో నటించే నటీనటులు వాళ్ళ కప్పగించబడే కథా పాత్రలను అర్థంచేసుకుని, ఆపాత్రల్లో రాణించడమే కళ; పూర్వజన్మ సుకృతం వల్లనో, మనిషిచేసే పాప పుణ్యాల ప్రతిఫలంగానో విధి కొందర్ని కళాకారుల్ని చేస్తుంది; భగవత్ప్రసాద మయిన ఆ కళను పూజించి, ఆరాధించి, మీచే అభిమానింపచేసి కృతకృత్యులు కావడమే 'కళ'. మానవుడు యెలావుండాలి? అతడు తప్పటడుగు వేస్తే యేం జరుగుతుంది? న్యాయం, ధర్మం జయిస్తుందా అనెడి సందేహాలను తీర్చగల ఒకే సాధనం 'సినిమా.'



కళకు కాసు దేనికి అని మీ రడగొచ్చు; ఏ వృత్తికయినా ప్రతిఫలం వుంటేనే శోభిస్తుంది; కళారాధకులు అగర్భ శ్రీమంతులా? లేక ఉదరం, అధరం లేని వ్యక్తులా? 'కళ'ను సేవిస్తూ, ఆ సేవకు మీరిచ్చే కూలీని తీసుకోవడంలో తప్పులేదుగా! అంతమాత్రం చేత అది వ్యాపారం అవుతుందా! 'సినిమా' ద్వారా నవరసాల సారాన్ని విభిన్నమానవుల స్వరూప స్వభావాలను మనం తెలుసుకోగలం. దేవుడున్నాడా? లేడా అనెడి సందేహమున్న వాళ్ళకు పురాణ పురుషుల జీవిత వృత్తాంతాన్ని చిత్రంగా నిర్మించి, తద్వారా దైవ చింతను యేర్పరచగల శక్తి కొంతయినా సినిమాకు వుంది; సంఘంలో జరిగే అత్యాచారాలను, అఘాయిత్యాలను కళ్ళకు కట్టేటట్టు కథాపాత్రల ద్వారా చిత్రించి, అలాంటి దుష్టశక్తులను శిక్షించే మార్గాలనుకూడ మరికొన్ని పాత్రల ద్వారా ప్రదర్శింపచేసి ధర్మాన్ని, న్యాయాన్ని పరిరక్షించేందుకు 'సినిమా' తోడ్పడుతుందనడంలో తప్పు లేదను కుంటా; అంతేగాక ప్రభుత్వానికి, కోట్లమేరకు ఆదాయాన్ని యిచ్చి, ప్రజల కుపయుక్తపడే కార్యాలకు ముందంజ వేస్తున్నదీ కూడ యీ 'సినిమా'యే; కాన 'సినిమా'='జీవితం' అనడాన్ని నావరకు నేను సమర్థించు కుంటాను—వుంటాను—మళ్ళీ 'ఉగాది' తేదీకై నిరీక్షిస్తుంటాను—అప్పుడు 'ఆంధ్రసచిత్రవారపత్రిక' ద్వారా మరోసారి కలుద్దాం.

—కృష్ణమూర్తి




ఒకనాడు మృగాంకదత్తుడు, శశాంకవతినే తలచుకుంటూ మేడమీద అటుఇటు తిరుగుతూ, పరధ్యానంతో తాంబూలపుతమ్మను కిందికి ఉమిశాడు. వినయవంతుడనే మంత్రి ఆ దారిని పోతున్నాడు. ఆ తమ్మ అతనితలమీద పడింది. అతడు కోపంతో తలయెత్తి చూచాడు. పైన మేడమీద రాజకుమారుడు. తనమీద వక్కాకు తమ్మ పడినా ఎలాటి సంకోచమూ లేక, క్షమాపణ కోరడమనేది ఏమీలేక ఏమీ జరుగనట్టు రాజకుమారుడు ఉండడం చూచి మంత్రికి కోపం మరింత ఎక్కువయింది. ప్రతిక్రియ తలపెట్టి, మంచి అదనులో రాజు అమరదత్తునికి విన్నవించుకొని తగిన శిక్ష వేయిద్దామని పగబట్టాడు.

మృగాంకదత్తుడు శశాంకవతి ధ్యానంలో ఉండడం వల్ల మంత్రి వినయవంతుని అతడు చూడలేదు.

మృగాంకదత్తుడు, అతని మిత్రులు ఎవ్వరికీ తెలియకుండా రాజ్యం వదలి విదేశాలకు వెళ్లి కొత్త కొత్త సంగతులు తెలుసుకుందామని అనుకున్నారు. కాని నగరంనుంచి వెలుపలికి పోవడం కష్టం. ద్వారాలను ఆరక్షకులు భద్రంగా కాపలా కాస్తున్నారు. గోపురాలకు మంచి రక్షణ ఉంది. మహావ్రతిక వేషంతో రాజధానినుంచి వెలుపలికి వెళ్లిపోదామని నిశ్చయించుకొన్నాడు.

భీమపరాక్రముడు మహావ్రతిక వేషానికి అవసరమైన ఎముకలు, వెంట్రుకలు, మంచపు కోళ్ళు, కపాలాలు మొదలయిన వాటిని సేకరించి తన యింట్లో రహస్యంగా భద్రపరచాడు.

మంత్రి వినయవంతునికి ఈ అదను దొరికింది. వారిపైన రాజుకు కొండేలు చెప్పి రాజపుత్రునితో సహా అందరికీ శిక్ష వేయించ దలచుకొన్నాడు. చారులతో భీమపరాక్రముని చర్యలు కనుగొన్నాడు.

' సమయంలో రాజు అమరదత్తునికి మసూచి వ్యాధి ఏర్పడింది. వినయవంతుడు వ్యాధిని కనుగొనడానికి వెళ్లినట్లుగా రాజువద్దకు వెళ్లి, అతనికి ఇలా విన్నవించాడు:

“మహారాజా, మీ కుమారుడు మృగాంకదత్తుడు మీ ఆయుష్షు క్షీణించడానికి ఎత్తులు వేస్తున్నాడు. భీమపరాక్రముని ఇంట్లో మీ ఆయుర్హానికోసం అభిచార హోమం (చేతబడి) చేస్తున్నాడు.”

మంత్రి ఇలా కొండేలు చెప్పడమేకాక, రాజును భీమపరాక్రముని ఇంటికి పిలుచుకుపోయి, కపాలాలు, అస్థులు మున్నగు వాటిని, భీమపరాక్రముని మారు వేషంకోసం దాచుకున్న వాటిని, చూపించాడు.

అమరదత్తుడు వినయవంతుని మాటలు నమ్మాడు. క్రోధంతో ఒళ్లు మండింది. వెంటనే తన కుమారుణ్ణి మంత్రి పుత్రులు పదుగురితోపాటు నగరంనుంచి వెళ్లగొట్టించాడు.

మృగాంకదత్తుడు రహస్యంగా మారు వేషంతో నగరం వదలిపెడదామనుకున్నాడు. అలాటి వాడికి తండ్రి విధించిన శిక్ష సంతోషం కలిగించింది. నగరం వదలిపెట్టి వెళ్లుతూ, మిత్రులతో ఇలా అన్నాడు: ‘మిత్రులారా, మన మనోరథం చిత్రంగా ఈ విధంగా సిద్ధించింది. మా తండ్రి శక్తి రక్షితుడనే కిరాతరాజును అతని రాజ్యానికిరాజుగా అభిషేకించాడు. మనమందరం మొట్టమొదట అతని పట్టణానికి వెళ్లుదాము. అతడు నా మిత్రుడు. కొన్నాళ్లు అక్కడ విశ్రాంతి తీసుకొందాము. అందరం ఎక్కడికి వెళ్లినా, ఒక చోటికి మళ్లీ చేరడానికి ఒక సంకేతం ఏర్పరచుకొని, శశాంకవతికి ఇష్టమయిన దక్షిణ దిక్కుకు వెళ్దాము.’

రాజకుమారుడు ఇలా చెప్పిన తర్వాత అందరూ బయలుదేరారు. దారిలో పెద్ద అడవి వచ్చింది. ఆ అడవిలో అప్పుడే సింహాలు ఏనుగులను గండస్థలాలు చీల్చిచంపగా, రక్తపు పచ్చి వాసనలు ఇంకా ఆరలేదు.

కుందేటి రక్తంలాగ ఎర్రగా, ఆకాశమనే నాగుబాము పడగమీదిమణిలాగ వెలిగిపోతున్న సూర్యుడు, అస్తమించాడు. ఆకాశమనే అడవిలో చీకటి చెట్లు బారులు కట్టినట్లుగా చీకట్లు ముసురుకున్నాయి. రాత్రికావడం వల్ల మదించి బేతాళులు దిగంతాలలో మూగడంతో వెలుతురు తగ్గింది.

మృగాంకదత్తుడు చాల దూరం నడవడంవల్ల బాగ అలసిపోయాడు. దప్పిక అయింది. పురుగులు పట్టి ఎండిపోయిన ఒక మోడు కింద అందరూ కూర్చున్నారు. క్షణంలో వారి కన్నులు మూతలపడ్డాయి. నిద్రపోయారు.

అర్ధరాత్రి అందరికీ ఒకేమారు మెలుకువ వచ్చింది. ఆకాశం నిర్మలంగాను, తెల్లగాను కనిపిం

రింది. ఏమిటూ అని చూచారు. రాత్రి అనే శబర వనిత చెవిలో విలాసంగా పెట్టుకొన్న గేదగి రేకులాగ తెల్లగావున్న చంద్రుడు ఉదయించాడు. దిగ్గజాల దంతాలలాగను, స్ఫటిక స్తంభాల డంబాన్ని అణచి వేస్తున్నట్టు న్నూ ఉన్న చంద్రుని కిరణాలు ఆకాశమనే యముని కపాలాన్ని చీల్చి వేస్తున్నట్టు ఉన్నాయి.

ఆ తెల్లటి వెన్నెలలో ఆ ఎండినమోడు మోసులు వేస్తూ చిగిర్చడం వారు చూచారు. వారు చూస్తుండగానే ఆచెట్టు నెమ్మదిగా పూవులతో నవ్వింది. మరింత పెద్దదై పళ్ల బరువుతో వంగింది. మంచి గుణాలు సర్వ దిక్కులకూ వ్యాపించేటట్లు దాని పండ్ల కొమ్మలు దిక్కులకు వ్యాపించాయి. అంతలోనే పండ్లు పూర్తిగా పండి కింద నేలమీద రాలాయి.

అది చూచి అందరూ ఆశ్చర్య పడ్డారు. ఏమైతే నేమి అనుకొని, ఆ పండ్లు తిని ప్రాణాలు నిలబెట్టుకొన్నారు. వాళ్ళు పండ్లు తినగానే ఆమాను ఒక బ్రాహ్మణుడుగా మారింది. తెల్లని యజ్ఞోపవీతం చంద్రకిరణాల పుంజంలాగ మెరిసిపోతున్నది. వారు మరీ ఆశ్చర్యపడి అడిగారు, ఏమిటి దీనికంతా కారణమని. బ్రాహ్మణుడు తన తెల్లని పళ్లకాంతులతో లోపలి బ్రహ్మ సులభమైన అర్ధాన్ని వెలుపలికి కుమ్మరిస్తున్నాడా అన్నట్లుగా ఇలా చెప్పడం ప్రారంభించాడు: -

పూర్వం అయోధ్యా పట్టణంలో దమధి అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు విద్వాంసుడు. అతనికి శాంతిమతి అనే భార్య వుండేది. ఆమె చాల ధర్మచారిణి. వారిద్దరికీ నేను కుమారుడనై పుట్టాను. నా పేరు శ్రుతధి.

ఒకమారు పెద్ద కరువు వచ్చింది. నా తల్లి తన వంతు భోజనం ఆరగిద్దామని ఉంది. అంతలో ఆకలిగొన్న ఒక అతిథి వచ్చాడు. తనవంతు భోజనం అతనికి దానం చేసింది నా తల్లి, ధన్యురాలు. ఆకలితో మరణించింది.

నా తండ్రి ఆకలితో పిచ్చిపట్టినట్టుగా చాల చోట్ల తిరిగాడు. అలసిపోయాడు. ఎవరో పుణ్యాత్ములు అతనికి ఐదుపళ్ళు దానం చేశారు. అతడు తిరిగివచ్చి నా కోసం మూడు పండ్లని, తన కోసం రెండని అనుకొని సరస్సులో స్నానానుష్ఠానం చేసుకొని వాటిని తిందామనుకొని సరస్సుకు వెళ్లి నీటిలోనే క్షణంసేపు జపం చేస్తూ వున్నాడు. నాకు బాల్య చాపలం. నేను ఐదు పండ్లనూ తిని వేశాను.

మా తండ్రి జపం ముగించుకొని వచ్చారు. నేను పండ్లన్నీ తిన్నానని తెలుసుకొని కోపంతో వెర్రెత్తిపోయాడు. 'ఎండిన మోడు అయిపో!' అని నన్ను శపించాడు. నేను బ్రతిమాలాను 'శాపాంతం ప్రసాదించు తండ్రీ!'అని. మీరు వచ్చి నా పళ్లు తింటే శాపం పోతుందని వరమిచ్చాడు. ఇప్పుడు మీ అనుగ్రహం వల్ల శాపవిముక్తుణ్ణి అయ్యాను. తెల్లని చంద్రుడికి ఆకరమైన సముద్రుడులాగ నేను పరిశుభ్రమయిన శాస్త్రాలకు ఆకరమయిన వాడిని. రాజసేవకు తగిన వాడిని. ఇప్పుడు నీవు నాకు లభించావు. [illegible] కొలువులో వుంటాను.

మృగాంకదత్తుడు, అతని మిత్రులు శ్రుతధి వృత్తాంతం విన్నారు. తమ సంగతి అతనికి తెలిపారు. తెల్లవారిన పిదప అతనితోపాటే, దక్షిణ దిక్కుకు [illegible]. [illegible] వారికి [illegible] అడవి తగిలింది. అక్కడ కొందరు బ్రాహ్మణులున్నారు. వారు త్రిఫలా రసం సేవించి వజ్రకాయులయ్యారు. వారి వయస్సు ఐదువందల సంవత్సరాలు కూడా దాటింది. వారు రాజకుమారునికి, అతని పరివారానికి ఆతిథ్య మిచ్చారు. వారినుంచి సెలవు పుచ్చుకొని రాజకుమారుడు మిత్రులతోపాటు కిరాతరాజు శక్తిరక్షితకుని నగరానికి బయలుదేరారు.

శక్తిరక్షితకుడు వారికి ఆదరంతో స్వాగతమిచ్చి మర్యాదలు చేశాడు. రాజకుమారుడు అతనితో 'నా పనులకు నీవు తోడ్పడాలి' అని చెప్పి, అతని నుంచి మాట తీసుకొన్నాడు. కొన్నాళ్ల తర్వాత అక్కడినుంచి బయలుదేరాడు.

దారిలో మరొక పెద్ద అడవి తగిలింది. ఆ అడవిలో ఒక వృద్ధతాపసుడు కనిపించాడు. మృగాంకదత్తుడు తన మిత్రులతోపాటు అతనికి నమస్కారం చేసి, 'స్వామీ ఈ నిర్జనారణ్యంలో తమరు ఒంటిగా ఎందుకున్నారు?' అని ప్రశ్నించాడు. తాపసుడు ఇలా చెప్పాడు:—

'పూర్వం శుద్ధకీర్తి అనే వ్రతపరాయణుడు ఉండేవాడు. నేను అతని శిష్యుణ్ణి. అనేక మంత్రౌషధులలో సిద్ధిపొందిన వాడిని. మరికొన్ని సిద్ధులు పొందుదామనే ఆశతో దేశాటనం చేశాను. అప్పుడు రాజకుమారుడొకడు కనిపించాడు. అతడు నిధి సిద్ధరసౌషధులను బాగా తెలుసుకొన్నవాడు. అతడు నాకు తన విద్యలు తెలిపి నాతో ఇలా అన్నాడు:—

'తాపసశ్రేష్ఠా, వింధ్యారణ్యంలో ఒకగొప్ప నాగరాజు భవనం ఉంది. ఆభవనం పైకి కనిపించదు. గడ్డిగాదం కప్పి వుంటుంది. అక్కడ ఒక హంసల జంట విహరిస్తూ వుంటుంది. దానినిబట్టి అది నాగరాజు భవనమని తెలుసుకోవాలి. ఆ నాగరాజుపేరు పారావతుడు. అతనివద్ద దివ్యకాంతులతో మిరుమిట్లు గొలిపే ఖడ్గం ఉంది. దాని పేరు వైడూర్యకాంతి. ఆ ఖడ్గం సాధించి చేతిలో ధరించిన వాడికి సిద్ధాధిపత్యం సులభంగా లభిస్తుంది.'

"ఆ మాటలు విని నేను ఇక్కడికి బయలుదేరి వచ్చాను. ఆ ఖడ్గసిద్ధి పొందడానికి సహాయకులు ఎవరూలేరు. ఎంత ఆలోచించినా ఎవ్వరూ కనిపించలేదు, యోగ్యుడు. చివరికి చేసే దేమీ కనిపించక చచ్చి పోదామనుకున్నాను."

మృగాంకదత్తుడు ఆ తాపసుని మాటలు విని, "భగవన్, నేనూ, నా మిత్రులూ మీకు సహాయంగా వుంటాము. మీరు పనికి పూనుకోండి" అని విన్నవించాడు.

ఆ మాటలకు తాపసుడు సంతోషించాడు. ఎక్కడికి బడితే అక్కడికి వెళ్లగల పాదలేపం వారికియిచ్చాడు. వారందరూ, ఆ లేపం తమ అరికాళ్లకు రాచుకొన్నారు. దాని మహిమతో ఆకాశమార్గంలో క్షణంలో వింధ్యాటవి చేరారు.

తాపసుడు క్షత్రియ కుమారుడు చెప్పిన గుర్తులను బట్టి నాగరాజు భవనం వున్న ప్రాంతం తెలుసుకొన్నాడు. చంద్రకొయ్యమేకులను అభిమంత్రించి, ఎనిమిది దిక్కులలోను నాటాడు. దిక్పాలకులుగా మృగాంకదత్తుని, అతని మంత్రులను నిలిపాడు. కింశుపావృక్షం నీడలో అగ్నిని ప్రతిష్ఠించాడు. నాగదమన మంత్రాలతో హోమం చేశాడు.

అప్పుడొక దివ్యాంగన ప్రత్యక్షమయింది. ఆమె కన్నులు మదిరించిన తుమ్మెదలతోగ [illegible], [illegible] రేకులలాగా సొగసుగాను వున్నాయి. స్మరుడికి పట్టాభి మయిన యౌవనంతో మిసమిసలాడుతున్నది. మొలనూలు గలగలమంటుండగా, చేతిలోని రత్నాలగాజులు, కాళ్ళలోని రత్నాల నూపురాలు తదనుగుణంగా శబ్దిస్తుండగా, సవిలాసంగా అతనివద్దకు వచ్చి అతనికి హోమం చేయడంలో సహాయం చేయసాగింది. హోమసామగ్రి అందిస్తూ పరిచర్య చేసింది. అలా సవిలాసంగా త్వరత్వరగా అతనికి సహాయం చేస్తూ అతనికి తెలీకుండా తన తొమ్మును ఆ తాపసికి తాకించింది.

ఆమె తొమ్ములు తాకగానే, ఆ ముఖవర్చుకు తాపసునిమనస్సు కలతబారిపోయింది. చేతులు వణికాయి. [illegible] వణుకుకు చేతిలోని హవిర్భాండం కిందపడింది.

అప్పుడు పారావత నాగరాజు తన భవనం నుంచి పిడుగులుమెక్కే ప్రళయకాలమేఘంవలె గర్జిస్తూ తన పడగలనే మేఘాలతో దిక్కులనుకప్పుతూ, పైకి వచ్చాడు. మృగాంకదత్తుడు, అతని మిత్రులు [illegible] కత్తులతో నాగరాజుపైకి ఉరికారు. తన మీదికి వస్తున్న వారిని చూచి పారావతుడు ఇలా అన్నాడు.

"మీ గురువును విద్యుసుందరి మోసం చేసింది. ఆమె మోసంలో అతడు మరణించాడు. మీరు అతని మాటలతో నిష్కారణంగా నాకు అహితం చేయడానికి వచ్చారు. కనుక మీకు ఈ అరణ్యంలో వెంటనే వియోగం సంభవించనీ!" అని శపించాడు.

ఆ శాప ప్రభావంతో చీకట్లు కమ్మాయి. వారి మనస్సు వెర్రి పట్టినట్టయింది. ఎక్కడ వున్నాము, ఏమి చేస్తున్నాము అనే తెలివి ఏమీ లేక వారు విడిపోయారు.

మృగాంకదత్తుడు నాగరాజు శాపంతో మిత్రుల నుంచి విడిపోయి, శోకార్తుడై ఒంటరిగా అడవిలో తిరుగుతూ ఉన్నాడు. పిడుగు నెత్తిమీద పడ్డట్టుగా హతాశుడయ్యాడు.

కొన్నాళ్లకు అతనికి శ్రుతధి కనిపించాడు. అతడు మృగాంకదత్తునికి ఎప్పటికైనా మిత్రులను కలుసుకోకుండా పోమని పూరట కలిగించాడు. ఇద్దరూ ఉజ్జయినికి బయలుదేరారు.

కొన్నాళ్లకు వారికి విమలబుద్ధి కనిపించాడు. అతనికి రాజకుమారుణ్ని చూడగానే కన్నులనుంచి ఆనంద బాష్పాలు కురిశాయి. అతడిని గాఢంగా కౌగిలించుకొని, హర్షం శోకం పెనువేసుకోగా, పెద్దగా నిట్టూర్చి ఇలా అన్నాడు:

"రాజకుమారా, వింధ్యాటవిలో ఆనాడు నాగరాజు శాపంతో మీ నుంచి విడిపోయి వింధ్య పర్వత తీరంలో పడిపోయాను. అక్కడ వెర్రివాడిలా తిరుగుతూ వున్నాను. అక్కడ తేజోరాశి అయిన బ్రహ్మదండి అనే మహర్షి కనిపించాడు. అతడు నన్ను తన ఆశ్రమానికి పిలుచుకొని వెళ్లాడు. నేను ఆ ఆశ్రమంలో అటూ ఇటూ తిరుగుతూ వుండగా ఒక గుహ కనిపించింది. దానిలో ఏముందో అనే కుతూహలంతో దానిలోకి దూరాను. అక్కడి దృశ్యం నాకు ఆశ్చర్యం కలిగించింది.

"ఒక వనిత ఒక కుమ్మరిసారెను తిప్పుతూ వుంది. దాని చుట్టూ తుమ్మెదలు ముసురుకొని ఝుంకారం చేస్తున్నాయి. ఒక చోట ఒక ఎద్దు, ఒక గాడిద నిలబడివున్నాయి. ఎద్దు తెల్లటి [illegible]

## అక్రాస్టిక్ నెం. 47 — 18 క్లూలు

1. సహనశీలత మరియు సర్దుబాటు / సంయమము లేనిదే ప్రజాప్రభుత్వం సఫలవంతము కాజాలదు.

2. ప్రతి అర్థంలోను మనము ఎట్లా వుందుమో / ప్రేమింతుమో అట్లే వుంటాము.

3. వాక్కులు, చర్యలు, తలంపులనుండి వెలువడుతుంటాయి మన ఆలోచనయొక్క అత్యగ్రత మనసత్య భావన / జ్ఞానము అయివున్నవి.

4. బాహ్య వైషమ్యం మన అంతర్గత వైషమ్య / నిరోధ శక్తిని బహుశా తగ్గించునట్లు అనిపిస్తుంది.

5. ధీర పురుషులు తమ స్వకీయ సృష్టి / కీర్తికి ఆనందింతురు.

6. చరిత్రాత్మక జిజ్ఞాస / సంభావన హద్దులను తెలుసుకోజాలదు. చరిత్రకారుని తిరగలిలో సర్వమూ పిండైపోతుంది.

7. మానవుడు మానవుడుగానే వున్నంతవరకూ భిన్నత / వివిధత్వం ఇంకనూ జీవనాభిరుచిగా వుంటుంది.

8. కళాకారుని వలెనే వైజ్ఞానికుడు కూడా సమంగా పలు ధరాతలం మీదనైనా జీవించవలెను. కాల గవాక్షం ద్వారా నిరంతరతను / యదార్థమును చూచుకోవలెను.

9. జాతి జగడాలకు మూలం తరతరాలనుండి పాతుకున్న దురాగ్రహాలు మరియు శోషణత / ప్రత్యేకతయే.

10. జనులను సర్వసమాన వైరిని ఎదుర్కొన/ ద్వేషింప జేయండి. మరి వారు అన్నిటిని ఇతరులందరిని మరచిపోవుదురు.

11. మోహకత/వినోదం లేని లోకం బుద్ధికుశలత గల లోకంకాదు. అది నీరస జనులకు ఉదాస నిలయం.

12. జనంలో అసహాయతా / నిరాశా భావన తిరుగుబాటులకు ప్రబల హేతువై యున్నది.

13. మానవశాస్త్రాలు / సమతూకతలు లేకుండా విజ్ఞానం అసంభవము.

14. జీవం జీవనం / ప్రేమను పీల్చి జీవిస్తున్నది.

15. సామాజిక ప్రౌఢ వ్యక్తి నీతి / పరస్పరత్వ భావన కలిగియుంటాడు.

16. కళ, సృష్టి మరియు మనోరంజన / ప్రకటన రెండున్నూ అయి వున్నది.

17. మనుష్య స్వభావ విచారము లేని త్యాగం / విజ్ఞానం ప్రయోజనకారి కాదు పైగా ప్రమాదకరం.

18. విద్యాభ్యాసము అన్నిటిలో విఫలతకు ముఖ్యకారణం మాంద్యత / ప్రౌఢత్వ

## No. 47: 18 CLUES

1. Democracy cannot succeed without tolerance and Accommodation / Moderation.
2. In every sense we are what we Are / Love.
3. Words and actions proceed from thought and the summit of our thinking is our Conception / Perception of truth.
4. Outer conflict seems to reduce our capacity for inner Conflict / Control.
5. Brave men rejoice in their own Creation / Reputation.
6. Historical Curiosity / Possibility can know no bounds: every thing is grist to the historian's mill.
7. So long as man is man, Diversity / Variety will still be the flavour of life.
8. The scientist, as the artist, must live on several planes at once—look at Eternity / Reality through the window of time.
9. Race conflicts have their genesis in centuries of prejudices and Exploitation / Isolation.
10. Make the people Fight / Hate a common enemy and they will forget everything and everyone else.
11. A world in which there is no Glamour / Humour is not a sane world, it would be a dreary asylum of bores!
12. A sense of Helplessness / Hopelessness among the people is a potent cause of upheavals.
13. Without the Humanities / Uniformities, science would be impossible.
14. Life lives on Life / Love.
15. A socially mature person has a sense of Morality / Mutuality.
16. Art is both creation and Recreation / Revelation.
17. Sacrifice / Science without humanistic direction is not beneficial but rather dangerous.
18. In all education the main cause of failure is Slackness / Stableness.

గమనిక: పై క్లూలు ప్రసిద్ధ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకోబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరు వేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తో పాటు అక్రాస్టిక్ రిజల్ట్‌తో ప్రచురించబడును.

## ...విప్రహత్యా పాపంజరి

నురుగును కక్కుతూ వున్నాయి. కొన్ని తుమ్మెదలు ఎద్దు నోటి నురుగును తాగి తెల్లనైపోయాయి. గాడిద నోటి నురుగును తాగినవి నల్లనైపోయాయి. అవి నల్లని తెల్లని మలం వదిలాయి. ఆ మలాలనుంచి పాలపురుగులు బయలువెడలి, గూళ్లు అల్లాయి. కొన్ని తుమ్మెదలు ఆ పాల గూళ్లలో తగులుకొన్నాయి. మరికొన్ని తుమ్మెదలు అక్కడేవున్న విషలతమీద, వావిలి తీగమీద వాలాయి. విషలతమీద వాలిన తుమ్మెదలు నిగ్గు మంటలకు భరించలేక ఏడ్చాయి. ఆ ఏడుపుల గోలవిని కరుణించాడు అక్కడ వున్న ఒక ముని. అతని లలాటం నుంచి మంటలు పుట్టాయి. ఆ మంటలు పాలగూళ్లను, విషపు తీగను కాల్చివేశాయి. వాటిలో చిక్కుకొన్న తుమ్మెదలు విడిపోయి స్వేచ్ఛను పొందాయి. ఆ తుమ్మెదలు, ఆ పాలపురుగులు ఒక వెదురు గొట్టంతో దూరాయి. అన్నీ ఛత్రం పట్టి వ్యాపించిన తేజోమండలంలో చేరిపోయాయి.

"నాకు మరొక చోట మరో వింత కనిపించింది. ఒక అడవి. ఒక పెద్ద తెల్లని సింహం, మదించిన ఏనుగులను చంపినట్టిది, కనిపించింది. దానికి పది భుజాలున్నాయి. దాని వెంట పెక్కు సింహాలు నడుస్తున్నాయి. ఇంతలో ఒక పెంటసింగం సవ్వడి వినిపించింది. ఒక లంబోదరుడయిన మనిషి ఆ సింహాన్ని ఆడసింహం దగ్గరికి నడిపించుకొని పోయాడు.

"ఈ వింతలన్నీ చూచి, చాల ఆశ్చర్యపడి బ్రహ్మదండి మునివద్దకుపోయి విచిత్రాలన్నీ తెలిపాను. ఆయన ఆ విచిత్రాలను ఇలా వివరించాడు.

"కుమారా!, ఆ తిరుగుతున్న కుమ్మరి సారె సంసార చక్రం. దానిమీద వాలిన తుమ్మెదలు అతలో కొట్టుమిట్టాడే మానవులు. ఆ చక్రం తిప్పుతున్న వనిత మహామాయ. ఎద్దు, గాడిద ధర్మాధర్మాలు. విషం నరక దుఃఖం, వావిలితీగ సురలోకం. ఆ ముని మహేశ్వరుడు. ఆతడు దయతో వాని పాపం అణచివేసి, కాపాడాడు. అవి దూరిన వెదురు గొట్టం బ్రహ్మరంధ్రం. దానిద్వారా అవి తేజోలోకం చేరాయి.

"నీవు చూచిన పదిభుజాల సింహం సంగతి కూడా విను. ఆ సింహం మృగాంకదత్తుడు. దాని పది బాహువులూ పదుగురు మంత్రులు. ఆ బొజ్జ కడుపుని మనిషి లంబోదరుడయిన వినాయకుడు. అతని దయ వలన మృగాంకదత్తుడు శశాంకవతిని తప్పక వివాహమాడుతాడు."

"రాజకుమారా, ఆ ప్రశాంతుడయిన బ్రహ్మదండి మాటలతో నా దిగులు తీరింది. అటునుండి సంతోషంతో నేను బయలు దేరాను. నిన్ను వెదుక్కుంటూ వచ్చాను. కలుసుకొన్నాను.

ఇక మనకు శివుడే ప్రమాణం!"

విమలబుద్ధి ఈ రీతిగా చెప్పగా, మృగాంకదత్తుడు విని చాల విస్మయపడ్డాడు. అతని మాటలకు ధైర్యం కూడా కలిగింది.

(ఇంకా ఉంది)

# నేడు వనితాలోకం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య ఏమిటి?

రచన: యం. అన్నపూర్ణా రెడ్డి

రెండవ బహుమతి

ఆర్థికంగా, సాంఘికంగా, సాంకేతికంగా మన దేశంలో ఎన్నో మార్పులు జరుగుతున్నా, వివాహ విషయంలో మాత్రం ఏలాటి మార్పులూ జరుగలేదని ఖచ్చితంగా చెప్పవచ్చు! ఆనాడూ, ఈనాడూ ఒకే దారిన పయనిస్తూంది ఈ సమస్య. కాబట్టి ఈనాటి స్త్రీలు ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య వివాహ సమస్యయే అని చెప్పవచ్చు!

స్త్రీ—పసితనంలో తల్లి, తండ్రి అండన బ్రతుకుతుంది. వివాహానంతరం భర్త సంరక్షణ క్రిందకు చేర్చబడుతుంది. ఆ తరువాత వృద్ధాప్యంలో తన బిడ్డల సంరక్షణలో వుంటుంది. అన్ని దశలలో స్త్రీకి వైవాహిక దశ ముఖ్యమైనది. ఈ వైవాహికదశకు నాందియైన వివాహం మన దేశంలో దురదృష్టవశాత్తూ చాలా చిక్కులతో కూడుకొన్నది. నిజానికి ఒక కూతురుకు సవ్యంగా వివాహం చేయగలిగితే ఒక పెద్ద గండం గడిచినట్లు తల్లి దండ్రులు భావిస్తారు.

ఆడపిల్ల పుట్టినప్పటినుంచీ కూడా తల్లికి బెంగ పట్టుకొంటుంది. అమ్మాయి వివాహానికి అంటూ ఖర్చులు తగ్గించుకొని, పైసకు పైస చేర్చి వెనక్కు వేసుకొంటుంది. ఇక ఆ బిడ్డకు యుక్త వయస్సు రాగానే మరింత బాధ అనుభవిస్తుంది తల్లి. అల్లారుముద్దుగా పెంచినా, అతి సామాన్యంగా పెంచినా, ఎదిగిన కూతురును లొమ్ములమీద కుంపటిగా భావిస్తూ దిగులు పడుతూంటుంది తల్లి. వరాన్వేషణలో ఆ తండ్రి పడే ప్రయాస అంతా యింతా ఉండదు. తమ అంతస్తుకు తగ్గ వాడితో సరిపుచ్చుకుందామని మనసులోవున్నా, ఆడపిల్లకు సరైన నీడ చూపించడం, కన్నవారి విధి కాబట్టి, ఆ పిల్ల అన్ని విధాలా సుఖపడాలి కాబట్టి గొప్ప సంబంధమే చూస్తారు వారు.

వచ్చిన అబ్బాయికి అతడి తాలూకూ పెద్ద వారికీ అమ్మాయైతే నచ్చుతుంది—వచ్చిన చిక్కల్లా ఏ కొద్దిమందికో తప్ప కట్నాల డబ్బులు కంటికే ఆనవు! దాంతో బెడిసికొట్టుంది వ్యవహారం! అలా కాకుండా అడిగినంతా గుప్పి, కూతురికి వివాహమైందనిపించినా, తరువాతి అమ్మాయిలు వివాహాలకు ఇదే సమస్య ఎదురౌతుంది.

వివాహానికి కట్నమే ముఖ్యమా? అది లేకపోతే వివాహమే జరుగదా? అని ప్రశ్నించుకొంటే— ఆ ఆచారం పూర్వంనుండీ వున్నది కాబట్టి ఇవ్వడం ఆడపిల్లవంతు, పుచ్చుకోవడం మగవాడి వంతూ అయికూర్చుంది. ఆ లెక్కన చూస్తే—పూర్వ కాలంలో జనాభా సమస్యలేదు. సస్యశ్యామలంగా, సుభిక్షంగావున్న రోజుల్లో, సరదాకొద్దీ గౌరవానికి భంగం రాకుండా ఘనంగా ఆడపిల్ల పెళ్ళి జరిపి, అబ్బాయికి కట్నాలూ, కానుకలూ అంటూ చదివించి, అమ్మాయికి చీరలూ, సారెలూ యిచ్చి సంతోషపర్చి పంపేవారు. పరాయియింటికి వెళ్ళే బిడ్డకు ఆమాత్రం ఇవ్వడం కనీస ధర్మంగా భావించి వుంటారు. అది ఈనాడు ఏకంగా సాంఘిక దురాచారమై కూర్చుంది.

మరి ఇప్పుడు—రోజులు మారిపోతున్నాయి. నిమిష, నిమిషానికీ జనాభా పెరుగుదల. దానికి తోడు ఆకాశాన్నంటే ధరలు. రోగాల బాధలు. వీటన్నిటినీ లెక్క చేయకుండా తిరిగినా, ఆడపిల్లకు వివాహం చేయకుండా తిరగడానికి కుదరదు!

విదేశాలలో వనితలకూ, మన వారికీ పోల్చి చూసుకొంటే— అక్కడ ముఖ్యంగా కట్నాల సమస్య లేదు! పైగా యుక్త వయస్కురాలైన ఆడపిల్ల, పదిమంది మగాళ్లలో తనకు వచ్చిన వాడిని ఎన్నుకోగల స్వాతంత్ర్యం వుంది. అక్కడ ఆడపిల్ల బైట పదిమందిలో కలిసి మెలిసి తిరిగి వరుడిని ఎన్నుకోకపోతే వివాహంకాదు. ఈ విషయంలో తల్లి తండ్రుల ప్రమేయం బహు స్వల్పం. ఇక మన ఆడపిల్లకు అది వ్యతిరేకం! మగ పిల్లలతో కలివిడిగా బైట తిరిగిన ఆడపిల్లకు వివాహం జరగడమన్నది కలలోమాట!

అన్ని లక్షణాలూ కలిగి, గృహ నిర్వాహకత్వానికి కావలసిన నేర్పరితనం వుండి, తగ్గట్లు చదువువున్నా వివాహం సకాలంలో కుదరడంలేదు. అందువల్ల అమ్మాయిలు కాలాన్ని వృథా చేయడానికి ఇచ్చగించక, చదువుపై దృష్టి మళ్ళిస్తున్నారు. కట్నాల రూపంగా ఒకరికి ఇచ్చే డబ్బునే వెచ్చిస్తూ పెద్దవారు ఆడపిల్లల్ని చదువుకొందుకు ప్రోత్సహిస్తున్నారు కూడా. ఆవిధంగా చదువుపై దృష్టి నిల్పినందువల్ల తాత్కాలికంగా ఈ వివాహ సమస్య నధిగమిస్తున్నారు.

తాత్కాలికంగా వివాహానికి వాయిదావేసి చదువు కొన సాగించినందువల్ల ఏమైనా మెరుగా అంటే? దానికి తగ్గ సమస్య కూడా ఎదురవుతున్నది! అమ్మాయి తన వయస్సు వృథాచేస్తూ, డబ్బు వెచ్చిస్తూ చదివినందువల్ల అసలు సిసలైన సమస్యే ఎదురవుతున్నది. చదివే రోజుల్లో, కాలం కలిసివచ్చి సంబంధం కుదిరితే చదువుకు స్వస్తి చెప్పి పెళ్ళి జరిపించేస్తారు పెద్దలు. అప్పుడు రెండు విధాల (అటు కట్నం, ఇటు చదువుకోసం పెట్టిన ఖర్చు—) ఖర్చవుతుంది.

ఇక కొంచెం పైమెట్టులో— బి. ఎ. చదివిన అమ్మాయికి బి. ఎ., ఆంతకు పైచదువు చదివిన అబ్బాయేతప్ప తక్కువ చదివినవాడు పనికిరాడు. ఒకవేళ అమ్మాయి అందుకు సిద్ధపడ్డా అబ్బాయిలు ముందుకు రారు. అమ్మాయి పెద్ద చదువు చదివినందువల్ల కట్నాలు తగ్గడం అంటూ ఉండదు. పైగా ఎక్కువ చదివిన అబ్బాయి మార్కెట్టు ధర వేలనుండీ 'ల'కారాల్లోకి వెళ్ళుంటుంది.

పైపెచ్చు అమ్మాయి వయసు ముదిరుంటుంది కాబట్టి వరుడు దొరకడం మరీ కష్టమౌతుంది. ముప్పై ఏళ్ళ అబ్బాయి, పదిహేనేళ్ల అమ్మాయిని చేసుకోవడానికి ఉరకలు వేస్తాడు. కానీ పాతికేళ్ళ అమ్మాయిని చేసుకోవడానికి తటపటాయిస్తాడు. డాక్టరీలు, డాక్టరేటు చదివిన అబ్బాయిలో ఏ కొద్దిమందో తప్ప, విద్యాధికురాలైన, ఆర్జనపరురాలైన అమ్మాయిని చేసుకోవడానికి ఇష్టపడడంలేదు. తక్కినవారు సరేసరి. ఈ పరిస్థితుల్లో కట్నాల వివాహాలు తప్పుకోవడానికి పై చదువులు చదివిన అమ్మాయిలకు వివాహ సమస్య మరింత జటిలమైన సమస్యై కూర్చుంది. ఏ విషయాన్నీ లెక్క చేయకుండా జరిగినట్లుకానీ అని ధైర్యం చేసి ఉద్యోగాల్లో ప్రవేశిస్తున్నారు అమ్మాయిలు. ఎంత చేసినా, ఎంత చదివినా స్త్రీ జీవితానికి ఏది ముఖ్యమో అదే సమస్య ఎక్కడికి వెళ్ళినా కదలకుండా అడ్డు తగులుతూంది.

ఇకపోతే—విద్య నభ్యసిస్తూనో లేక ఉద్యోగం చేస్తూనో ప్రేమించి వివాహం చేసుకోవడానికి అవకాశం కొంతవరకూ వున్నా, అక్కడా సమస్యగానే వుంటున్నది. ఈ ప్రేమ వివాహాలన్నీ స్త్రీ పురుషుల స్వంత బాధ్యతపైన జరిగేవి కాబట్టి, వివాహానంతరం వచ్చే సాధక బాధకాలు భరించేది ముఖ్యంగా స్త్రీయే కాబట్టి ఇవి అంత చెలామణి

వనితాలోకం వ్యాసరచన పోటీలో రెండవ బహుమతి పొందిన వ్యాసం

లోకి రావటంలేదు. స్త్రీ జీవితం అరటాకులాటి దంటారు. కాబట్టి ఎక్కడ బెడిసికొట్టినా సున్నిత మైన స్త్రీ జీవితమే దెబ్బ తింటుంది.

అంతేకాక— అంతవరకూ ప్రేమని వెంట బడి, వలపులొలకబోసిన అబ్బాయిలు, ఆ ప్రేమిం చిన యువతి మెడలో పుస్తె కట్టే వేలుకుందుకు వెనకంజ వేస్తారు. ఒకవేళ వివాహమంటూ చేసు కొన్నా, ఆవేడి చల్లారాక ఒకరి నొకరు దుయ్య బట్టుకొంటూ, మనసులు విరిగి కాపురాలు చెడి పోయేదాకా వస్తుంది. వివాహం, జీవితంలో అతి ముఖ్యమైన మధుర ఘట్టం! పదికాలాల పంటైన ఈ వివాహం చేసుకొనే ముందు ఎక్కువగా ఆలో చించడం స్త్రీల వంతు.

ప్రేమ వివాహాలైనా పెద్దవాళ్ళ ఆమోదంతో బాధ్యతతో జరిగితే అంత బాధ పడాల్సిన పని ఉండదు. పెద్దవాళ్ళ ప్రమేయం లేకపోతే, వివాహా నంతరం భర్త దగ్గిర సరైన రక్షణ లభిస్తుందో లేదో కలగని ఉండరు అమ్మాయిలు. అందుకే చాలావరకూ పెద్దవాళ్ళు కుదిర్చే సంబంధాలపైనే ఆధారపడాల్సి వస్తూంది.

ఇక వర్ణాంతర వివాహాలు చూద్దామూ అంటే అవి కూడా అంత ప్రోత్సాహకంగా లేవు. ముఖ్య కారణం! మన దేశంలో అనాదినుండీ వస్తున్న భేదాలే కారణం. కులాలూ, మతాలూ మనం సృష్టించు కొన్నవే అయినా ఆ భేదభావం నరనరాల్లోనూ జీర్ణిం చుక పోవటంవల్ల, ముందుకు వచ్చిన యువతీ యువకులను తల్లి దండ్రులే చెడగొట్టుతున్నారు. ఈ మతాంతర కులాంతర వివాహాలవల్ల సంఘంలో ఎదుర్కొనే సమస్యలు చాలావరకూ స్త్రీనే బాధి స్తాయి కాబట్టి ఆ విషయం కూడా సమస్యగానే వుంది.

నన్ను వివాహం చేసుకో, నాకు పెళ్ళిచేయి అని అడిగిన ఆడది, తనవారి దృష్టిలోనేమి, ఎదుటివారి దృష్టిలోనేమి అతి తేలికగా పరిగణించబడుతుంది. మరి ఇన్ని అడ్డంకులతో కూడుకున్న ఈ వివాహ సమస్యకు పరిష్కార మార్గమేమిటి ?

అత్తా ఒకింటి కోడలే కాబట్టి—తన బిడ్డ లుక కట్నాలు యిచ్చుకోకుండా,తెచ్చుకున్న అమ్మాయి దగ్గిర పుచ్చుకోకుండా వివాహాల జరిపించుకోగలిగి, ప్రతి గృహిణి ఇదే మాదిరి ఆచరించగలిగితే వివా హాల సమస్య దానంతటదే విడిపోగలదు. ఆలా మతాంతర, కులాంతర వివాహాల ప్రోత్సహించి వారికి సంఘంలో తగు చేయూతనిస్తే, మనలో విభేదాలు నశించి అందరూ భారతమాత బిడ్డలై, ఏక కుటుంబీకుల్లా సామరస్య భావంతో మెలగ డానికి అవకాశముంది. ఇచ్చుకోవడాలూ, పుచ్చుకోవ డాలూ అనే మొఖమాటాలు వుండవు. ఐతే ఇది సాధ్యమా? వివాహం కేవలం ఒక వ్యక్తిగత సమస్య అని పరిగణించగల మనోపరిపక్వత అందరిలోనూ కలిగినప్పుడే ఈ ఆశయం సిద్ధించగలదు. కట్నాలు, వివాహాలు రెండూ పెనవేసుకొన్న సమస్య నుండి అందరూ విడుదల పొందగలరు! ●

### గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తి పేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥

### వెలువడింది:

గురజాడ అప్పారావుగారి మొట్టమొదటి కన్యాశుల్కము (1897 నాటి ముద్రణ)
(శ్రీ కె. వి. రమణారెడ్డి ప్రేరణ, ఆరుద్రగారి పర్యవేక్షణలో)
తొలి ముద్రణ ప్రతిని సేకరించి విపులమైన పీఠిక, వివరణలతో ప్రచురించినది—బం. గో. రె.
ప్రతులకు:—బంగోరె, జమీన్ రైతు నెల్లూరు. వెల: రు. 4-50.

## తోటి ఉపాధ్యాయుని కళ్ళల్లో ద్రావకం

నర్సారావుపేటలో రామకృష్ణా వోరియంటల్ స్కూలులో పనిచేసే పూసపాటి శ్రీశైల బ్రహ్మ వందరావు అనే ఉపాధ్యాయుడు అదే స్కూలులో పని చేసే హనుమంతరావు అనే తోటి ఉపాధ్యాయుని కళ్ళలో మహా ద్రావకం పోశాడట. ఈ చల్లడంలో హనుమంతరావు పక్కన కూర్చున్న ఉపాధ్యాయుల మీదా కొంత పడి వారి వొళ్ళు కాలిందట. హనుమంతరావు కళ్ళు రెండూ కాలిపోయాయట.

*　　　*　　　*

మరణం అనేక పద్ధతుల్లో మనిషిని స్వాధీన పరచుకుంటుంది. తాటి చెట్టు ఎక్కిన ఒకాయన తనకు తల తిరుగుతున్నట్టుందని క్రిందనున్న కొడుకుతో చెప్పి ఆ చెట్టు మీదే వీలు చేసుకుని




పడుం వాల్చాడట. ఆనక ఎంతసేపటికీ క్రిందికి దిగిరాక పోయేసరికి చుట్టుపక్కల వారు చెట్టు పైకెక్కి చూశారట. ఆయన చనిపోయి వున్నాడట. ఇది పాలఘాట్‌కి 20 మైళ్ళ దూరంలో వున్న ఓ పల్లెటూర్లో జరిగింది.

*　　　*　　　*

కురుక్షేత్ర యూనివర్శిటీలో ఒక స్త్రీని అవమానపరచాడో విద్యార్థి అన్న విషయం మీద రగడ లేచిందో నెలన్నర క్రితం. విద్యార్థులంతా సమ్మె చేశారు. ఈ విషయం మీద విద్యార్థులు రెండు వర్గాలుగా విడిపోయి తన్నుకున్నారట. ఒక విద్యార్థికి తీవ్రమయిన దెబ్బలు తగిలి చావుబ్రతుకుల మధ్య వూగిసలాడుతున్నాడు. ఆ విశ్వవిద్యాలయం తిరిగి మూతపడిపోయింది. ఇకనుంచీ కళాశాలలకూ వాటికీ దసరా దీపావళి వేసంగి వంటి శలవలు ఇవ్వకుండా సమ్మె చేసినపుడల్లా ఓ వారం పది రోజులు శలవలిస్తూ పోతుంటే బాగుంటుంది.




## దారుణానికి కారణం?

పొయేటియర్స్ (ఫ్రాన్స్)లో 45 ఏళ్ళ కాన్స్టన్ క్లిమెంట్ అనే వ్యవసాయదారుడు తన తండ్రిని తల్లినీ మేనత్తనూ—మొత్తం కుటుంబంలోని అందర్నీ చంపేసి ఒక చితి పేర్చి దానికి నిప్పంటించి తన మీద పెట్రోలు పోసుకుని వెళ్ళి ఆ మంటలో దూకాడట. ఇంట్లోంచి లేచిన మంటలను చూసిన పొరుగువాళ్ళు తలుపులు పగలకొట్టి లోపలకు వెళ్ళేసరికతను కాలి మసి అయిపోయాడట. ఇంత దారుణాన్ని చేయమని అతని మనస్సును ప్రేరేపించిన ఆ సంఘటన ఏమిటో మాత్రం తెలియలేదు. అదీ అతనితో పాటే తగులబడిపోయింది.




## కర్రపెట్టెలో శవం

వేలూరులోని ఒక టీ షాపులో పని చేస్తున్న రాజేంద్రన్ అనే అతని శవం ఒక పెట్టెలో దొరికిందట. ఆ టీ షాపుకు ఎదురుగా ఒక సోడా కొట్టు వుందట. ఆ కొట్లోని ఒక కర్రపెట్టెలో అతని శవం కుక్కేసి వుందట. ఈ దారుణానికి కర్త లెవరో కూపీలు తీస్తోంది ఆ శాఖ.

## అవమాత్యుని చాకచక్యం

ఐర్లండులో ట్రినెటి కాలేజి ఆడిటోరియంలో ఒక సభలో విద్యాశాఖ మంత్రి బ్రియన్ లెనిహాన్ మాట్లాడుతుండగా "కాలేజి ఆఫ్ ఆర్ట్స్"ని మూసి వేసిన కారణం చెపుమని విద్యార్థులు గోల చేశారట.




ఆయన చెప్ప నిరాకరిస్తే "చెప్పి తీరా"లని అరిచి తలుపులూ కిటికీలూ అన్నీ వేసేస్తూ "చెప్తేగాని వదలం" అన్నారట. కానీ లెనిహాన్ అతిచాకచక్యంతో తన పక్కనున్న కిటికీలోంచి ఝామ్మని గంతేసి అంతర్ధానమై పోయాడట.

## స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్ని చిత్రవధచేసిన ఉపాధ్యాయుడు

తిరుచిరాపల్లికి చెందిన ఒక గ్రామంలోని ఒక పాఠశాలను తనిఖీ చేస్తున్న స్కూళ్ళ డిప్యూటీ ఇన్‌స్పెక్టరును ఆ పాఠశాలలోని ఉపాధ్యాయుడు చిత్రవధ చేశాడట. తనిఖీ చేస్తున్న ఆ ఆఫీసరు మెడ మీద పెద్ద కత్తితో బలంగా కొట్టారుట. ఆయన ప్రాణ భీతితో పారిపోతే కూడాబడి ఇరవై ఆరు చోట్ల పొడిచి మరీ చంపాడట. ఈ ఉపాధ్యాయునికి మరణ దండన విధించింది చట్టం.

**కె. పి. ఆర్. ఆర్, హైదరాబాదు**

బాగా పేరు తెచ్చుకోవాలంటే ఎలా?

ఏముందీ రెండు పెద్ద తలలవి కొట్టండి! అదే వస్తుంది పేరు.

**కె. ఎస్. ఆర్, బెక్కం**

పాఠకుల ప్రశ్నలకు అతి చక్కగా సమాధానాలు ఇస్తున్నందుకు పత్రికాధిపతుల నుంచి మీకేమాత్రం ప్రతిఫలం...

ఎంతవస్తే మటుకు ప్రాణికి తృప్తి ఎక్కడ నుండి వస్తుంది? ఏమంటారు?

చిత్రాల్లో మితిమీరుతున్న 'సెక్సు' గురించి మీ అభిప్రాయం?

'సెక్సు— సక్సెస్' అంటున్నారు. సినిమాలు వ్యాపారం కనుక వాటికి సక్సెస్ అవసరం. అవి సక్సెస్ కావాలంటే సెక్సు తప్పదంటున్నారు.... ఇలాగే— వ్యాపారస్థులని చేతులు కాల్చుకోమన డానికి మనకేం హక్కుంది? అంచేత చూడ్డం మానేస్తే తీయడం వాళ్లే మానేస్తారు. ఏమంటారు లేకుంటే ఇదంతా ఏదో మెలిక మాటలాగా ధ్వనిస్తోందా?

**ఎస్. కె. వి, పాలకొల్లు**

ఎస్. ఎస్. ఎల్. సి కి అక్టోబరులో వెడుతున్నాను. భాషా ప్రవీణకుకూడా వెడుతున్నాను. లోగడ జాతీయ అంతర్జాతీయ మహా సభలలో భారత ప్రతినిధిగా ఇరవై అయిదు సంవత్సరాల వయస్సులోనే పాల్గొన్నాను. అయినా నాకు విద్యావతి సంస్కారవంతురాలు సౌశీల్యవతి అయిన యువతి జీవిత భాగస్వామిగా కావాలని ఆశ. ప్రతిభా సామర్థ్యాలను ప్రదర్శించ డానికి అవకాశాలు కలిసిరాక ఆశ్రయాన్నికోరే యువతి మీ ద్వారాకాని మీ శీర్షిక ద్వారాకాని లభ్యం అవుతుందంటారా?

ప్రతిభా సామర్థ్యాలు ప్రదర్శించడానికి వివాహం చేసుకోవాలా?! అలాంటి ఆశలున్న యువతి తప్పక రాస్తుంది లెండి బ్రదర్— గుడ్‌లక్.

**వి. ఎమ్. కె. పి, జమ్మికుంట**

మీరు జవాబు లిచ్చేందుకై ఎన్నికచేసిన ప్రశ్నలను పాత సంచికలను దయచేసి ఒక్కసారి తిరగవేస్తారా? పక్షపాతంతో ఆంధ్ర ప్రాంతంనుంచి వచ్చిన లేఖలకే ప్రాధాన్యత నిచ్చిన గుర్తించగలరనుకొంటాను. మంచి ప్రశ్నలకే స్థానమిచ్చి మీ ఈ శీర్షికకు నిర్దేశింపబడిన పవిత్ర లక్ష్యాన్ని సార్థకం చేయకలరని ఆశిస్తున్నాం.

మీ ఆశ వమ్ము చేయనులెండి. అయినా ■ ప్రాంతానికీ చెందని నేను ప్రాంతాలకి పక్షపాతం చూపడం ఏమిటి? ఎవరేనా వింటే నవ్వుతారు.




వరసగా ఉత్తరాలు చూస్తూ వచ్చిన ప్రశ్నలకి సమాధానాలు రాస్తూంటానంతే. కులమత వర్గ ప్రాంతాలు విభేదాలు నా బుర్రలో ఉండవని చెప్ప డానికే ఇంత రాస్తున్నాను. ఏ ప్రాంతంవారైనా సాటి పౌరుణ్ణి ఉదారంగా, గౌరవంగా చూడగల్గిన వాళ్ళే ప్రపంచపౌరులవుతారు. ప్రాంతాల వైషమ్యాల కినీడ కూడా ప్రశ్నల చుట్టూ రానీకండి సోదరా, అదే నే కోరేది.

**ఎస్. పి, జగిత్యాల**

పెద్ద పెద్ద డిగ్రీలు విజ్ఞానానికి కొలబద్ద కాదని నా అభిప్రాయము. మీరే మంటారు రచయిత్రిగారూ.

నేనూ అదే అంటాను గాని, శంఖంలో పోస్తేనే గాని తీర్థం కాదన్నట్టు డిగ్రీలు లేని విజ్ఞానానికీనాడు రాణింపు ఉండడం లేదు పేరాజుగారూ, అదే ఇబ్బంది.

**బి. ఎస్. డి, హైదరాబాదు**

నా పిల్లలకు తండ్రిమీదున్న గౌరవం తల్లిపై లేదు.

అది తండ్రి తప్పు. పిల్లల ముందర తల్లిని లోకువగా మాట్లాడితే పిల్లలలాగే తయారవుతారు....

**జి. ఎస్, విజయవాడ**

అక్కయ్యా జీవితంలో మనిషికి ఏమి కావాలి?

'ఒక పిడికెడు సానుభూతి!'

**బి. ఏ. ఆర్, అనకాపల్లి**

నా కెవరికైనా వితంతువుని వివాహం చేసుకోవాలని ఉంది. కాని సంఘం వెలివేస్తుందని భయం.

మీరే శతాబ్దంలోని వారు బాబూ?

**టి. ఎల్, నాయుడుపేట**

రామలక్ష్మిగారూ దయచేసి యద్దనపూడి సులోచనారాణిగారి ఎడ్రసు తెలుపుతారా?

ఇలా చాలామంది రాస్తూంటారు సోదరీ, అయినా అవతలి వారి ఇష్టాయిష్టాలతో పనిలేకుండా వారి చిరునామా అందరికీ తెలియచేసే హక్కు నా కెలా ఉంటుందనుకున్నావు?

**కె. వి హెచ్. సర్పవట్నం**

మానవత్వానికి మతంతో ఏమైనా సంబంధం ఉందా?

లేదు.

'డబ్బు సంపాదించడంకూడా ఒక కళే' అంది మధ్య ఒక రచయిత్రి.

కాదా మరి?!

**కె. వి. పి. ఆర్. అక్కినేపల్లి**

గురువుగారూ, ఒక వ్యక్తియొక్క లోపములను పదే పదే వెలికి తీయుచు అవమాన పరచుచున్నారు. సున్నితమైన హృదయం కల్గిన ఆ వ్యక్తి అవమానమును భరించలేక చేయవలసిన కర్తవ్యము వివరిస్తారా?

తాళ్లవాని ఇవన గొడుగు అన్నారు. రాజు తలడమే కర్తవ్యము శిష్యా, ప్రయత్నింపుము.

**కాళి, కొండకొలను**

మీ నవలలో 'కురువేరు' అనేదాన్ని గూర్చి వ్రాశారు. అదెక్కడ దొరుకుతుంది? ఎలా ఉంటుంది?

"కురువేరు" సాధారణంగా కదంబంలో వేసి కట్టుతారు. చూడ్డానికి ముదురు బ్రవునులో (దరిదాపు నలుపే అనవచ్చు) వట్టివేరు ముక్కల లాగే ఉంటుంది. వచ్చిది దొరుకుతుంది. కాని ఎండినకొద్దీ సువాసనలు గుబాళిస్తుంది. తలంటుకున్న జుట్టులో ఇది పెట్టుకుంటే వారందాకా సువాసన తలని పట్టేస్తుంది. దాని ముందు సెంటు మానెలు బలాదూరే.

**బి. వి. పి. ఆర్, బీహార్**

ఎటువంటి క్లిష్ట ప్రశ్నలకైనా మీరు జవాబులు అతి సూక్ష్మంగా ఇస్తున్నారంటే అదంతా శ్రీ భాసా సుబ్బారావుగారి స్వతంత్ర పత్రికలో పొందిన అనుభవమే అనుకుంటాను. ఏమంటారు?

అంతే అనుకోవాలి. అంతేకాదు — గోరాశాస్త్రి చేత తిన్న తిట్లూ దీవనలూ కూడాను. గోరాకి ఒక్క పెల్లమాట రాస్తే చిర్రెత్తుకొస్తుంది.... వచ్చేది!

**కె. ఎస్. ఆర్, కొవ్వూరు**

కథలు రూళ్ల కాగితలపై వ్రాయవచ్చునా!

మహరాజులాగా!




ఏకేమయినా కృతజ్ఞత అన్నది ఉంటేగా? ఛ! నా మెడకో గుదిబండలా తగలడ్డావు. ఇంతకీ నేను వెళ్ళాక సింగారించుకుని కిటికీ దగ్గర నిలబడకు. ఛీపోని కొంపో అనుకోగలరు' అంటూ తలుపు భళ్ళున వేసుకుని వెళ్ళిన భర్తను చూస్తూ మంచం మీద నిర్వికారంగా కూర్చుండిపోయింది కమల.

పదేళ్ళ అతనితో కాపరం చేశాక అతని మాటలకు బాధపడే శక్తిని కోల్పోయిందామె. పదేళ్ళ క్రితం అయితే, అతనలాటి మాట అంటే తెగబాధ పడిపోయేది. మళ్ళీ అతను చిరునవ్వుతో పలకరించే వరకూ ఏడుస్తూ కూర్చునేది. అతనువచ్చి 'ఏం దుకు కమలా, అలా ఉన్నావేం? తోటలోకి వెడదామా?' అనేసరికి చిరునవ్వుతో అతన్ని ఎదుర్కొనేది. అతను నవ్వుతూ, ఆనందంగా, ఆప్యాయంగా పలకరిస్తే ఆమె ఎంతో సుఖంగా నవ్వుతూ ఉండేది. లేకపోతే లేనిపోని ఆలోచనలతో సతమత మయ్యేది.

పదేళ్ళ క్రితం.....

కమల అప్పట్లో ఇంటర్ చదువుతుండేది. సూర్యం వాళ్ళ పక్కింటి అబ్బాయి. చిన్నప్పటినుండి ఒకరి కొకరు బాగా తెలుసు. అతనామెకు మంచి స్నేహితుడు. అప్పట్లో కమలకు ఇంకే విషయంలో కొరత లేకపోయినా ఒక్క విషయం తల్చుకుని చాలా బాధ పడేది. కమల మరీ కురూపికాదుకాని, అందగత్తె మటుకుకాదు. నలుగురిలో ఎత్తి కనిపించే వ్యక్తిత్వం అసలేకాదు. చిన్నప్పటినుండి తమ అక్క చెల్లెళ్లలో అందర్లో అందంగా ఉన్న చెల్లెలు విమలతో తన్ని పోల్చుకుని బాధ పడేది. అందర్లోకి అందంగా ఉన్న చెల్లెలు తన పాటలతో, మాటలతో అందర్నీ తన చుట్టు తిప్పుకునే విమల్ని తన్నా పోల్చుకుని 'నేను అలా లేనే' అని కుమిలి పోయేది. అందులోను ఇంట్లో వాళ్ళు తన పెళ్ళికి ఎంత కట్నం ఇవ్వాలి? కట్నం ఇచ్చినా పెళ్ళికావటం ఎంత కష్టం అనుకుంటూంటే విని నో రకమయిన ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుని పెంచుకుంది. ఎప్పుడయినా శెలవుల్లో, సాయంకాలాల్లో ఇంట్లో ఉంటే ఇలాంటి మాటలు వినాలిన్న భయంతో పక్కింటికి పారిపోయేది.

అలాటి సమయంలో చనువుగా, స్నేహ పూర్వకంగా మాటాడే సూర్యం చాలా ఆత్మీయుడుగా కనపడ్డాడు. ఎన్ని రోజులుగానో అణిచిపెట్టుకున్న బాధ అంతా ఒకరోజు అతనితో చెప్పింది. ఆ రోజున కమల తల్లి భర్తకు మధ్యాహ్నం కాఫీ ఇస్తూ,

'ఏమండీ, కమలకేమయినా సంబంధాలు చూశారా?' అని కమల పెళ్ళిమాట ఎత్తారు.

'చూడు, విమలకు పెళ్ళి చేయమంటే ఈ నెల్లో చెయమన్నా చేసేస్తాను. కమలకంటావా నేనేం చెప్పలేను. దాని అందంచూసీ, మనం ఇవ్వబోయే ముష్టి రెండువేలు కట్నం చూసీ ఏ వరు

జేస్తాడు చెప్పు?'

ఇంతవరకూ విన్న కమల ఇహ అక్కడుండలేక వెక్కెక్కి ఏడ్చింది. ఏదో పత్రిక తిరగేస్తున్న సూర్యం కమల్ని చూడగానే—

'అదేమిటి కమలా అలా ఉన్నావ్, ఏమయింది?' అంటూ లేచి దగ్గరకొచ్చాడు. ఎన్నేళ్ళగానో ఎవరితోనూ చెప్పుకోకుండా దాచుకున్న దుఃఖమంతా ఒక్క మారుగా పొంగివచ్చింది.

'ఈ బాధ నేను పడలేను సూర్యం. నా అనాకారితనం నన్ను మాత్రమే బాధపెట్టేలా అయితే వర్రీలేదు సూర్యం. కాని నా గురించి అమ్మా, నాన్న కెంతబాధ చూడు. ఇంకెంత కాలం నాకు చదువు చెప్పించగలరు? ఈ ఇంటర్లో, బియ్యేనో అయ్యాక పెళ్ళి చేయక తప్పదు. కాని నాలో ఏముందని ఎవరయినా నన్ను పెళ్ళి చేసుకోవటానికి ఇష్టపడతారు చెప్పు? నాకున్న పాటి చదువు ఎంతోమంది అమ్మాయిలకుంటుంది. అందమా? డబ్బా? నేను చచ్చిపోతే ఎవరికీ ఏ సమస్యా ఉండదు' అంటూ కమల చేతుల్లో మొహం దాచుకుని ఏడవసాగింది.

'అదేంమాట కమలా? నిన్ను నేను పెళ్ళి చేసుకుంటాను. చావు మాట మరియెత్తకు. నువు అందంగా లేవు. నీకు డబ్బులేదు. అంతా నిజమే. అయినా నిన్నే పెళ్ళి చేసుకుంటాను నేను. నీకీబాధ తప్పించటానికి ఎలాంటి త్యాగమయినా చేస్తాను కమలా' అని సూర్యం అనేసరికి కమల విస్తుపోయింది. ఒక్క నిముషం అది కలా, నిజమా అనిపించింది. రాత్రి చీకట్లో తోవతప్పిన మనిషికి దూరాన కనిపించే వెలుగు, అది ఏదయినా ఇంటి దీపమన్న నమ్మకం చిక్కనట్టే, కమలా అతని మాటల్ని నమ్మలేక పోయింది. ఆ అపనమ్మకంతోనే—

'నిజంగానే అంటున్నావా సూర్యం. నా కోసం అంత త్యాగం చేయటానికి సిద్ధంగా ఉన్నావా? అయినా ఒక్కమారు ఆలోచించు. నేను కాకపోతే నీకు ఎంతో అందమూ, డబ్బూ ఉన్న అమ్మాయి దొరకవచ్చును' అంది.

'నిజమే. కాని నేను నిన్నే పెళ్ళి చేసుకుంటాను. అయితే ఇప్పట్నుంచీ ఈ విషయం వూళ్ళో అంతా చాటకుమీ. నా ఎం. ఎస్సీ అయిపోనీ. తర్వాత ఇంట్లో చెబుతాం. మీ ఇంట్లో వాళ్ళేలాగా వద్దనరు. నీకు, ఇంత చదువుకున్న అందమయిన అబ్బాయి దొరికితే అదే తమ పుణ్యం అనుకుంటారు. మా ఇంట్లో వారితో దెబ్బలాడాల్సి వస్తే దెబ్బలాడతాను. ఇక ఏడవకు మరి. ఎవరో కొంతమంది అమ్మాయిలే ఏడిస్తే బావుంటారు.'

అలా ప్రారంభమయింది వారి ప్రేమ వ్యవహారం. అతన్ని ఓ రకంగా ఆరాధించేది కమల. కమలకంతవరకు పెద్దగా అబ్బాయిలతో పరిచయం లేదు. పరిచయమున్న సూర్యం ఆమెకు ఆరాధ్య దేవత అయ్యాడు. అతను ఏ లోపమూలేని దేవుడిలా అగుపించేవాడామెకు.

ఆ తరువాత రెండేళ్ళ వరకూ భూమిమీద నిలవలేదామె. అదేదో తెలీని ఉత్సాహం ఆమెను సదా సంతోషంగా ఉండేలా చేసింది. ఆమెలో పొంగిపొరలే ఉత్సాహాన్ని చూసి ఇంట్లో అందరూ విస్తుపోయారు. అది వేసంగి కావటం మూలాన్న తరచు సూర్యాన్ని కలుసుకోగలిగేది ఆమె. ఎన్నోపేవార్లు.

'నిరాశతో చావాలని ఉన్న నన్ను దేవుడిలా వచ్చి ఆదుకున్నావు సూర్యం' అనేది కృతజ్ఞతతో. అతను ఓ చిరునవ్వు నవ్వి వూరుకునేవాడు.

'అలా నవ్వుతూంటే అచ్చం దేవానంద్‌లా ఉన్నావ్ సూర్యం' అనేది కమల అతన్ని ఆరాధనా భావంతో చూస్తూ.

ఆ సంవత్సరం అతను ఎం. ఎస్సీ చదవటానికి వాల్తేరు వెళ్ళాడు. అతను వెళ్ళాక కమల చాలా బెంగపెట్టేసుకుంది. అంతవరకు ఏమీకాని వ్యక్తి ప్రేమ అన్న భావన కలిగేసరికి ఎంత దగ్గరవాడయిపోయాడు. అని ఆశ్చర్యపోయిందామె. రెండు రోజులకోమారు ఉత్తరం రాసేదతనికి. వాటిలో అతన్ని తనెంతలా ఆరాధిస్తోందో అతను తన దగ్గర లేకపోతే ఎంత బాధగా ఉందో రాసేది.

'ఇంతకుముందు జీవితం చాలా నీరసంగా అనిపించేది సూర్యం. కాని దానిలో ఇంత ఉత్సాహాన్ని నింపి, జీవితాన్ని ఆనందదాయకమనిపించేలా చేసి వెళ్ళిపోయావు. నిన్ను చూడకుండా, నీమాటలు వినకుండా ఎలా ఉండను సూర్యం? ఇంతకీ ఎప్పుడొస్తావు?'

'నీకు సెలవులెప్పుడొస్తాయో అని ఎదురు చూడటంలోనే నా సమయమంతా గడుస్తోంది. ఇప్పుడెవరైనా 'ఏమిటి బాబూ, ఇంత అసహ్యంగా కనిపిస్తున్నావు' అని అన్నా మునుపటిలా బాధపడటంలేదు. నా సూర్యానికి నేను బావున్నాననిపిస్తే చాలు. మిగిలిన వాళ్ళ కళ్ళకెలా కనిపిస్తేనేం? అయినా ప్రేమకూ, అందానికీ సంబంధమేమిటి చెప్పు? ఉట్టి ఆకర్షణే అయితే అప్పుడు అందం ప్రశ్న వస్తుంది. ఇంతవరకూ ఎవరికీ కనిపించని అందం నీకు కనిపించిందంటే దానికి కారణం నీకళ్ళే. అవునా?'

'చిన్నప్పటినుండీ కని, పెంచిన తల్లీ, అమితంగా ప్రేమించే నాన్నా, అక్కా, అక్కా అంటూ దగ్గరకొచ్చే చెల్లీ, తమ్ముడూ అందరూ ఇప్పుడు దూరమయ్యారు. నీకోసం వీళ్ళనందర్నీ వదులుకుని వచ్చేయటానికి సిద్ధంగా ఉన్నాను. నువ్వు తోడుగా ఉన్నావంటే ఎలాంటి చీకట్లోనయినా నిర్భయంగా నీవెంట వచ్చేయగలను.'

అలా, అలా ఎన్నో ఉత్తరాలు రాసేది కమల. తన ఉత్తరాల్ని ఎంతో ఆత్రుతగా చదివి గర్వపడే వ్యక్తి ఒకడున్నాడన్న తలంపే ఎంతో సంతృప్తినిచ్చేదామెకు.

ప్రేమికులకు ప్రపంచమంతా అందంగా కనిపిస్తుందంటారు కాని కమల విషయంలో మటుకు అది నిజం కాలా. సూర్యం ప్రేమతో ఆమె సుఖి నిజమే. కాని ఆమె దుఃఖినికూడా. అతని ప్రతీ ఉత్తరం చదివేటప్పుడూ కన్నీరు కార్చేదామె. 'ఇంత ప్రేమిస్తాడు సూర్యం నన్ను, కాని నన్నిలా బాధించటంలో అతనికి కలిగే తృప్తి ఏమిటో' అనుకొనేది. అతనయి అతనే తను చేసిన పొరబాటును గుర్తించేవరకు ఇక ఉత్తరాలు రాయకూడదు అని గట్టిగా నిర్ధారించుకునేది. కాని ఆమె ఉత్తరం రాయటం ఒక్కరోజు ఆలస్యమయినా నీ ఉత్తరాల కోసం వేయికళ్ళతో ఎదురు చూసే ప్రాణి వాల్తేరులో ఉన్నడన్న విషయం మర్చిపోయావా తిరుగుటపాలో నీ ఉత్తరం వస్తుందని ఆశిస్తాను అన్న అతని ఉత్తరం ఆమె మనసులోని అనుమానాల్నంతా దూదిపింజెల్లా ఎగరగొట్టేసేది. వెంటనే ఓ నాలుగు తావులు ముందేసుకుని ఉత్తరం రాయటానికి కూర్చునేది.

వాల్తేరు వెళ్ళిన కొత్తలో సూర్యం ఓ ఉత్తరంతో—

కమలా,

ఇవాళ ఓ అందమయిన అమ్మాయిని చూశాను. ఎంత బావుందనుకున్నావ్. సన్నగా, పొడుగ్గా, పెద్ద పెద్ద కళ్ళతో బంగారు తీగలా ఉంది. ఆ అమ్మాయి పేరు లావణ్య చటర్జీ. నా క్లాసుమేటు. నేను కాలేజీకి వెళ్ళిన రెండో రోజునే ఆ అమ్మాయి నాదగ్గరకు వచ్చి 'మిస్టర్ రావ్, నేను సిలబస్ రాసుకోలేదు. మీ దగ్గరుంటే ఇస్తారూ? ప్లీజ్' అంది. ఆమె తియ్యటి కంఠం వింటూంటే అంతా మర్చిపోయాననుకో కమలా— నిన్నుకూడా. ఎంతటి అందం ఆ అమ్మాయిది. సల్వార్, కమీజు వేసుకొని ఆ అమ్మాయి నడుస్తూంటే...... వోహ్ ఆ అందాన్ని ఏమని వర్ణించను? ఇంతకీ అబ్బాయిలంతా లావణ్య నన్నే పలకరించినందుకు కంగ్రాచ్యులేట్ చేస్తూ ఏమిటన్నారో తెలుసా? ఇంతమంది అబ్బాయిల్లోకీ నన్నే పలకరించటానికి కారణం నా అందమట. నేను గ్రిగరీపెక్‌లా ఉంటానని అమ్మాయిలనుకొంటూంటే విన్నారట. మొత్తం మీద నా అందంతో యూనివర్శిటీలోని అమ్మాయిల్నందర్నీ తిప్పుకోవచ్చని అంటున్నారు. చూడాలి మరి.....

వెంటనే ఉత్తరం రాస్తావు కదూ? నీ ఉత్తరం కోసమే ఎదురు చూస్తూంటా!

అని రాశాడు. తన గురించి ఒక్క ముక్కయినా లేకుండా అతను రాసిన ఉత్తరాన్ని చూసి ఆమె హృదయం అసూయతో భగ్గుమంది. మళ్ళీ ఉత్తరంలో కమల—

'నువ్వు లావణ్యని ప్రేమించటం లేదు కదా సూర్యం? అలాగే ఉంది నీ వాలకం చూస్తే. అలా మాత్రం చేయకు సూర్యం. నాకిప్పుడు ప్రపంచంలో మిగిలినది నువ్వొక్కడివే. మిగిలిన వారేమయినా, నువ్వొక్కడివీ నా వాడివిగా ఉన్నావన్న ఆశతో జీవిస్తున్నాను నేను. ఇకప్పుడు నువ్వు ఇంకా అందమయిన అమ్మాయిని చూసి 'ఆ అమ్మాయే కావాలినాకు. నువ్వొద్దు' అంటే నా గతేంకాను. ఎవరుకాదన్నా గోదావరి ఆశ్రయమిస్తుందిలే' అంటూ తన బాధనంతా వెళ్ళబోస్తూ సూర్యానికి ఉత్తరం రాసింది. సూర్యం జవాబుని విప్పి చదవటానికికూడా భయంవేసిందామెకు. దానితో తన జీవితం అటో ఇటో తేల్చేసే ముక్క ఉంటుంది. 'నీకు గోదావరే గతి' అంటే......

వణికిపోతూ ఆ ఉత్తరాన్ని విప్పింది. దానిలో రెండే పంక్తులు ఉన్నాయి.

'ఏది ఏమయినా నిన్నే పెళ్ళి చేసుకుంటాను. ఆ హామీ చాలుగా. ఇక దేని గురించి పట్టించు

కాదు."

అదే ఆమెకు అమితానందాన్ని కలిగించింది. ఇక నాకు కావాల్సిందేమిటి అని తృప్తిగా నిట్టూర్చింది.

కాని ఆ తృప్తి ఎన్నో రోజులు నిలవలేదు. అప్పు డప్పుడు సూర్యం ఉత్తరాల్లోని కొన్ని వాక్యాలు ముళ్ళలా గుచ్చుకుంటూనే ఉన్నాయి. అలాంటి ఉత్తరాలు చదివి నప్పుడు ఆమెకు 'ఏ, సూర్యం ఇంత హీనంగా ఆలోచిస్తాడేమిటి? అనిపించేది. అయినా అతనంటే ఉన్న ప్రేమ ఆ భావాన్ని ఆమెలో ఎక్కువకాలం ఉండనీయ కుండా చేసేది. ఓ మారతను—

'నువ్వు ఎప్పట్లాగే సింగారించుకుని కాలేజీకి వెళుతున్నావనుకుంటాను. అయినా నీకింకా చదువెం దుకు, ఎలాగయినా అందంగా కనబడి అబ్బాయిల్ని ఆకర్షించాలన్న లావు శ్రయం కాకపోతే? యూనివర్సిటీ అమ్మాయిల పీడలోని నిన్ను పెళ్ళిచేసుకుంటా నన్నానుకదా, ఇంకా చదువెందుకు చెప్పు?' అని రాశాడు.

'అతనికిలాగానే నాకూ చదువు అవసరమని ఎందుకనుకోడు? నాకు కొత్త కొత్త విషయాలు తెలుసుకోవాలన్న కోరికా, నా పరిధిని పెంచుకోవా లన్న ఆకాంక్ష ఉండదని అనుకున్నాడా? లేక నేను ఏదీ తెలుసుకోనక్కర్లేదని అతని అభిప్రాయమా? అని ఓ రోజంతా బాధ పడింది. మళ్లీ 'అదేంలేదు, నేను ఎండా, వానా అన్నవి లేకుండా ఇలా తిరగటం అతనికిష్టంలేదు' అని తన్నుతానే సమాధానపర్చు కుంది.

సూర్యం ఎదురుగుండా ఉన్నప్పుడు ఆమెకు ఇవేవి జ్ఞప్తికి వచ్చేవికావు. అతనిమీది ఆరాధనా భావంతో ఆమె హృదయం నిండిపోయేది కాని అతను వాల్తేరు వెళ్ళాక ఓ రకమయిన అశాంతితో చికాకు పడిపోయేది. ఒక్కోమారు ఆమెకు అను మానం వచ్చేది. 'నిజానికి సూర్యానికి తనంటే అభిమానం ఉందా?' అని. అలా అనిపించినప్పుడే ఓమారతన్ని ఆ ప్రశ్నే అడిగింది.

'చాలా పిచ్చిగా ఉంది నీ ప్రశ్న.' అని నవ్వి వూరు

# ఆంతర్యాలు

కున్నాడు అతను.

'నిజమే, అంతా నా పిచ్చిగాని, ఎందుకిలా ఆలో చిస్తున్నాను. నేనంటే ఎంత ఇష్టం లేకపోతే అం దర్నీ వదులుకుని అయినా నన్ను పెళ్ళి చేసుకోవటా నికి సిద్ధపడతాడు! సూర్యం నా వాడు. ఇంకే విష యం గురించీ పట్టించుకోకూడదు.' అని సంతృప్తి పడింది కమల.

ఆమె ఎంత సరిపుచ్చుకున్నా, ఎందుకో రోజులు గడుస్తున్న కొద్దీ— సూర్యం తనకు దూరమవు తున్నాడనిపించింది కమలకు. అతనంటే ఎంతో అభి మానం ఉందామెకు. అతను వూరికి వస్తున్నా డంటే సంతోషమే. కాని......

కాని ఇప్పుడు మొదటిలా వారానికి నాలుగు ఉత్తరాలు రాయాలని కాని లేకపోతే రెండురోజులు సెలవిచ్చినాసరే అతనువస్తే బావుండునన్న కోరికగాని లేవామెలో. అతని దగ్గర్నుండి జవాబు రావడం ఆలస్యమయినా మొదటిలా ఆవేదనలేదు. కాని ఆమె మొదటిలా ఉత్తరాలు తరచుగా రాయకపోతే సూర్యానికి చాలా కోపం వచ్చేది. అలా కోపం వచ్చి నపుడు అతను రాసే ఉత్తరాలు చాలా క్రూటల్‌గా ఉండేవి.

"నీకు నేనంటే లక్ష్యం లేదు. కృతజ్ఞత అసలే లేదు. లేకపోతే ఇంకో బాయ్ ఫ్రెండ్ దొరికాడా? అయినా నీ మోహానికి బాయ్ ఫ్రెండ్ కూడానా? ఎవడు ప్రేమిస్తాడు నిన్ను? వారానికి రెండు ఉత్తరా లన్నా వెలకురెండు చేశావేం? నీకు తెలుసుగా ఇలాంటి వన్నీ సహించి వూరుకునే వాడిని కానని. ఈ ఉత్త రం అందుకున్న వెంటనే జవాబురాయాలి నువ్వు. నీకీ వుత్తరం బుధవారంనాడు అందుతుంది. శుక్రవారం లోగా నీ ఉత్తరం క్షమాపణతోసహా నాకందాలి" అని.

ఆ ఉత్తరంతో కమలకు ఒక్కమారుగా అతనంటే ఏమిటో తెలిసినట్లయింది. అతనంటే వో రకమైన భావంతో మూసుకుపోయిన ఆమె కళ్ళు, అకస్మాత్తుగా తెరచుకున్నాయి. ఏదో సుందర స్వప్నంలో విహరిస్తున్న మనసు, మేలుకున్నాక, కనిపించే అతి హ్యమయిన వాస్తవికతను చూసి బెదిరిపోయేలాగా ఆమె కూడా కొత్తగా కనిపిస్తున్న అతని రూపాన్ని వ్యక్తిత్వాన్ని చూసి బెదరిపోయింది. ఆ షాక్‌నుండి కొంచెం తేరుకున్నాక నెమ్మదిగా ఆలోచించసాగింది.

'ఇంతకీ అందుకా, అతన్నిలా కేవి తన్ని అతను ప్రేమించలేదు. అతనికి ఎలాంటి వారినయినా సరే ప్రేమించే శక్తిలేదు. అతను తన్ను పెళ్ళిచేసు కుంటానని అనటం ఒక్క కారణానికోసమే — తన ఆరాధనా, అభిమానం అతనిలోని వో దాహాన్ని తృప్తి పరుస్తున్నాయి. దుఃఖంలో పడి చనిపోయినా ఫర్వాలేదనుకుంటున్న వో ప్రాణికి జీవదానం చేశా నన్న భావనతో గర్వపడుతున్నాడు. అదీకాక అతన్ని ఎవరయినా ప్రాణమిచ్చేంతగా ప్రేమిస్తున్నారన్న ఆలోచన అతనికి సంతృప్తినిస్తోంది. అతను సెల్ఫ్—సెంటర్డ్ మనిషి. అతనికి తన్ను తప్ప మరెవ ర్నయినా ప్రేమించే శక్తిలేదు. కాని తన్ను మరెవ రయినా గాఢంగా ప్రేమించాలన్న కోరిక మటుకు ఉంది.

'ఒక్కమారుగా ఇదంతా అర్థమయ్యేసరికి కమల తల తిరిగిపోయింది. అయితే అతని ఇంట్లో అతని బానిసలా ఉండటానికి వో ప్రాణి కావాలి. మనిషి అతన్ని ఆరాధించగలిగితే మరీమంచిది. ఎవర్నీ ఆక ర్షించలేని వ్యక్తి అయితే ఎలాంటి భయమూ అక్క ర్లేదు గనుక తన్ని ఎంచుకున్నాడు. పైగా కట్నం తీసుకోలేదన్న అభిమానంతో అతని మాటకు తను ఎదురు చెప్పలేదని అతని నమ్మకం.

'ఇంతకన్నా కట్నం పుచ్చుకుని పెళ్ళాడేవాడే నయం. ముందెంత బేరాలు చేసినా ఆ తరువాత భార్య అని గౌరవంతో నయినా చూస్తాడు. అలాకాక పోయినా కారుచీకట్లో చూడకుండా గోతిలో పడ వచ్చు. కాని తెలిసీ తెలిసీ ఇలాంటి మనిషిని పెళ్ళి చేసుకొని ఆ బందిఖానాలో ఎలా ఇరుక్కోనూ' అను కుంది కమల. అందుకనే వెంటనే అతనికి వో ఉత్తరం రాసింది.

"సూర్యం,

నీకు నాకన్నా అందమయిన అమ్మాయి హా పదిహేను వేల కట్నంతో దొరుకుతుంది. నువ్వలాంటి అమ్మాయిని పెళ్ళిచేసుకోవటమే ఉత్తమమని పిస్తోంది. అవునా? నాకు ఆలోచించే శక్తి, అభి మానించే హృదయం తప్ప మరేమున్నాయి చెప్పు? ఇలా ఏ ప్రత్యేకతా లేని నాతో నీకేం ఆనందం కలుగుతుందో నాకే తెలియటంలేదు. ఇక నా గురించి ఆలోచించటం మానేసి మరో అందమయిన లావ ణ్యచటంల్లో, సరోజనిన్నో, అరుణనో పెళ్ళి చేసుకో. ఏ సుఖమే నాకు కావలసింది.

కమల".

వెంటనే అతని దగ్గరనుండి ముచ్చటగా కాల్చ్ వాక్యాలతో కూడిన వో ఉత్తరం వచ్చింది.

"నీ ఉత్తరాలన్నీ నాదగ్గర ఉన్నాయన్న విషయం మర్చిపోయినట్లున్నావు. నువ్వు మరెవర్నయినా పెళ్ళి చేసుకోటానికి ప్రయత్నిస్తే ఏం జరుగుతుందో



తెలుసుగా. మా నాన్నగారితో మాట్లాడుతాను. వచ్చే వేసంగిలో మన పెళ్ళవుతుంది."

ఆ ఉత్తరం చదివిన కమల నిర్ఘాంతపోయింది. నువ్వు అక్కర్లేదు బాబోయ్' అంటున్న మనిషి గావాలంటాడు. ఇదేం పట్టుదల? పెళ్ళికాకముందే ఇలా ఉన్న తను పెళ్ళయ్యాక అతన్ని ప్రాణప్రదంగా అభిమానించ గలదని భావిస్తున్నాడా? అతను? కాని ఇక తను చేయగలిగిందేమిటుంది? అతను నాన్న గారికి ఆ ఉత్తరాల్లో ఏ ఒక్కదాన్ని చూపినా నాన్న గారు ఉగ్రస్వరూపులయిపోతారు. అమ్మ 'నీమీద ఉంచిన నమ్మకాన్ని వమ్ము చేశావే'అని బాధపడు తుంది. మొత్తానికి తన మాట వినకుండా ఏడు పులా—పెడబొబ్బల మధ్య పెళ్ళి కానిచ్చేస్తారు. ఈ ఆలోచనల మధ్య పొగలమధ్య చిక్కుకున్న మని షిలా ఉక్కిరిబిక్కిరయిపోయింది కమల. కాని ఓ పెళ్ళినుండి తప్పించుకునే మార్గమేదీ కనబడ లేదామెకు— ఒక్క ఆత్మహత్యతప్ప. ఓ రెండేళ్ళ క్రితం అయితే బహుశా ఆపనే చేసేదేమో. కాని అయ్యేదేదో కానీ అన్న మొండి ధైర్యంతో అలాగే నిర్లిప్తంగా ఉండిపోయింది కమల.

అతనన్నట్టుగానే వారి పెళ్ళి ఆ వేసంగిలో అయిపోయింది. సూర్యం తల్లిదండ్రులు మొదట్లో పిసాత్రం కట్నంలేని ఈ సంబంధం వద్దని పట్టు బట్టినా ఎదిగిన కొడుకు మాట కెదురు చెప్ప లేక ఒప్పుకున్నారు. అనుకోకుండా కమల పెళ్ళి సమస్య ఇంత తేలిగ్గా తీరిపోవటంతో మహా సంతోషపడి పోయారు కమల తల్లిదండ్రులు.

సూర్యం పెళ్లికి అతని స్నేహితులు చాలా మందే వచ్చారు. పెళ్లిఅయిన మరునటిరోజున సూర్యం ఉన్న గదిముందుగా వెడుతున్న కమలకు ఎవరో మూర్యాన్ని—

"ఇంత అందమూ చందమూలేని అమ్మాయిని ప్రేమించి—పెళ్ళి చేసుకుంటానంటున్నావ్. కనీసం డబ్బయినా ఉందా?" అనడగటం వినిపించింది. అత నేం జవాబు చెబుతాడోనని అక్కడేఆగి వినసాగింది.

"డబ్బూలేదూ, పాడూలేదు. నేనంటే పిచ్చి అభిమానం ఆ అమ్మాయికీ. ఆ అమ్మాయి రాసిన ఓ ఉత్తరం చూశావుగా. నేనంటే పడి చస్తుంది. కాబట్టి నేనేం చేసినా అడ్డు చెప్పదు. నాకు అరుణా, మల్లికా, రాగిణి, సరోజినీలాంటి స్నేహితులున్నా రని తెలిసినా ఏమీ చెయ్యలేదు. అదే కట్నం తెచ్చిన అమ్మాయైతే నామీద అధికారం చెలాయించటానికి చూస్తుంది. కమల నన్ను అలా దబాయించగలదా. ఇంట్లో కుక్కలా పడివుంటుంది భాయ్.'

సూర్యం మాటలు వింటూంటే కాళ్ళక్రింద భూమి కదిలిపోతున్నట్టుగా అనిపించింది. కష్టపడి వెనక్కితిరిగి తనగదికెళ్ళి పడుకుంది. సూర్యానికి తన గురించి ఉన్న అభిప్రాయం ఖచ్చితంగా తేలిపోయి నది. ఇక ఎప్పటికయినా అతను తన్ను అభిమానించ గలడన్న ఆశ మొలకెత్తకుండానే చచ్చిపోయింది.

ఆ తరువాత ఆమె జీవితం అలాగే అతనన్నట్టు గానే కుక్క జీవితంలాగా గడిచిపోయింది. అతని తిరు గుళ్ళూ, తిట్లూ ఏవీ ఆమె మీద పనిచేసేవికావు. అతని మాటలన్నింటినీ ఓ కఱ్ఱ ముక్కలా, నిర్లి ప్తంగా ఉదాసీనంగా వింటూ నిలబడేది. అతను ఎప్పుడయినా ఆమెని కొట్టటానికి చేయెత్తగా, అలాగే అదే ధిక్కారంతో, సంస్కారంలో నువ్వు నాకన్నా తక్కువ అన్న భావంతో అతని మొహంలోకి చూసేది. ఆ తిరస్కారం అతని చేతిని ఇక ముందుకు వచ్చేలా చేసేదికాదు.

ఎప్పుడయినా, ఎవరికయినా ఆమెను పరిచయం చేస్తూ "మాది ప్రేమ వివాహం" అని అతను అన్న ప్పుడు మాత్రం ఆమె శరీరం కోపంతో భగ్గుమని మండేది. 'ప్రేమ అంటే ఏమిటో ఇతనికి తెలీదు. నన్ను మరోదారిలేకుండా ట్రాప్ చేసి పెళ్ళి చేసు కున్నాడు' అని చాటి చెప్పాలనిపించేది.

కాని ఆమె చేయగలిగినదేమున్నది?

తలుపు దబాలున తోసిన చప్పుడు కావటంతో ఉలిక్కిపడింది కమల.

"ఇంకా అలాగే కూర్చున్నావేం? మొగుడు ఇంటికొచ్చేసరికి కాస్త శుభ్రంగా తయారయి ఎదురు రావాలన్న జ్ఞానం కూడా లేదేం? ఇంకెవత్తె నయినా పెళ్ళి చేసుకుంటే డబ్బుకు డబ్బు వచ్చేది. ఇలాంటి జిడ్డు మొహాన్ని కాకుండా కొంచెం అందంగా ఉన్న పిల్లనయినా కట్టుకుంటే సుఖపడుదును. నా ఖర్మగాలి తగలడ్డావు" అంటూ గాలి దుమా రంలా లోపలికొచ్చాడు సూర్యం. అప్పటికే తలుపు దగరికి వెళ్ళిన కమల ఒక్కక్షణం ఆగి "భోజనానికి కంచం పెడుతున్నా." అంది. ●





# ఇంటిబావి

పాలడుగు వెంకటేశ్వరరావు

వెనుక పూరిపాకలోపల పొయ్యిముందు కూర్చుని వున్న సీతామహాలక్ష్మమ్మ దొడ్లో ఏదో అలికిడి అయితే లేచి బయటికి వచ్చింది. దొడ్లో మనుష్యుల కలకలం స్పష్టంగా వినవచ్చింది. చెట్లమధ్యనుంచి దారి వెంట గబగబా నడిచి వెళ్ళింది సీతామహాలక్ష్మమ్మ. అంతకుముందు జరిగిన గొడవ ఇంకా ఆమె చెవుల్లోనే వుంది.

రామ్మూర్తిగారు బావిపళ్లెంమీద కూర్చుని కూలివాళ్ళతో మాట్లాడుతున్నారు. ఆడా మగా కలిసి పదిమంది కూలిజనం పలుగులూ, పారలూ పట్టుకుని సిద్ధంగా వున్నారు.

మట్టిని ఎక్కణ్ణించి తవ్వి పోవలసినదీ. ఆ వివరాలు వాళ్ళకి చెప్తున్నారు రామ్మూర్తి.

సీతామహాలక్ష్మమ్మ గబగబా అక్కడికి వెళ్ళింది.

'ఏమిటండీ? ఏమిటి పిల్పింతా? ఎందుకొచ్చారు?'

రామ్మూర్తిగారు వెంటనే సమాధానం చెప్పలేకపోయేరు. కాసేపటికి నోరు పెగల్చుకొని సమాధానం చెప్పేరాయన. ఆయన గొంతు రుద్ధమయింది.

'సీతా! బావి పూడ్పిస్తున్నాను.'

సీతామహాలక్ష్మమ్మ నిర్ఘాంతపోయినట్టు ఉలికి పడింది. వెంటనే ఆకులా ఒణికిపోయింది.

'ఇదేమిటండీ? మతిగాని పోయిందా?' అంటూ తొట్రుపాటుని పక్కకునెట్టి.

'అవునే, నాకు మతిపోయింది. అందుకే ఇటువంటి బుద్ధులు పుడుతున్నాయి! ఊ కానీండిరా.' రామ్మూర్తి తీవ్రంగా అన్నారు.

సీతామహాలక్ష్మమ్మ మొహం జేవురించింది.

పూనకం పూనినట్టు అరిచింది 'ఒరేయ్! అబ్బాయిలూ! మీకెవ్వరికీ మతిపోయిందా? పొండి, పొండి. ఓరి ఎర్రింబా! ఆనాడు మా బాబు త్రవ్వేడు దీన్ని. అమృతం వంటి మంచినీరు నేటికి తీసేము. నలుగురికీ ఉపయోగపడుతుంది. దాని పూడ్పించటానికి మీకు చేతులెలా వస్తున్నాయిరా?'

'అమ్మగారూ! బాబు పిలుకొచ్చేడు. నాలుగు డబ్బులు దొరుకుతాయిగదా అని వచ్చేము. అంతే నండి. తమరొద్దంటే వెంటనే వెళ్ళిపోతాము.'

'సరిసరి. కావాలంటే ఆడబ్బులు నేనిస్తాగాని వెళ్ళిపొండి. పొండి. మళ్ళీ ఇటురాకండి.' తీవ్రంగా అంది సీతామహాలక్ష్మమ్మ. పలుగూ, పారా సర్దుకుని వాళ్ళు వెళ్ళిపోయేరు.

రామ్మూర్తిగారు విలువు గుడ్లేసుకుని చూస్తూ వుండిపోయేరు శూన్యంలోకి.

భార్య మొహంవంక చూడటానికి మనసు ఒప్పలేదు. వెంటనే లేచి వీధిలోకి వెళ్ళిపోయేరు. ఆయన తలకాయ బాధతో, అవమానంతో ఒంగింది.

* * *

ఆ సమువ్వ తలగు డాబాకి ముందూ వెనుకా విశాలమయిన ఆవరణ వుంది.

ఆస్థలాన్ని దాదాపు పదిహేనేళ్ళక్రితం రామ్మూర్తి కొన్నాడు. ఆ ఏడాదే ఆస్థలం చుట్టూ చిన్న ప్రహారీగోడ కట్టించేడు.

ఆనాడు, ఎన్నాళ్ళనుంచో మనసులో వున్న కోరిక భర్తకి వెల్లడి చేసింది సీతామహాలక్ష్మి!

సీతామహాలక్ష్మితో పెళ్ళయిన తరువాత రామ్మూర్తికి బాగా కలిసి వచ్చింది. పట్టిందల్లా బంగారమయింది. ఉన్న ఆస్తిపాస్తులు పెరిగేయి! సంసారంలో ఆనందం నింపించే అనుకూలవతియైన భార్యగానేగాక, అవసరమయినప్పుడు అమూల్యమయిన సలహాలందించేది భర్తకి సీతామహాలక్ష్మి.

భార్యంటే అనురాగంతోపాటు, ఆమె వ్యక్తిత్వాన్ని గౌరవించడం కూడా రామ్మూర్తి అలవర్చుకున్నాడు. అతని నైజం కూడా అటువంటిదే. రామ్మూర్తి గారికి బయట నానా హైరానాపడి, ఇంటికి వచ్చేసరికి ఎంతో హాయిగా వుండేది. ఎడారిలో ఎండను బడి వచ్చినవాడికి చల్లని వృక్షచ్ఛాయలో, కొబ్బరి నీళ్ళు దొరికినట్లుండేది.

తన చికాకులు అన్నీ మర్చిపోయి కొత్త మనిషయేవాడు రామ్మూర్తి, భార్య మొహం చూసేటప్పటికి. సీతామహాలక్ష్మి ఏ కోరికా అనుచితం కాదని రామ్మూర్తి నమ్మకం.

అందుకే, భార్య కోరికకి వెంటనే సరేనన్నాడు రామ్మూర్తి.

ఆ సంవత్సరమే ప్రారంభించాడు, పని. మరో రెండేళ్ళలో ఇల్లు పూర్తయింది. పది వేలు ఖర్చు

యింది. సీతామహాలక్ష్మి కోరికలో ప్రతిఫలించిన సంతృప్తి రామ్మూర్తికి ఆనందం కలుగ చేసింది. అవును, మరి. ఆవిడ కోరిక ప్రకారమే ఆ ఇంట్లో ప్రతి అంగుళమూ రూపు దిద్దుకుంది. ఆమె కోరిక ప్రకారమే ఇంటికి పసుపు రంగు వేయించాడు.

ఆ శ్రావణమాసంలో భార్యతో, ఇద్దరు కొడుకులతో, అట్టహాసంగా గృహప్రవేశం చేసేడు, రామ్మూర్తి.

అప్పటికి రామ్మూర్తి పెద్దకొడుకు చంద్రానికి పదేళ్ళు చిన్నవాడు రాజాకి ఎనిమిదేళ్ళు.

గృహప్రవేశం చేసినప్పుడు సత్యనారాయణ వ్రతమూ చేసుకున్నారు. పట్టుచీరెతో మంగళసూత్రం గరగరమంటూ వుండగా చేతిలోని పళ్ళెంలో, పూజా సామగ్రిని తీసుకుని తన వెనుకే వస్తున్న భార్యని చూసి పొంగిపోయేడు, కొడుకులిద్దరూ చెరో చెయ్యీ పుచ్చుకుని నడవగా వాళ్ళని తీసుకుని దేవుడి దగ్గరికి నడిచేడు! రామ్మూర్తి. అంతా అయినాక, మర్నాటి రాత్రి పడుకోబోయేముందు భార్య తమలపాకులు చిలకలు చుట్టి ఇస్తూ వుండగా అందుకుంటూ, అర్ధనిమీలిత నేత్రాలతో అడిగేడు రామ్మూర్తి.

"అన్నీ సంతృప్తి కలిగించినట్లే గదా రాణీ గారికి! ఏవయినా లోటుపాట్లుంటే సెలవియ్యండి. సరిచేసుకుంటాము."

సీతామహాలక్ష్మి నవ్వింది.

ఎర్రని పెదాలు చిత్రంగా వొంకరలు తిరిగేయి.

"ఇంకేమీ లేనట్టే అనుకుంటాను. అవునా?" అన్నాడు రామ్మూర్తి విశ్వాసం మనస్సు నిండా ఆక్రమించగా.

"ఉంది. ఇంక ఒక్కటే మిగిలిపోయింది." అంది సీతామహాలక్ష్మి. రామ్మూర్తి కంగారుపడ్డాడు.

"ఏమిటది? చెప్పవేమి?" అన్నాడు.

సీతామహాలక్ష్మి నవ్వింది అనురాగ పిచ్చిలంగా. ఇన్నాళ్ళనుంచి అవస్థ పడుతూనే వున్నాము గదా! ఈ రెండు రోజులూ పూర్తిగా నీళ్ళ కోసమే పదిమంది మనుష్యుల్ని పెట్టేము. అయినా కొంత ఇబ్బంది తప్పలేదు. ఇది ఒకనాటిది కాదు గదా! రామయ్య గారి బావి ఇప్పుడు మనకి దూరమయింది."

"అవునే. ఆ సంగతి నేను మరిచేపోయేను. రేపే అప్పయ్యని పిలిపించి మాట్లాడ్తాను. ఎక్కడయితే బాగుంటుంది? బావి వెనక దొడ్లోనే త్రవ్విద్దామా?

సీతామహాలక్ష్మమ్మ ఆలోచనలో పడింది. రామ్మూర్తి ఆమనే మాట్లాడలేపోయేడు.

భార్యాభర్తలిద్దరూ సంప్రతించుకుని చివరికి ఒక నిర్ణయానికి వచ్చేరు బావిని వీధి వైపు త్రవ్వించాలని ఇద్దరూ ఒప్పుకున్నారు. అట్లా అయితే తమ అవసరమే గాక, ఇంకా ఆ చుట్టు ప్రక్కల వాళ్ళ అవసరమూ తీరుతుందని ఆలోచన జరిగింది.

ఆ రెండోనాడే అప్పయ్య పదిమందిని తీసుకొచ్చి పని ప్రారంభించేడు, మంచి ముహూర్తాన, పూజ చేసి తవ్వకం ప్రారంభించేరు.

సిద్ధాంతి వచ్చి చూసి లెక్కలు వేశాడు, అక్కడ తిరోజా. అక్కడ అమృతం వంటి నీరు పడుతుందని తేల్చి చెప్పాడు, సిద్ధాంతి. కొబ్బరికాయ కొట్టి ప్రారంభించిన పని చురుకుగా సాగింది. పది రోజులు గడిచేయి.

పది గజాలు లోతు తెగింది. ఎక్కడా చెమ్మ కూడా తొంగి చూడలేదు. నల్లమట్టి. మరో అయిదు రోజులు గడిచింది. ఓపిగ్గా పని సాగింది. తెల్లటి మట్టి ప్రారంభమయింది. ఇంకో పది గజాలు వెళ్ళేరు.

అప్పయ్య నిరాశ ప్రకటించేడు.

రామ్మూర్తికీ ఆశ అడుగంటింది.

నలుగురూ చూసి పెదిమ విరిచేరు.

పైనుంచి చూస్తే ఎక్కడ పాతాళం లాగా కనిపిస్తున్నది నుయ్యి.

"ఇవాళ్టి నుంచి పని మాన్పించేస్తున్నాను. ఏమిటో! కొండంత ఆశతో మొదలు పెట్టేము" రామ్మూర్తిగారు నిరాశగా అన్నారు, భార్యతో.

"ఇవాళ కూడా త్రవ్వమనండి. మరో రెండు గజాలు వెళ్ళి చూద్దాము."

'అట్లాగే.'

రామ్మూర్తి చెప్పింది విని అప్పయ్య అయిష్టంగా అన్నాడు, 'మరి లాభం లేదండి. అయినా మీ కోరిక నెందుకు కాదనాలి. ఆ రెండు గజాలూ కూడా చూస్తాము. మరొక గజం లోతు దిగేప్పటికి ఒక మూలను చిన్నరాయి కనపడింది. అక్కడ చెమ్మగా వుండటం చూసి అప్పయ్యకి ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగేయి. గడ్డ పలుగు పెట్టి ఆ రాయిని తొలగించేడు.

ఝుయ్యిమని దూసుకు వచ్చింది. మంజుల నాదాలు చేసింది.

జలధార! పొంగి వచ్చింది. కూలీలు సంతోషంతో చిచ్చిగంతులు వేసేరు. గబగబా అందరూ పైకి వచ్చేరు.

సంగతి తెలిసి రామ్మూర్తి భార్యని తీసుకుని వచ్చేడు చుట్టుప్రక్కల వాళ్ళూ వచ్చేరు. అందరి మొహాల్లో సంతోషం!

ఆ మధ్యాహ్నానికి బావి సగం వరకూ నీరు నిండింది.

నీరు స్వచ్ఛంగా వుంది. రుచి అమృతమే!

బావికి చుట్టూ గోడ కట్టించేరు. పైన సిమెంటుతో పళ్ళెం కట్టేరు. పైన రెండు గిలకలు అమర్చేరు, సులువుగా నీరు చేదుకోటానికి.

చివరికి సీతామహాలక్ష్మి ఆఖరి కోరికా తీరింది.

అదే రామ్మూర్తి కోరికన్నా.

దొడ్లో రకరకాల మొక్కలు పెట్టింది సీతామహాలక్ష్మి. కొబ్బరి, మామిడి, నారింజ, సపోటా, దానిమ్మ మొక్కలు ముందు దొడ్లో, అరటి, కాయగూరలు వెనక దొడ్లోను పెట్టింది.

'ఏమే! ఏవేవో మొక్కలు పెడ్తున్నావు. వీటన్నిటి చేత కాయలు కాయించి తినాలనే!' నవ్వుతూ అన్నాడు రామ్మూర్తి.

'మనం తినకపోతే మన కొడుకులు తింటారు. మనవలు మనవరాళ్ళు తింటారు.' అంది సీతామహాలక్ష్మి.

'అవునేవో! అది నిజమే.' అన్నాడు రామ్మూర్తి రోజూ దగ్గరుండి జీతగాళ్ళ చేత అన్నిమొక్కలకీ నీళ్ళు పోయించేది సీతామహాలక్ష్మి. పిల్లలూ పోస్తామని గొడవ చేసేవారు.

సంతృప్తిగా కాలం దొర్లిపోయింది. తెలీకుండానే దొర్లిపోయింది.

పిల్లలు పెద్దవాళ్ళయేరు.

రోజులు మారేయి.

కాలమూ మారింది.

కొత్తనీరు వచ్చి పాతనీటిని కూడా కొట్టుకుపోతూంది.

మార్పు అనేది సృష్టిలో సహజం. నిన్న వున్నది నేడు లేదు. నేడు వున్నది రేపు వుండాలనీ లేదు. వర్తమానం అనేక విధాలా భూతంతోను విభేదించవచ్చును. విభేదిస్తుంది. అయితే ఆ పరిణామమనేది ప్రగతిగామిగా వున్నత దృక్పథాల నయినా పయనించేదిగా వున్నప్పుడే శుభకరమూ ఆనందదాయకమూ అవుతుంది.

చంద్రానికి నాలుగేళ్ళ క్రితం పెళ్ళయింది.

రాజాకీ క్రితం సంవత్సరమే పెళ్ళయింది.

ఇద్దరూ మానసికంగా, శారీరకంగా ఎదిగేరు. వ్యవహర్తలని వూళ్ళో పేరు సంపాదించుకున్నారు. అయితే ఇద్దరివీ వేర్వేరు దృక్పథాలు. ఒకే కొమ్మ రెండు రకాల పూవులు.

రామ్మూర్తికి ఏళ్ళు పైబడ్డాయి. ఓపిక సన్నగిలింది.

కృష్ణా రామా అంటూ కాలక్షేపం చెయ్యాలన్న కోరిక కలిగింది.

కొడుకులు ప్రయోజకులయేరు.

అంతా వాళ్ళకప్పగించి 'కృష్ణా! రామా!' అంటూ కాలం వెళ్ళదీయటం కంటే కావాల్సింది ఏముంది? కాని. . . . . . . . . .

అప్పటి వరకూ ప్రశాంతంగా వున్న ఆ వూరి వాతావరణంలో సంచలనం కలిగింది. నిద్రపోతూ వున్న వాళ్ళు వులికిపడి లేచేరు. వడుం వంచి చెమటోడ్చి పని చేయటానికలవాటు పడిన జనం దృష్టిని ఆమార్పు ఆకర్షించింది. సందు మొగల్లోనూ, రచ్చబండలవద్దా అవే చర్చలు. పరిపాలనా వ్యవస్థలో మార్పులు వచ్చేయి. అధికార వికేంద్రీకరణన్నారు. పల్లెలలో రాజకీయ చైతన్యం పెరిగింది. ఎలక్షన్లన్నారు. పథకం పున్నతమయిందే. వుద్దేశాలూ గొప్పవి. అయితే. . . ., వూళ్ళో గ్రూపులన్నారు. పార్టీలన్నారు. వూరు రెండుగా చీలింది.

చంద్రం ఒకపార్టీకి నాయకుడన్నారు. రాజా రెండో పార్టీకి ఉపనాయకుడన్నారు.

ఒకే కప్పు క్రింద సహజీవనం చేస్తున్న విభిన్న దృక్పథాలు!

రామ్మూర్తికి అనోటా, ఈనోటా ఈ సంగతులు చూచాయగా తెలిశాయి. కొడుకులిద్దర్నీ పిల్చి తన దగ్గర కూర్చోపెట్టుకున్నాడు.

ఎడ మొగం, పెడ మొగం.

అక్కలూ కార్పణ్యాలు! సైద్ధాంతిక విభేదాలు.

రామ్మూర్తి కొడుకు లిద్దరికీ పసిపిల్లలికి చెప్పి

[illegible] చెప్పాడు, "బాబూ! ఆస్తిపాస్తులు, ఎలక్షన్లూ మన బోటి వాళ్ళ కనవసరం. నేనూ, మీ అమ్మా మీ యిద్దర్నీ రెండు కళ్ళుగా చూసుకుని బ్రతుకుని వెళ్ళదీస్తున్నాం. మీ ఇద్దరూ వీటిలోపడి ఒకరి కొకరు దూరమయిపోతే మీ అమ్మ సహించలేదు. నా మాట విని అవన్నీ వదులుకొని మీ ఇద్దరూ సఖ్యంగా వుండండి. ఐకమత్యమే బలం" అని.

చంద్రం చిరునవ్వు నవ్వి భుజంమీద కండువా సరిచేసుకున్నాడు. రాజా అసహనంగా మొహం పెట్టేడు.

"ఈ విషయాలన్నీ మాకేం తెలీవు నాన్నా! మీకెందుకు? మీరు ఇవేమీ పట్టించుకోకుండా చూస్తూ వూరుకోండి. 'వాళ్ళని' ఎట్లా దారికి తేవాలో నాకు తెల్సు" అన్నాడు చంద్రం.

"అవున్నాన్నా! ఇప్పుడే అదీ తేలిపోవాలి. నాదేదో నేను పంచుకుని నా దారిని నేనుంటాను." అన్నాడు రాజా.

"దాన్దేముంది? రేపే ఆ వ్యవహారమూ పరిష్కరించుకోవచ్చును" గోగతో అన్నట్టు అని అక్కణ్ణించి వెళ్ళిపోయేడు చంద్రం.

రాజా అక్కణ్ణించి లేచి కండువా దులిపి భుజాన వేసుకుని లోపలికి వెళ్ళేడు. రామ్మూర్తి నిస్సహాయంగా చూస్తూ వుండిపోయేడు. అప్పుడే రామ్మూర్తి గుండెల్లో గుబులు ప్రారంభమయింది. ఈ బాధని భార్యతో చెప్పుకోవాలనుకున్నాడు. కాని చెప్పలేకపోయేడు. ఆమె ఈ కఠోర సత్యాన్ని విని భరించగలదా? ఇదంతా ఇట్లా ఎందుకు జరుగుతున్నట్టు?

ఆ తర్వాత రెండు రోజుల్లోనే అంతా అయిపోయింది.

ఎవరో పెద్దమనుషులు వచ్చారు. మధ్యవర్తిత్వం చేశారు.

పంపకాలయితే ఏదో చేసేరు. దొడ్లో నిలువునా

# ఇంటి బావి

గోడ వెలిసింది, బావికి మధ్యగా డాబా రెండు భాగాలయింది. అన్నదమ్ములిద్దరికీ మధ్య 'గోడ' వెలిసింది. ముసలి వాళ్ళకని అప్పటికప్పుడు పూరిపాక వేయించారు. స్థిరాస్తులూ, చరాస్తులూ, పంపకాలయ్యేయి. చూస్తుండగానే, కళ్ళెదుటే అంతా అయిపోయింది. రామ్మూర్తీ, సీతమహాలక్ష్మి ఏం చెయ్యలేకపోయేరు.

అలా లగాయితు...... పూరిపాకలో నాలుగు రోజులపాటు నిప్పు రాజలేదు.

రామ్మూర్తి వీధి మొహం చూడలేదు. సీతామహాలక్ష్మి పక్క మీంచి లేవలేదు. ఇద్దరూ ఎదురెదురుగా పిచ్చివాళ్ళలాగా కూర్చుని వుండేవారు ఒకర్నొకరు చూసుకుని కన్నీళ్ళు పెట్టుకునేవారు.

గుండెల్లో రంపపు కోతకి కుమిలి కుమిలి పోయేవారు.

ఆ సంగతి ఎవరికీ పట్టలేదు.

ఇద్దరి మొహాలూ పీక్కుపోయేయి. జబ్బుపడి లేచిన మనుష్యుల్లా వున్నారు.

చివరికి సీతామహాలక్ష్మమ్మే మొండికేసింది.

దిగులుగా కూర్చునివున్న భర్తని చూసి జాలి పడింది ఆమె.

ఇట్లా అభోజనం వుండి ఏం సాధించేటట్టు? బిడ్డల్నయితే కన్నాం పెంచి పెద్ద చేశాం. మంచి బుద్ధులు చెప్పించాం. కలిసిమెలిసి సంసారాలు చేసుకుంటూంటే కన్నులపండుగగా చూసుకుని ఆనందించాలని ఆశపడ్డాం.

అనుకున్నట్టు జరగటం లేదు. ఇట్లా సంతాలు పట్టి వీళ్ళు ఏమయిపోతారో భగవంతుడికే తెలియాలి. ఆ బాధ గుండెల్ని కోస్తున్నది.

మర్చిపోదామన్నా మరపు రావటం లేదు.



అయినా, పోనీ దేముంది?

మౌనంగా భరించక తప్పదేమిటి?

ఆ వయస్సులో 'వారు' నాల్గు రోజుల్నుంచీ ఉపవాసాలు! అంతా తన పాపమే!

ఇంకా ఈ పాపం మూటకట్టుకోటం తనవల్ల కాదు.

అందుకే లేని ఓపిక తెచ్చుకుని బావి దగ్గరకు వెళ్ళి నీళ్ళు తెచ్చింది.

పొయ్యి వెలిగించి కాసిని బియ్యం ఉడకేసింది.

రామ్మూర్తిగారిని బ్రతిమాలి కాళ్ళా వేళ్ళా పడింది. ఎంగిలి పడేదాకా వదిలిపెట్టలేదు. ఏదో నాలుగు మెతుకులు కెలకటం తప్ప ముద దిగలేదు ఇద్దరికీ.

ఇంత అయి...... ప్రొద్దు పొడుస్తూనే వుంది! తెల్లవారుతూనే వుంది!

ఆ సాయంత్రం..... రామ్మూర్తిగారు గడపమీద కూర్చున్నారు. సీతామహాలక్ష్మి పొయ్యి దగ్గర కూర్చుని ఏదో చేస్తోంది.

చంద్రం మామూలుగా ఒచ్చేడు.

'నాన్నా! నాన్నా!'

'రాబాబూ! కూర్చో!' ఆదరంగా పిల్చేరు రామ్మూర్తిగారు.

'రాజా మామూలేనా? నాన్నా! ఎలక్షన్లో నేను గెల్చానని అక్కసుతో ఏవో కుంటి సాకులతో కోర్టు కెక్కాడు. అందుగ్గాను వడపూటి పొలం రెండెకరాలు అమ్మేసేడు. నేనూ వూరుకునే వాణ్ణి గాను. అవసరమయితే హైకోర్టు వరకైనా వెళ్తాను. మీరయినా చెప్పండి. లేకపోతే వాడి నాశనం కళ్ళజూసిగాని వదల్ను.' గబగబా అనేసి వచ్చినట్టే వెళ్ళిపోయేడు చంద్రం దూకుడుగా. సీతామహాలక్ష్మి భయంగా, జాలిగా చూసింది భర్త వంక.

రామ్మూర్తి గుడ్లనీరు గుడ్లలో కుక్కుకున్నాడు.

మర్నాడుదయం రామ్మూర్తి పళ్ళు తోముకుంటున్నాడు వేపపుల్లతో. బావి దగ్గర ఏదో గలభాగా అయింది. పెద్దగా కేకలు వినవచ్చాయి, వీధులో. గబగబా రాజా పరుగెత్తుకు వచ్చాడు, రామ్మూర్తి దగ్గరకి.

'నాన్నా! చూశావా?'

'ఏమిటి బాబూ!'

'ఇక సహించి వూరుకునేది లేదు.'

'ఏమయింది?'

'ఆ బావి తనొక్కడిదేం కాదు. అది వుమ్మడి బావి ఇంటిబావి. అందులోని నీళ్ళమీద నాకూ అంత హక్కూ వుంది. కాదనటానికి వాడెవడు? మొన్న మా సుబ్బయ్య వచ్చి, నా వైపు నుంచీ బావిలోంచి నీళ్ళు తోడుకుంటున్నాడట! అప్పటికి మీ పెద్ద కొడుకు వచ్చి నుంచుని 'నీళ్ళు చేదుకోటానికి వీలు లేదు' అన్నాడట. 'రాజా తోడుకోమన్నాడు' అని సుబ్బయ్య అంటే వినిపించుకోక సుబ్బయ్యమీద కలియబడ్డాడు. ఇదేంటి? సుబ్బయ్య నా వాడు. నా మనిషి. నా బావిలోంచి నీళ్ళు తోడుకోటానికి సుబ్బయ్యకి అన్ని హక్కులూ వున్నాయి. కాదంటానికి వాడెవడు?'

వాళ్ళు తిరుగుతు వెంటనే వెళ్ళిపోయేరు. ఆ అన్న మాటలు విని వళ్ళంతా వినిపిస్తూ కృంగిపోయేరు. సీతామహాలక్ష్మమ్మ తప్పు ఉంచిందంటే కష్టం గనుకనా వుంటుంది.

రామ్మూర్తిగారు అపోశనాలు అయిపోయేరు. సీతామహాలక్ష్మమ్మ అట్లాగే అయింది. బాధగా తల వంచుకుని రామ్మూర్తిగారు పెరట్లోకి వెళ్ళి కూచున్నారు. ఇద్దరి మధ్య ఇలా మాట్లాడుకోవటం అలవాటు లేదు. తను తొందరపడ్డానని ఇంతటి ఇంత సాహసం చెయ్యటానికి తనకి మనసెలా ఒప్పింది?! ఇంటి పెద్దా ఎందుకు ఆలోచించలేక పోయేరు? అని తర్కించుకుని తల బాదు కున్నారు రామ్మూర్తి.

* * *

రామ్మూర్తిగారు ఇంటికి వచ్చేసరికి బాగా ప్రొద్దు పోయింది. భార్య అయన కోసం చూస్తుంది.

"కాళ్ళు కడుక్కురండి. భోజనం వడ్డిస్తాను."

"నా కాకలిగాలేదు సీతా! నువ్వు తిను."

సీతామహాలక్ష్మి బాధతో విలవిల్లాడి పోయింది. "నన్ను క్షమించండి. ఇందాక వాళ్ళందరి ముందు మీకు తొందరపడ్డాను. మీరే శిక్ష విధించినా సంతోషంగా పడతాను. ప్రొద్దునగా కొద్దిగా ఎంగిలి పడ్డారు. ఇప్పుడక్కర్లేదంటే మాత్రం! ఎలా ఒప్పుకుంటాను? వస్తేమయినా చెయ్యండి మీకు మాత్రం ఈపూట అభోజనం ఉంటానికి వీల్లేదు.

"అదిగాదు సీతా! నువ్వేం తప్పుచెయ్యలేదు. నేనే తొందరపడ్డాను. నువ్వు చెప్పిందే నిజం. నా మనసేం బాగాలేదు. నాకు సీమీద కోపం లేదు." రామ్మూర్తి

# ఇంటి బావి

గారు గొణిగారు. ఆయన పెరటిపట్టు కూర్చుంటారు. ఆలోచిస్తూ గతాన్ని నెమరు వేసుకున్నారు.

కాసేపటికి, భార్య బలవంతంమీద లేచి కొంచెం మెతుకులు కొరికారు రామ్మూర్తి.

సీతామహాలక్ష్మి అన్నీ సర్దుకుని వచ్చేసరికి బాగా ప్రొద్దుపోయింది. అప్పటికే రామ్మూర్తిగారు నిద్ర కొరిగి పోయారు. ఆపూట అభోజనంగానే వుండి పోయింది ఆమె. ఏం బాగుండలేదు. మనస్సు స్థిరత్వం కోల్పోయి ఆ వేళ తను భర్త మనస్సుని బాధ పెట్టింది. తన వుద్దేశ్యం తప్పుగానీ, రయిటుగానీ, అది వేరే సంగతి. అందుకే ప్రాయశ్చిత్తం కోసం తానై ఆ శిక్ష విధించుకుంది ఆమె.

ఆ రాత్రి బాగా వర్షం కురిసింది. ఆకాశమంతా నల్లగా కారు మబ్బులు పట్టాయి. ఉరుములు కటిక చీకటి. ప్రపంచం దద్దరిల్లి పోయింది. తెల్లారగట్ట సీతామహాలక్ష్మమ్మగారికి పీడకలలు వచ్చాయి. తను ఒంటరిదయిపోయినట్టు తనమీద పిడుగుపడి మధ్యలో చెరియలు ఇచ్చినట్టు, బావి పూడిపోయినట్టు, అక్కడంతా జిల్లేళ్ళు మొలిచినట్టు!. . . .

సీతామహాలక్ష్మమ్మగారు భయపడింది. లేక లేసింది. కలవరించింది. పలవరించింది. బాధపడింది కళ్ళు ఉబ్బిపోయేలా ఏడ్చింది నిద్రలోనే. తర్వాత మెలకువొచ్చింది. తిరిగి నిద్రపట్టలేదు. ఎంత భయంకరమయిన కల!

"ఏమండీ! ఏమండీ!" రామ్మూర్తిగారిని పిల్చింది ఆమె. ఎన్నిసార్లు పిలిచినా సమాధానంగా రామ్మూర్తిగారు జవాబు పలకలేదు. నిద్రపోతున్నారు కాబోలు అని సరిపెట్టుకుందామె.

కొంచెంకొంచెం మసక వెల్తురు వ్యాపిస్తూంది. ఇంకో అరగంటలో తెల్లవారబోతున్నది. రోజూ ఆ సరికి రామ్మూర్తిగారు లేచి భాగవతం పద్యాలు పాడుకునేవారు. ఇవాళ ఆయన్ని నిద్ర లేపినా లేవనే లేదు. ఇంకా కుండపోతగా వర్షం కురుస్తూనే వుంది. లేవగానే రామ్మూర్తి స్నానం చేస్తారు! నీళ్ళు తెద్దామని కడవ తీసుకుని బావి దగ్గరకు వెళ్ళింది సీతామహాలక్ష్మమ్మ. బావికి అవతలగా సడవలో పెద్ద గుంట వుంది. నిన్నటి దాకా ఆగుంట అక్కడలేదు. ఆ గుంటలో నిలబడి వర్షంలో తడుస్తూ మట్టి తవ్వి గంపకెత్తుతున్నాడు ..... రాజా, తల్లిని చూడనే లేదు. ఏమిటిది? అక్కడ మరో మని షెవరు?!

ఆమె గుండె వెయ్యి ముక్కలయినట్లు బాధ పడింది. గుండెలుగ్గబట్టుకుని తూలుతూ వాలు గడుగులేసి బావి దగ్గర నిలబడింది. అవతలి వయ్యున ఏదో ఆకారం కదిలింది. నెత్తిమీద తట్టని బావిలోకి వూపిందా ఆకారం. దభీమని చప్పుడు. ఆ మసక వెల్తురులో పెద్ద కొడుకు అట్నుంచి ఆమెను గుర్తుపట్టాడు. "ఎవరది? అమ్మా నువ్వా!" అన్నాడు. అతని వెనుక తట్టలతో మనుషులు!

ఆమె, గాజు కళ్ళతో అతన్నే చూస్తూ వుండి పోయింది.

మరుక్షణం చూపు మరల్చి బావి వయిపు చూసింది ఇటు తిరిగి రాజాని చూసింది. అప్పటికే బావి మట్టితో సగంవరకు పూడిపోయింది. ఆమె గుండె పగిలిపోయింది!

కూలిపోయిన ఇల్లులాగా, చవుడుపారిన నేలలాగా జిల్లేళ్ళు మొలిచిన దొడ్డిలాగా దీనంగా కన్పడింది మట్టితో నిండుతూన్న బావి! నెత్తిమీద తట్టతో రాజా దగ్గరకొచ్చాడు. "అమ్మా!"

"అమ్మా!"

ఆమెను గుర్తుపట్టిన ఆరెండు ఆకారాలు నాలో వయిపునుంచి ఆమెను పిలిచేయి.

ఒక్కసారిగా ఆమె శరీరం పట్టు తప్పింది.

విరుచుకుని మొదలు నరికిన చెట్టులాగా పడి పోయింది సీతామహాలక్ష్మమ్మ. మరు నిముషం నూతి పళ్ళేనికి కొట్టుకున్న ఆమె తలనుంచి రక్తం వరదలయి చిమ్మింది. అచేతనంగా పడిపోయింది సీతామహాలక్ష్మమ్మ.

ఆమె గుండె రెండు ముక్కలు అయ్యింది. ఆ బాధకి తట్టుకోలేక, ఆమె హంస శరీరాన్ని వొదిలి, హంసలాగా ఆకాశమార్గాన,వెతుక్కుంటూ పోయింది. పైన తనకోసం నిరీక్షిస్తూవున్న మరొక ఆత్మలో లీనమయిన తరువాతగాని ఆమె మనస్సుకి శాంతి చేకూరలేదు. అక్కడ 'రామ్మూర్తి'గారు మునారు అయిదారు గంటలుపాటు, భార్యకోసం ఎదురు చూస్తూ ఆగిపోయేడు.

పీడావదిలిందని
హాయిగా ఉన్నారు
కదూ!!

రుక్మిణీ

సృష్టిలో వుండే ప్రతిప్రాణికీ—ప్రాణాలు నిలుపుకుని బ్రతుకుటకు ఆహారం అవసరం అది లేకుండా ఏ జీవీ ఉండలేదు. తినడానికి అనుకూలంగా వుండేదానికే అన్నం అనే పేరు.

ఈ కారణంవల్ల ప్రాణదానం యెటువంటిదో అన్నదానం కూడా అటువంటిదే అని మన ప్రాచీనులు వివరించారు.

'అన్నాద్భవాని భూతాని జాయన్తే,
జాతాన్యన్నేన జీవన్తి'

అనే వేదవాక్కులు ఈ విషయాన్నే తెలుపుతున్నాయి. అన్నానికుండే ప్రాధాన్యాన్ని బట్టే అన్నదానాన్ని మించిన దానం మరొకటి లేదని నిర్ణయించారు.

తగిన వస్త్రాలు లేకపోయినా జీవించవచ్చు. నిలువ నీడలేకపోయినా ఏ చెట్టు క్రిందనో నివసిస్తూ కాలం గడప వచ్చును. కాని, అన్నం లేకపోతేమాత్రం మనిషి జీవించలేడు. అందువల్లనే భోజన సమయంలో ఇంటికి వచ్చిన అతిథిని ఉన్నదానితో తృప్తి పొందించాలిగాని, అన్నం పెట్టకుండా పంపి వెయ్యకూడదు. అలా పంపి వెయ్యడం గొప్ప పాపం! అంతేకాదు. ఇంటి యజమాని సంపత్తును సర్వాన్నీ నశింపజేస్తుంది—ఈ విషయమే కఠోపనిషత్తులో

'ఆశా ప్రతీక్షే సంగతగ్ం సూనృతాం
చేష్టాపూర్తే పుత్రపశూగ్ంశ్చ సర్వాన్,
ఏతద్వృఙ్క్తే పురుషస్యాల్ప మేధసః
యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణో గృహే'

అని చెప్పబడి వున్నది. తిండిలేకుండా అతిథి తనయింటిలో వసించి వుంటే ఆ గృహ యజమాని సిరిసంపదలు సమస్తమూ నశించి పోగలవని దీని భావం. అందువల్ల ఆ అతిథికి తప్పకుండా భోజనం పెట్టాలి.

తాను భోజనం చేసే సమయానికి సరిగా ఆతిథ్యం కోరి వచ్చిన అభ్యాగతుడు సాక్షాత్తూ విష్ణుదేవుడే అని 'అభ్యాగతః స్వయం విష్ణుః' అనేది వివరిస్తున్నది. వాస్తవానికి అతడు విష్ణువు కాకపోయినా విష్ణువుతో సమానుడనీ, దేవుణ్ణి పూజించినట్లే అతనిని గౌరవించాలనీ— ఆతిథ్యం యిచ్చి తృప్తిపరచాలనీ దీని అభిప్రాయం:

అతిథిని ఆదరించి అన్నం పెట్టకపోతే, ఆ అన్నమే గృహస్థుణ్ణి శపిస్తుందట!—




అంటే అతనికే అన్నం లేని స్థితి వస్తుందట:

అన్నం చాలా పవిత్రమైనదీ, విలువైనదిన్నీ కావడంవల్ల ఒక్క కణాన్ని కూడా వ్యర్థంగాపోనియ్యకూడదు. అన్నం వంట పాత్రలకు అంటుకొని పోయివున్నా, పర్యుషితం అయినా—అంటే నిలవ వుండి పోయి చలిది అయిపోయినా వ్యర్థమవుతుంది. అలా చెయ్యకుండా, దాన్ని అతిథి కుక్షిలో పడవేసినట్లయితే ఎంతో సుకృతం!

అయితే ఒక ప్రశ్న—

యజ్ఞయాగాదుల్లో హవిస్సును—అన్నాన్ని హోమం చేస్తారు. అలా చెయ్యడం వ్యర్థంకాదా? అని—

'తక్కిన ప్రాణులకు అన్నం దానం చేసినట్లే దేవతలకు కూడా మనం దానం చెయ్యవలసి వుంది. దేవతలు దేవలోకం నుంచి స్వయంగా వచ్చి హవిస్సును గ్రహించలేరు అగ్నిలో హోమం చేసినట్లయితే ఆ హవిస్సు దేవతలకు చెందుతుంది. దేవతల తృప్తికొరకే హవిర్హోమం జరుగుతుంది' అని దీనికి సమాధానం.

అతిథులయిన మానవులకే కాకుండా పశుపక్ష్యాదులు మొదలైన ఇతర ప్రాణులకు కూడా అన్నం పెట్టాలి. దేవాలయాల్లోని బలి పీఠంమీద కొన్ని అన్నపు మెతుకులను జల్లి వెళ్ళడం పూజారుల పద్ధతి కాకులు మొదలైన పక్షులకవి ఆహారం! శ్రాద్ధం పెట్టేటప్పుడు వాయసపిండం ఏర్పాటు కూడా ఇట్టిదే!

భోజనానంతరం విస్తరిలో కొంచెం అన్నం ఉంచి వెయ్యడం మన వారు ఏర్పరచిన ఆచారం! పారవేసిన ఆకులలోని మెతుకులు ఏ కుక్కలో, కాకులో తిని సంతోషిస్తాయిగదా! ●





## జరిగిన కథ

భవానీప్రసాద్ జడ్జిగారు. రిటయిరయి విశ్రాంతి తీసుకుంటున్నారు. పక్షవాతం, స్వాభిమానం ఆయనకి పుట్టుకతో వచ్చాయి. ఆయన భార్య లలితాంబ. కుమార్తె సంధ్యకి భర్త చనిపోవడంతో పుట్టింట్లోనే వుంటున్నది. కొడుకు భవానీ శంకరం. అతని భార్య దుర్గ. దుర్గకి చాలా కాలం వరకు సంతానం కలగలేదు. భవానీశంకరం డాక్టరీ చదువుకున్న గోవిందని మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. దుర్గ కొడుకును కని కళ్ళు మూస్తుంది. ఆ కుర్రాడిభారాన్ని గోవింద వహిస్తుంది. రమేష్ సాయంతో గోవింద డిస్పెన్సరీ ప్రారంభిస్తుంది. రమేష్ సంధ్యని పెళ్లిచేసుకుంటానంటాడు. భవానీ ప్రసాద్ వూళ్లో లేనప్పుడు రమేష్ సంధ్యల పెళ్లి అయిపోతుంది.

## 8

కారు ముందుకు దూసుకుపోతోంది. డ్రైవింగ్ సీటులో భర్త ప్రక్కనే కూర్చున్న సంధ్య పుట్టింటిని గురించి సింహావలోకనం చేస్తోంది. గడపలో కారు ఆగగానే గుండె ఝల్లుమంది ఒక్కసారిగా. కారు ఆపేసి సంధ్యవైపు చూశాడు రమేష్. సంధ్య కారు దిగినా కాలు కదపలేకపోయింది.

'వెళ్ళు సంధ్యా. వెళ్లిరా,' రమేష్ భుజంమీద చేయివేశాడు సంధ్యనికుదుపుతూ.

వులిక్కిపడి తేరుకుని లోపలికి అడుగు పెట్టింది. హాలు ఖాళీగా బోసిపోతోంది. తండ్రి వుండవలసిన స్థానం వెలితిగా వుంది. యిల్లంతా నిశ్శబ్దంగా అలికిడేలేని అరణ్య ప్రాంతంలా వుంది. 'వదినా' సంధ్యగొంతు హాల్లో ప్రతిధ్వనించింది. కేక విని భవానీ ప్రసాద్ గదిలోంచి బయటికి వచ్చేడు. ఆయన వెనుకే భార్య వచ్చింది. మేడమీద నుంచి భవానీశంకరం గోవిందని పిల్లల్నీ వెంటబెట్టుకుని హాల్లోకి వచ్చేశాడు. అందరికన్నా గోవింద ముందువచ్చి సంధ్యకి యెదురుగా నిలుచుండి పోయింది రెండు చేతులూ చాపి.

'ఆగు గోవిందా!' భవానీప్రసాద్ గొంతు మేఘగర్జనలా వినిపించింది.

గోవింద వెనక్కి తిరిగి చూసింది. మామగారు అపర రుద్రుడిలా వూగిపోతూ కనిపించగానే క్షణం గుండె లయ తప్పినట్లు అనిపించింది.

'యెందుకొచ్చేవు? వెళ్ళు సంధ్యా. నువ్వు యీ యింట్లోంచి వెళ్లిపోయిన రోజునే నువ్వులూ నీళ్లూ వదిలేశాను. మొహం యెత్తుకోకుండా చేసేవు. భవానీ ప్రసాద్ పేరు మట్టిలో కలిపేసి నీ సుఖం కోసం తప్పుదారి పట్టేవు. తలచెడి తగుదునమ్మా అంటూ నువ్వుచేసినపని నన్నెంత కూలదీస్తోందో యెప్పుడైనా ఆలోచించేవా?'

'జరిగింది జరిగిపోయింది. ముందు వెళ్లిపో' సంధ్యా. నాకు నువ్వు పుట్టనే లేదనుకుని సరిపెట్టుకుంటాను.

సంధ్య బిత్తరపోయి చూస్తోంది. పిల్లలు స్థాణువుల్లా నిలబడిపోయేరు పెద్దవాళ్ల మాదిరిగానే. కళ్లవెంట సంధ్యతో ప్రమేయం పెట్టుకోకుండా కన్నీరు ధారాపాతంగా చెంపలమీద పడుతోంది.

గోవింద సంబాళించుకుని ఆడపడుచు భుజంమీద చేయివేసింది: 'మీరు లోపలికి రండి సంధ్యా. ఆయన ఆవేశంలో అంటున్నారు. మీ మీద ప్రేమలేకనే అంటున్నారనుకోకండి.'

భవానీప్రసాద్ మాట్లాడలేకపోయేరు. ఆయన కడుపులో రగిలే నిశ్శబ్దలావా ఒక్కసారి సంధ్యని చూడగానే పెల్లుబికి పైకి వచ్చేసింది. బ్రద్దలైన అగ్నిపర్వతం యేమీ యెరుగనట్లు కనిపించే మాదిరిగానే లోపలికి కదిలి వెళ్లిపోయేరు. గడపదాటుతూ యెడం చేత్తో కన్నీటిని మీటుకోవడం సంధ్య గమనించకపోలేదు. ఆయన వెనుకే లలితాంబ వెళ్లిపోయింది. కూతురు రావడం ఆవిడ మాతృహృదయాన్ని రెచ్చగొట్టలేదు. భర్త ఆవేశపడుతూంటే గుండెలు బాధతో గిజగిజ లాడిపోలేదు. నిర్వికారంగా భర్తనే చూస్తూండిపోయింది. సంధ్య వునికినే గుర్తించనిదానిలా లోపలికి వెళ్లిపోవడం సంధ్య హృదయంమీద బలంగా గురిచూసి యినుపగుండు విసిరినట్లే అయింది.

'గోవింద సంధ్యచేతిని తన చేతుల్లోకి తీసుకుని నెమ్మదిగా అంది: 'వట్టి మనిషి కూడా కారు మీరు. రండి సంధ్యా. మనం మేడమీదికి వెడదాం.'

సంధ్య నోరువిప్పి ఒక్కమాట అనలేదు.

గదుక్కున వెనక్కితిరిగి వెళ్ళిపోయింది. గోవింద బతిమాలుతున్నా వినిపించుకోకుండా.

వీధిలో రమేష్ రెండుచేతుల్తో భార్యని సాదరంగా ఆహ్వానించి కార్లో కూర్చోబెట్టుకుని యింటివైపు పరుగుతీయించేడు.

* * *

కాలం చక్రాలు వడివడిగా తిరుగుతున్నాయి. ఋతువులు క్రమం తప్పకుండా నలిగిపోతున్నాయి. కళ్ళెంవేయనికాలం రేసుగుర్రంలా పరుగుపెడుతోంది. సంధ్యని మరిచిపోయి పదిహేనేళ్ళు దాటిపోయేయి. పిల్లలు యెదిగి పెద్దవాళ్ళయ్యేరు. పెద్దలు వృద్ధాప్యం దాటినా పిలుపుకోసం నిరీక్షణలో ఆగిపోయేరు. భవానీప్రసాద్ సంధ్యని యింటినుంచి పంపేక ఆ యింట్లో రాని మార్పులు ప్రపంచంలోకి వచ్చేయి. కులం మతం, జాతి విచక్షణలు యెవరూ పాటించడం లేదు. ప్రగతి ముందుకు కదిలిపోతోంది. మనిషి పురోగమిస్తున్న పరిణామాలని ఆగి రెప్పవేసి చూడడం మానేశాడు. ఒకవిధంగా అనవసరం అనుకున్నాడు. ఆడా మగా భేదం లేదనే గుడ్డి నమ్మకాన్ని నరనరంలోనూ జీర్ణం చేసుకున్నాడు. చెట్టాపట్టాలు వేసుకుని బాహాటంగా నిర్భయంగా తిరగడం నేర్చుకున్నాడు. క్లబ్బుల్లో సరదాగా కాలక్షేపం చేస్తూ ఓ పెగ్గు అను వేసుకుంటూ పాశ్చాత్య సంప్రదాయానికి మచ్చ తీసుకురాకుండా మరో పెగ్గు యెదుటి వ్యక్తి గొంతులో పోస్తూ ఘొల్లున నవ్వేస్తూ కడుపులో హాలాహలం రగులుతూంటే స్వచ్ఛంగా నవ్వుతున్నాడు. కాలం ప్రభావం మనిషిమీద చెప్పలేనిముద్ర వేసింది. స్త్రీ పురుషులు ఒకరే అనే నినాదం చేసి గూటల్ని నిర్దాక్షిణ్యంగా పగలగొడుతోంది. ఆచారాలు మంటకలిసిపోయేయి. పత్నీసంప్రదాయాలు పిల్లకాలువలో కొట్టుకుపోయేయి. వరద యెగ్గడిగా వస్తూన్న పురోగమన సంప్రదాయాలు వరవడిగా కొట్టి పడేస్తున్నాయి.

మతాంతర వివాహాలు జరుగుతున్నాయి. ముక్కున వేలేసుకోవడం మానేశారు ప్రజలు. అదో విప్లవంలా మనిషి పీక నొక్కేస్తోంది. ఏ నలుగురో ముగ్గురో పాత ఆచారాల్ని సమర్థిస్తూంటే నోరు మూసుకుని ఓమూల కూర్చోమని సంహాలనిస్తున్నారు కుర్రవారు.

వీధిలో కుర్చీవేసుకుని భవానీప్రసాద్ గతించిన కాలంలోంచి తప్పుకొని వాస్తవంలోకివచ్చి తుళ్ళిపడ్డారు. ఆయన ఆకాశంలోకి చేతులు చాచి చూశారు. నిశ్శబ్దం వీధి నాలుగుమూలలా కమ్ముకోలేదు, యింకా. సంధ్య రంగులు మారుతోంది.



# అడకత్తెరలో మనిషి

అక్కడక్కడ నక్షత్రాలు మిణుకుమిణుకు మంటున్నాయి. ఆయన వృద్ధాప్యంలో చాలా బాధపడుతున్నారు మానసికంగా. 'భగవంతుడా! యేమిటీ ప్రగతి కోరింది. కాలం యిలా యెలా మారిపోయింది? పాప పుణ్యాల నిర్ణేతవి నువ్వే చూస్తూ వూరు కున్నావా దేవా?' అని కళ్ళుమూసుకుని కనిపించని దైవాన్ని వేడుకుంటున్నారు.

కాలేజీనుంచి కొద్దిగా ఆలస్యంగా వచ్చిన మనవరాల్ని వీధిలో నిలిపి అడిగే సాహసం లేకపోయింది ఆయనకి. అయినా తెచ్చి పెట్టుకున్న గాంభీర్యాన్ని బయటపడనివ్వ కుండా స్వరాన్ని అదుపులో వుంచుకుని శాంతగా అడిగేరు: 'యింత ఆలస్యం అయిందేం,' అని.

చంద్రముఖి తాతగారి మొహంలోకి క్షణం చూసి తల వాల్చేసింది పంజాబీ డ్రెస్ కోసం తడుముకుంటూ.

'ఆరుగంటలవరకూ కాలేజీలోనే వున్నావా చందూ.'

'అవును తాతగారూ'

'దుర్గాప్రసాద్ యేడీ?'

'పెద్దన్నయ్యా, చిన్నన్నయ్యా కాలేజీ లోనే వుండిపోయేరు'

'వాళ్లతో రాలేదేం నువ్వు'

'వాళ్లకేవో స్పెషల్ క్లాసులు వున్నాయిట'

'హూఁ' ఆయన దీర్ఘంగా నిట్టూర్చారు. చంద్రముఖి లోపలికి వెళ్లిపోయింది. మేడ మీద కొత్తగా పూర్వం సంధ్య వుండే గదికి పక్కగా మూడు గదులు కట్టించేరు. చంద్రముఖి గదికి యిరువైపులా అన్నదమ్ముల గదులు వున్నాయి. గదిలో కూర్చుంటే మేడాను పూర్తిగా కనిపి స్తుంది. అన్నదమ్ములిద్దరూ రోజులో యింట్లో వుండే కాలంలో చాలా భాగం చంద్రముఖి గదిలోనే వుంటారు. తన గదిలో అడుగు పెట్టగానే విశ్రాంతి పోయింది చంద్రముఖి.

యెదురుగా కాళి చెల్లెల్ని విశితంగా చూస్తూ నెమ్మదిగా అడిగేడు: 'తాతగారూ నువ్వూ మాట్లాడుకోవడం నేను వినాలని వినకపోయినా తప్పనిసరిగా వినవలసి వచ్చింది. దుర్గ యేడీ'

'తెలీదన్నయ్యా'

'తాతగారితో అబద్ధం ఆడేవేం'

చంద్రముఖి వెల చూపులు చూస్తూండి పోయింది చాలా సేపూ. కాళి యెదురు గుండెల్లో నిప్పులు చెలరేగుతున్నాయి. పంజాబీ డ్రెస్సులో రెండు జడలు వేసు కుని కనిపించీ కనిపించకుండా లిప్‌స్టిక్ పూసుకున్న చెల్లెల్ని చూస్తూంటే అతని హృదయం ఆవేశంతో రొప్పుతోంది.

'నీ వరుసేం నాకు బాగు లేదు చెల్లాయ్'

'నేనిప్పుడేం చేశాను?'

'తాతగారితో అబద్ధం ఆడేవు'

'... ... ...'

'అమ్మతో చెప్పాల్సి వస్తుంది యీ విషయం'

చంద్రముఖి కాళి మొహంలోకి చూసింది క్షణం. అతని చూపులు కత్తుల్లా దూసుకు వస్తున్నాయి. పుస్త కాలు మంచం మీద పడేసి అతన్ని వాటేసు కుని బావురు మంది చంద్రముఖి! 'నేను తప్పే చేశానన్నయ్యా. నన్ను క్షమించు.' అంటూ.

కాళి మనసు కరిగిపోయింది. ఆడపిల్లల కన్నీరు చూసి దిగజారిపోయి వాళ్ల పతనానికి కారణం అయే పరిస్థితులు కళ్లముందు పరిహాసం చేస్తున్నాయి. బాధ్యత రెక్కవిచ్చుకుని వాక్కులోవు తోసింది. కాళి కళ్లల్లో అగ్నిగోళాలు ముక్కలయ్యాయి ఒక్కసారిగా: 'సిగ్గుందా అలా అడిగేందుకు? నేను మేడమీదనుంచి చూస్తూనే వున్నాను. తాతగారు నన్ను చూడలేదనుకుని వుంటావు. 'చందూ ప్రపంచం సంగతి నీకు తెలీదు. యిదో రంగులరాట్నం. చాలా తీయగా, చూసిందుకు జారిపోయే మెరుపుతీగలా కనిపిస్తున్నదేమో నీకు. కానీ...

'యిప్పుడు నేనేం చేశానన్నయ్యా?'

'అదే నేనూ తెలుసుకోవాలనుకుంటు న్నాను.'

'అంటే?'

'కాలేజీ వదిలేక యెక్కడికి వెళ్లావు?'

'రోహిణి యింటికి?' చంద్రముఖి విదా నించి నెమ్మదిగా అన్నది.

కాళి నిట్టూర్చాడు: 'యిదివరకు చాలా సార్లు చెప్పేను. నువ్వు ఆ యింటివైపు వెళ్లొందుకు వీల్లేదని. యిలా మరోసారి జరుగులే నాన్నగారితో చెప్పాల్సివస్తుంది.'

'రోహిణి యింటికి వెళ్లడమే తప్ప యితే రోహిణితో నువ్వు స్నేహం చేయడం లేదంటావా అన్నయ్యా.'

స్థాణువైపోయేడు కాళి. తన చెల్లెలు! తనని అపురూపంగా ఆరాధించే చెల్లెలేనా యింత నిర్భయంగా యెదురు ప్రశ్న వేసింది? అతను నమ్మలేకపోతున్నాడు.

'రోహిణి నీకెంత స్నేహితురాలో నాకూ అంతే స్నేహితురాలు కాకూడదాన్నయ్యా?'

కాళి మొహం దించేసుకున్నాడు. మెట్ల మీద దుర్గాప్రసాద్ అడుగుల చప్పుడు అతని చెవికి స్పష్టంగా వినిపించింది.

'రోహిణి యింటికి వెళ్లద్దని నన్ను శాసిస్తున్నావు కానీ...చిన్నన్నయ్య మేరీతో



[illegible]

మాట్లాడలేకపోయేవేం,' చంద్రముఖి మాటలు గొంతులోంచి పూర్తిగా రాక ముందే చెంపలు అదిరిపోయేయి.

'ఇడియట్. అన్నయ్యని అనేందుకు యెన్ని గుండెలున్నాయి నీకు. పైగా వేపేదో జాలాయి వెధవలా తిరుగుతున్నట్టు మాట్లాడుతావేం?'

'దుర్గా,' కాళి మధ్యలోవచ్చి అడ్డుకున్నాడు.

అన్న మొహంలోకి క్షణం చూసి: 'మరి దీని వరస బాగుందనే అంటున్నావన్నయ్యా?' అన్నాడు.

'అదంతా అమ్మా నాన్నా చూసుకుంటారు దుర్గా. ఈ సంగతి వాళ్ళకి తెలియదు. రోహిణి యింటికి వెడితే యేం అంటుంది? వాస్తవానికి అదెవరో తెలుసా?'

చంద్రముఖితో పాటు దుర్గాప్రసాద్ ఆశ్చర్యంగా అన్న వైపు చూశాడు.

కాళి పొంయిని పూర్తిగా తగ్గించేసి రహస్యం మాట్లాడుతున్న వాడిలా అన్నాడు:

[illegible] మామయ్యా ఈ వూళ్ళో వుంటున్నారో తెలీదు కానీ యిది మాత్రం స్నేహితులతో వుంటోంది. ఈ విషయం యింట్లో యెవరికి తెలిసినా మనాయాసంగా రోహిణిని ఈ వూరు నుంచి పంపించేస్తారు.'

'అంటే చిన్నప్పుడు మనకి అన్నం తినిపించేది ఆ పంటేనా', అన్నాడు దుర్గాప్రసాద్ పాత విషయాలు గుర్తుకు తెచ్చుకుంటూ.

కొంత వయసు వచ్చేక గృహ విషయాల్ని కూలంకషంగా అర్థం చేసుకునే శక్తి ఆడపిల్లల్లో కన్నా మగపిల్లల్లోనే యెక్కువగా కనిపిస్తుందేమో అనిపిస్తుంది. లీలా మాత్రంగా తనూ తమ్ముడూ పదేళ్ల పసివాళ్లుగా వుండే రోజుల్లో సంధ్య అత్త అతనితో మోటర్‌సైకిల్ వెనుక, మోటారుకారు ముందు అతని పక్కనో రెప్పపాటు కాలంలో దాటిపోవడం ఈ జన్మకి కాదు, యే జన్మలోనూ మరిచిపోలేదు కాళి. తన కొక్కడికే ఆ యింటి [illegible] అద్దాడు. ఇంటికి పెద్దవాడ్ని, [illegible] ప్రతిష్ఠల్ని గుప్పిట్లో పెట్టుకుని [illegible] చాల్సిన బాధ్యత తన మీద [illegible] పసితనంలోనే తాతగారి [illegible] గ్రహించేడు. తల్లిదండ్రి బాధ్యతా[illegible]తులు కాకపోయినా చదివిన వైద్య విద్యకి ప్రాణం పోసే నిమిత్తం యింటిని గాలి వాటుగా వదిలేయడం అతని ప్రాణాన్ని ఎగపూసిరాడని [illegible] సమస్యలా [illegible]తైంది. ప్రొద్దస్తమానూ మళ్లీ — అదే ఆచారం, అంటూ—సొంటూ, [illegible] నాయనమ్మ వైపు [illegible] క్షణం [illegible] పారి చూస్తాడు.

దుర్గాప్రసాద్ [illegible] మీద మీద [illegible] 'మామ్మా [illegible] నావనమ్మ! యిది [illegible] ఒప్పుకోను. నా చేతికి కొంచెంకూడా [illegible] లేదు. నేను నిన్ను ముట్టుకోనిదే వుండలేను,' అంటాడు.

అవిడ కిక్కురుమనదు. [illegible]

# అ[illegible]తెరలో మనిషి

గట్టు దగ్గరికి వెళ్ళి బాత్రూమ్‌లో నీళ్ళు నెత్తిన కుమ్మరించుకుంటుంది. నిన్నాని పిల్లని శుద్ధిచేసే శుద్ధ శ్రోత్రియుల పిల్లల్ని పెరగాల్సిన తీరు యిది కాదను కుంటాడు. అయినా, రోహిణిపట్ల అతనికి కొండంత జాలివుంది. ఆ పిల్లని కాలేజీలో అందరూ నిరసనగా చూడడం యెన్నో సార్లు గమనించేడు. డబ్బులోనూ, హోదా లోనూ యెందులోనూ కూడా తీసిపోని రోహిణిని పదిమందీ చీదరతో చూపిస్తూ 'అది విధవ కూతురోయ్', అంటున్నప్పుడు కొరడా దెబ్బల్లా అతని వీపుకి తాకేవి ఆ మాటలు రోహిణి హాస్టల్లో వుండడం మానుకున్నాక తన వునికిని దాచిపెట్టి ఆ పిల్ల పుట్టు పూర్వోత్తరాలు తెలుసు కుని ధైర్యంచేసి మూడో కంటిమనిషికి తెలియకుండా అప్పుడప్పుడు కలుసు కుంటూనే వున్నాడు. కానీ...కానీ యివాళ్ళ రోజున తన చెల్లెలే నిర్బంధించినట్లుగా వేసిన ప్రశ్నకి స్థాణువై పోయేడు.

'అయితే అన్నయ్యా సంధ్య మన అత్త కదూ,' దుర్గాప్రసాద్ మరోసారి అడిగాడు పరధ్యానంతో మునిగిపోయిన అన్న గారిని చూస్తూ.

కాళీ మరి మాట్లాడలేదు. తమ్ముడినీ, చెల్లెల్నీ తేలపారిచూసి లోపలికి వెళ్ళి పోయేడు.

దుర్గాప్రసాద్ చెల్లెలికి దగ్గరగా వచ్చి అన్నాడు: 'నువ్వు కబ్బులో మెంబరువైతే యెవరికీ చెప్పలేదు నేను. రోహిణి వెంట యెందుకు తిరుగుతున్నావు అన్నందుకు అన్నయ్యను యెదిరించడం అదేమంత ప్రయోజనకత్వంకాదు.'

చంద్రముఖి నవ్వింది: 'నిజం. నిజం. కాదుమరి. నాది ప్రయోజకత్వం యెందు కవుతుందన్నయ్యా. మేరీ యింట్లో సీసాలో బ్రాందీ గొంతులో కుమ్మరించు కున్నప్పుడూ, తెగతిని ఆ కంపు పోయే వరకూ వీధుల్లో తిరిగి యిల్లు చేరుకునే ప్పుడూ నువ్వు జరిపే ప్రయోజకత్వం ముందు...

'చంద్రా!' దుర్గాప్రసాద్ నిర్ఘాంత [illegible] చెల్లెలి ధైర్యానికి. 'యేం జరిగి [illegible]. మనోసారి అన్నిటికంటా నేను

తున్నా నన్నయ్యా: నాకు తెలుసు. నేను నడిచేదారిన్నా చేరుకునే దానితో వుండే గొడవాన్ని గుర్తించేదం.'.

చంద్రముఖి అన్నగారిని మరి మాటలు పెంచనివ్వలేదు. దుర్గాప్రసాద్ తేరుకోక ముందే చెప్పుల్ని మెట్లమీద విసురుగా కొడుతూ వెళ్ళిపోయింది.

ప్రొద్దుపోయేవరకూ తల్లీతండ్రీ మాట్లాడు కుంటూ వచ్చే కబుర్లు చనితో దూరంగానే అన్నదమ్ము లిద్దరూ యెవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయేరు.

భవానీశంకరం భార్యవెనుకే మెట్లమీద నిలుచుని కొడుకుల్ని కూతుర్ని అలవాటు ప్రకారం పలకరించి గదిలోకి వెళ్ళి పోయేడు.

గోవింద ముందు పెద్దకొడుకు గదిలోకి వెళ్ళింది. అక్కడ కాళీ మంచంమీద వెల్లకిలా పడుకుని దూరంగా కనిపించే ఆకాశంలో నక్షత్రాల్ని కిటికీ గుండా చూస్తున్నాడు. గోవింద ఖంగారు పడింది. తను వాడిని కంటికి రెప్పలా చూసింది. ప్రాణంకన్నా యెక్కువగా ప్రేమించింది. రెండుచేతులా అనురాగాన్ని అందించింది. యిన్నేళ్ళలో యెన్నడూ లేనిది యివాళ్ళ రోజున కాళీ అలా వేదాంతిలా చీకట్లోకి చూస్తూ అస్పష్టంగా కదులాడే కన్నీటిని రెప్పలమాటున దాచేస్తూవుంటే ఆవిడ మాతృహృదయం తల్లడిల్లి పోయింది. త్వరత్వరగా రెండడుగులువేసి కొడుకు మంచంమీదికి వాలిపోయి అతని ప్రాపులోకి ప్రేళ్ళుపోనిచ్చి 'యేం కాళీ? యేం జరిగింది నాయనా. నాకు చెప్పు. నేను... నేను భరించలేను. నువ్విలా యెందుకై పోయేవు,' అన్నది.

కాళీ నిలకగా నవ్వేడు. చాలాసేపటి వరకూ అతనికి నోరుపెగల్లేదు. తల్లి... తనతల్లి తనమీద యెన్నో ఆశలు పెంచు కున్న మమతామూర్తి తన శరీరంమీద చేయి వేయగానే ఆనాటి పసితనం గుర్తుకు వచ్చి కళ్ళు చెమ్మగిల్లేయి. తల్లిని వాటేసుకుని బావురుమన్నాడు.

గోవింద కళ్ళల్లో నీళ్ళు జలజలా రాలేయి: యేం నాయనా. యేం జరిగింది? నిన్నెవరేమన్నారోయ్.'

'అమ్మా! [illegible] యెన్నాళ్ళు చేయాలి మనుష్యుల్లో వుద్యోగం,' అన్నాడు

కొంచెం శాంతంగానే ఆపుకుని.

'యిప్పుడేం సమస్య యెదురుకొచ్చింది నీకు,' గోవింద ఆశ్చర్యపోయింది. తన వుద్యోగం విషయంలో కొత్తగా కొడుకు అడ్డు ప్రశ్నలు వేయడం ఆవిడకి విచిత్రంగా ఆనందంగానే వుంది.

'మరేం లేదమ్మా, నువ్వు యింటి పట్టునవుండి పిల్లల్ని చూసుకోవడం మంచిదేమో అనిపిస్తోంది,' కాళి చాలా జాగ్రత్తగా అన్నాడు.

గోవింద నవ్వింది. ఆవిడ నవ్వు కాళి అనాయకత్వాన్ని సవాలు చేస్తున్నట్లుగా అనిపించింది.

'నువ్విలా నవ్వడం బాగులేదమ్మా. ఇంటి బాధ్యతలు మరిచిపోయి ప్రజాసేవ కోసం ప్రాకులాడ్డంలో యెంత నష్టపోతున్నామో ఆలోచించడం లేదు,' కాళి గుండెల్లో బాధ గొంతులోంచి బయట పడిపోయింది.

గోవింద నిశ్శబ్దంగా వుండిపోయింది క్షణకాలం. ఆ తరువాత నెమ్మదిగా కొడుకు భుజంమీద చేయివేసి అతని మొహంలోకి చూస్తూ: 'పాలుతాగే పిల్లలేవిటోయ్ జాగ్రత్తగా చూసుకునేందుకు' అన్నది.

'కాదు కనుకనేనమ్మా యింతగా చెప్పేది అది...సంధ్య లేదమ్మా రోహిణితో తిరుగుతున్నది. దాన్ని నువ్వు అలా వదిలేస్తే...' కాళి సగం మాటలో ఆపేశాడు.

గోవింద కొడుకు మొహంలోకి పరిశీలనగా చూస్తూ: 'అంటే అదెవర్రా' అన్నది.

'అది...రోహిణమ్మా' కాళి తల్లి మొహంలోకి ధైర్యంగా చూస్తూ అన్నాడు: 'సంధ్య అక్కకూతురు రోహిణి. అది యీ వూళ్లోనే కాలేజీలోనే చదువుతోంది. దానివెంట సంధ్య తిరిగితే...'

కాళి మాటలు అలా సాగిపోతూనే వున్నాయి. గోవింద మనసులోకి మాత్రం యే ఒక్కమాటా యెక్కడంలేదు. ఒకవేళ యెక్కినా మెదడు గ్రహించడంలేదు. సంధ్య. యేనాటి సంధ్య. సంధ్య పెళ్లిచేసుకుని తండ్రిచేత కాదనిపించుకున్నాక యేడాది తిరగకుండానే యెవ్వరితో వెళ్లిపోయింది రమేష్‌తో.. ఆ తరువాత యెన్నిరకాలుగా వాకబుచేసినా ఆమాకి తెలియలేదు. అటువంటిది యివాళ్టిరోజున తను వింటున్నది నిజమో అబద్ధమో అర్థంకాని మిథ్యాతన్నతో అంతులేని ఆవేదనతో, తెలుసుకోవాలనే జిజ్ఞాసతో కొట్టుకుపోతూ కొడుకు వైపు ఆదుర్దాగా చూస్తూ అడిగింది: 'రోహిణా! యెలా వుంటుందిరా ఆ పిల్ల. ఒక్కసారి మన యింటికి తీసుకువస్తావురా కాళీ'

కాళీప్రసాద దిమ్మెరపోయాడు. గోవిందకున్న సంస్కారం యెన్ని జన్మలెత్తినా ఆ యింట పుట్టిన మరో ప్రాణికి వస్తుందనే నమ్మకం కాళికి లేదు. అయినా రోహిణిని తన తల్లి తీసుకురమ్మంటుందని మాత్రం వూహలోకూడా అనుకోలేదు.

'రోహిణిని మన యింటికి నేను రమ్మన్నానని చెప్పి తీసుకురా కాళీ,' అన్నది గోవింద మెట్లవైపు దారితీస్తూ, కాళి మాట్లాడేందుకూ, జవాబు చెప్పేందుకూ ఆస్కారం లేకపోయింది. అతని కనుచూపుమేరలో తల్లి తండ్రి గదిలోకి వెళ్లడం కంటతడి కొంగుతో తుడుచుకునే దృశ్యంమాత్రం కనిపించింది.

రోహిణిని గురించిన ఆలోచనలు అతన్ని కలవరపెడుతున్నాయి. సంఘంలో కీర్తి ప్రతిష్ఠలు మంటగలసినముద్ర వేసుకున్నాక ఆ వ్యక్తి బ్రతకడం యెంత దుర్లభమో ఆలోచిస్తున్నకొలదీ కాళి గుండెల్ని యెవరో పిడికిట్లో బిగించి నలిపేస్తున్నంత వ్యథగా వుంది. సంప్రదాయాలు పెట్టని గోడల్లా పాతుకుపోయిన ఆ మనసుకు ఈ అనవసర జాలీ, అభిమానం యెందుకో కలుగుతున్నాయో అంతు చిక్కలేదు. తమ్ముడూ, చెల్లీ, తనూ వంశాన్ని మూడు దృఢం అయిన పునాది రాళ్ల సహాయంతో లేవనెత్తి సగర్వంగా లోకానికి చూపించాలనుకుని కొన్నాళ్లక్రితం వరకూ అనుకున్నాడు. కానీ యివాళ్టి రోజున రోహిణి మాటూ, తలపే అతన్ని వికలచిత్తుణ్ణి చేస్తున్నవి. కిటికీగుండా శూన్యంలోని దృష్టికి సారిస్తూనే కాళి యెప్పుడో నిద్రలోకి జారిపోయేడు.

* * *

నీరెండ తగ్గలేదు యింకా. పశ్చిమాన సూర్యుడు కొండల్లోకి జారిపోతూ ఆగిపోయినట్లు ఆకాశం స్పష్టం చేస్తోంది. భద్రకాళి నుదుటి కుంకుమరేఖలా ఆకాశాన్ని యెర్రని జీరలు ఆవరించుకుపోయాయి. దుర్గాప్రసాద్ యిసుక తిన్నెలో కూర్చుని పక్కనే ట్రాన్సిస్టర్‌లో వినిపించే పాటకు ముగ్ధుడైపోయినవాడిలా అరమోడ్పుకనులు మూసుకున్నాడు.

మేరీ అతనికి కొంచెందూరంలో కూర్చుని వుంది. అందాల అపరంజి బొమ్మలా మోకాళ్లమీద మొహాన్ని ఆనుకుని అతని కళ్లల్లోకి చాలా ప్రేమగా అత్యంత ఆశగా చూస్తోంది.



నా ఉత్సాహం అంత [illegible]
[illegible]దురా.'

విశ్వనాథం చీకట్లోనే సరిగా కూర్చొన్నాడు ఆశ్చర్యాన్ని అణుచుకుంటూ: అంటే యిది లౌ యెట్ ఫస్ట్‌సైట్ అన్నమాట' అన్నాడు.

దుర్గాప్రసాద్ మాట్లాడలేదు. హాల్లో లైట్లు వెలిగాయి తలుపులు తెరుచుకుని అందరూ వెళ్ళిపోతున్నారు. ఆ పిల్ల అతని పక్కనుంచి వెడుతూ 'మిమ్మల్ని చాలా సార్లు చూశాను. అప్పుడు మీరు కాలేజీలో ఫంక్షన్‌లో పాడుతూంటే విన్నాను. అప్పుడే పరిచయం చేసుకోవాలనుకున్నాను. కానీ...'

'అంటే మీరు యిక్కడే చదువుతున్నారన్నమాట', దుర్గాప్రసాద్ అడిగాడు.

'అవునండి. మాది రాజమండ్రి. హోటల్లో వుండేందుకు తగిన యేర్పాట్లు యిక్కడ వున్నట్లుగా మరోచోట వుండవు. అందుకే ... అన్నట్లు చీకటైపోయింది. నేను వస్తాను...' అంటూ వడివడిగా జారిపోయింది.

తరువాత రెండుమూడుసార్లు ఎక్కడ కటస్థపడినా 'మీగొంతు చాలా బాగుంటుంది,' అని ప్రశంసించి 'ఒక్కసారి మాయింటికి రాకూడదూ,' అని ఆహ్వానించేది.

క్రిస్‌మస్ రోజున మెరి బలవంతంమీద మేరీ వాళ్ళయింటికి ప్రొద్దుటే వెళ్ళేడు. అప్పటికే మేరీ యింట్లో అందరూ స్నానాలుచేసి కొత్త బట్టలు వేసుకుని చర్చికివెళ్ళే ప్రయత్నంలో వుండిపోయేరు చాలా హడావుడి పడిపోతూ.

'మస్వా రావోయ్,' శామ్యూల్‌గారు అదిగారు అతన్ని చనువుగా పిలుస్తూ.

అప్పటినుంచీ ప్రారంభం అయిన స్నేహం క్రమక్రమంగా పటిష్ఠం అయిపోయింది. మేరీ యింట యే ఒక్కరూ అభ్యంతరం చెప్పరనే గట్టి నమ్మకం వుంది దుర్గాప్రసాద్‌కి. మేరీ అక్క చెల్లెళ్ళూ అన్నదమ్ములూ అంతా వరాంతర వివాహాలు చేసుకున్న మనుషులే. తల్లీతండ్రీ అవిధంగా చేసుకున్నందుకు, పిల్లలు తప్పనిసరిగా అలాగే చేయాల్సి వస్తూంటుంది. శామ్యూల్‌గారి భార్య బ్రాహ్మణ యువతి అనే అనో టా వినటంవల్ల దుర్గాప్రసాద్‌కి మరి దిగులూ లేకపోయింది.

'యేమిటి ఆలోచిస్తున్నారు?' మేరీ అతని ఆలోచనల్ని తెంపేసింది.

దుర్గాప్రసాద్ తేరుకుని అన్నాడు: 'మీలో నేనూ ఒక మనిషిని అయేందుకు కొంత వ్యవధి పడుతుంది మేరీ. మీరూ, మీయిల్లూ అన్నీ ఆలోచిస్తూంటే, మా యిల్లు వెంటనే గుర్తుకు వస్తోంది. నా మనసులో నిప్పు కడిగే తాతగారూ, నాయనమ్మా తదితరులు ఒకరి వెనుకగా ఒకరు గుర్తుకు వస్తున్నారు. వీటన్నిటినీ సరిపెట్టుకుని నేను మనిషిని అయేందుకు చాలాకాలం పడుతుందేమో కూడా'

'దుర్గాప్రసాద్,' మేరీ తెల్లబోయి చూసింది: 'మీరు ... మగవారైన మీరూ [illegible] అసలు ఇన్నేం చేయదలుచుకున్నారు?'

దుర్గాప్రసాద్ ప్రశాంతంగా జవాబు చెప్పేడు: 'నేనంత దగాకోరుని కాను మేరీ. తప్పకుండా నిన్నే పెళ్ళి చేసుకుంటాను. కానీ మావాళ్ళ విషయాన్ని జీర్ణించుకునే శక్తికి రానివ్వు'

మేరీ లేచి నిలబడింది. ఆడపిల్లకుండే మామూలు భయం తప్ప దుర్గాప్రసాద్ మీద అచంచల భక్తి విశ్వాసాలున్నాయి ఆ పిల్లకి. చీకట్లో నలువైపులా కమ్ముకుపోయేయి. మేరీ వెనుకే దుర్గాప్రసాద్ కొంత దూరం నడిచి ఆ తరువాత చీలిపోయేడు.

(ఇంకా ఉంది)

డాక్టర్ కబుర్లు

## జాజికాయ ప్రమాదాలు

జాజికాయ వల్ల మత్తు ఏర్పడుతుందని మీకు తెలుసా?

దీనివల్ల గర్భస్రావం అవుతుందనే అపోహ ఉంది. గర్భస్రావం కాకపోయినా ప్రాణాపాయం మాత్రం ఉంది.

కొందరికి ఇది సారాయంత సమానమయిన మత్తు ఇస్తుంది. కాని ఫలితాలు వేరు.

నరాలు ఉద్రిక్తస్థితి చెంది స్వప్నావస్థని పోలిన పరిస్థితి ఏర్పడుతుంది. గుండె దడ వస్తుంది. నోరు ఎండుతుంది. దాహం అధికం అవుతుంది. ఇది తీరని దాహంగా ఉంటుంది. నోరు ఎర్రబడి మాట తడబడుతుంది.

ఇదంతా జాజికాయ ఎక్కువగా తింటేనే! పిల్లలు జాజికాయ కొంచెం ఎక్కువగా తింటే



ముందు గంతులు వేసి తర్వాత కూలిపోతాయి...

హెచ్. ఎల్. హార్జ్‌సెన్

(కాపీరయిటు)

# ఉగాది పండుగ

అనంతమైన కాలంయొక్క పరిమాణాన్ని గుర్తించడానికి కొన్ని యేర్పాట్లు జరిగాయి. సంవత్సర పరిమాణాన్ని తెలిపేదే ఉగాది పండుగ. ఇది చైత్ర శుద్ధ పాడ్యమినాడు వస్తుంది. దీనితోనే కొత్త సంవత్సరం ప్రారంభమవుతుంది. దీన్ని అందరూ ఘనంగా జరుపుకుంటారు.

ఇది చాంద్రమానాన్ని అనుసరించిన ఉగాది. అంటే శుద్ధపాడ్యమి మొదలు అమావాస్య వరకూ నెల అని పరిగణించేవారి సంవత్సరాది అన్నమాట ఆంధ్రులేకాకుండా కన్నడులూ, మహారాష్ట్రులూ కూడా సంవత్సరాదిగా చైత్రశుద్ధ పాడ్యమినే పరిగణిస్తారు.

బ్రహ్మదేవుడు ఈ దినాన్నే సృష్టిని నిర్వర్తించాడని హేమాద్రి పండితుడు ఇలా చెప్తున్నాడు—

'చైత్రేమాసి జగద్ బ్రహ్మ
సపర్జ ప్రథమేఽహని,
శుక్లపక్షే సమగ్రంతు
తదా సూర్యోదయే సతి.
ప్రవర్తయా మాస తథా
కాలస్య గణనా మపి.'

'బ్రహ్మ ఈ జగత్తు సంతటినీ చైత్రమాస శుక్లపక్షంలో తొలిదినంలో సూర్యోదయ కాలంలో సమగ్రంగా సృజించాడు. కాలంయొక్క గణనను అప్పటినుంచే ప్రారంభించాడు' అని పయి శ్లోకభాగాలకు అర్థం.

నిర్ణయసింధుకారుడైన కమలాకర భట్టుకూడా 'తత్ర చైత్ర శుక్ల ప్రతిపది సంవత్సరారంభః' అని పయి విషయాన్నే తెలియజేశాడు.

కాల పరిగణన బ్రహ్మ సృష్టితోనే ప్రారంభం కాబట్టి యుగారంభంకూడా సంవత్సరాదిలోనే ప్రారంభమైనది. అందువల్లే ఈ దినం యుగాది అయి, క్రమంగా ఉగాదిగా మారిపోయి, ఉగాది అంటే సంవత్సరాది అనే పేరు స్థిరపడిపోయింది.

భాస్కరాచార్యుడు సిద్ధాంత శిరోమణిలో—

'లంకానగర్యా ముదయాచ్చ భానోః
తస్యైవ వారే ప్రథమం బభూవ,
మధోస్సితాదేర్దినమాస వర్షం
యుగాదికానాం యుగపత్ప్రవృత్తిః'

అంటూ సూర్యుడు శుక్లపక్ష ప్రతిపత్తునాడు లంకానగరంలో ఉదయించడంవల్ల— భూమధ్య రేఖపైని ఉండడంవల్ల ఆనాడే యుగ, వత్సర, మాస, దినాదుల ఆరంభం ఒకేసారి సంభవించినది తెలియజేశాడు.

ఈ ఉగాదినాడు ఆంధ్రులు మహోత్సవాన్ని చేసుకుంటారు. నాడు ఉత్సాహంతో వుంటే సంవత్సరం పూర్తిగా ఉత్సాహం వుంటుందనీ, నాడు సంతోషంతోగాని, దుఃఖంతోగాని వుంటే సంవత్సరం పూర్తిగా అవి వుంటాయని కొందరి నమ్మకం. అందువల్ల ఉగాదినాడు ఉత్సాహంగానూ, సంతోషంగానూ ఉండడానికి ప్రయత్నిస్తారు.'

ఆనాడు సూర్యోదయాత్పూర్వమే మంగళాభ్యంగస్నానం చేస్తారు. ఏమాత్రం అవకాశమున్నా — ఉన్నంతలోనే నూతన వస్త్రాలు ధరిస్తారు. ఇండ్లను మామిడాకు తోరణాలతో అలంకరిస్తారు. ఇంటిలోపల ఒక మంటపాన్ని నిర్మించి దానిలో సంవత్సరాధి దేవతను ఆ సంవత్సరపు కొత్త పంచాంగాన్ని వుంచి, పూజిస్తారు. షడ్రసాత్మకమయిన రసాయనాన్ని సిద్ధంచేసి సంవత్సరాధి దేవతకు నైవేద్యం పెడతారు. ఈ రసాయనం తెలుగునాట 'ఉగాదిపచ్చడి'గా ప్రసిద్ధి పొందింది. దీనిలో తీపికి కొత్త బెల్లం, కారానికి పచ్చిమిరపకాయలూ, పులుపుకి కొత్త చింతపండు, వగరుకు మామిడిపిందెలు, ఉప్పు, చేదుకు మామిడి పూత ఉపయోగిస్తారు. అన్ని రసాలూ కలిసిన ఈ పచ్చడి ఆస్వాదనీయమైన కొత్త రుచిని కలిగిస్తుంది. పదార్థాలతోపాటు రుచుల్లోనూ నవ్యత యిందు కానవస్తుంది. పయి పదార్థాలన్నీ వసంత సమయంలో ప్రకృతి ప్రసాదించిన కొత్త దినుసులు!

ఆనాడు అందరూ ఈపచ్చడినే మొదట రుచి చూస్తారు. ఆ తర్వాతనే బంధుమిత్రులతో పిండివంటలతో భోజనం చేస్తారు. మూడుజాములైన తర్వాత స్వగృహంలోనో దేవాలయంలోనో, జనులందరూ చేరదగిన చోటనో సమావేశమై పంచాంగ శ్రవణం చేస్తారు. పంచాంగంలోని కందాయ ఫలాలను, ఆయ వ్యయాలను, సుయోగ దుర్యోగాలను తెలుసుకుని,ఆ సంవత్సరంలోని తమ భవిష్యత్తును నిర్ణయించుకుంటారు. కొన్ని ప్రాంతాల్లో సాయంకాలం ఎడ్లబండ్లను అలంకరించి పోటీలలో పరుగెత్తిస్తారు.

వసంతనవరాత్రాలు ఈ సంవత్సరాదితోనే ప్రారంభం అవుతవి. ఈవిషయాన్నీ, వత్సరాదివాడు జరిపే కార్యక్రమాన్నీ గురించి ధర్మసింధువులో ఈవిధంగా ఉన్నది—

'తైలాభ్యంగం సంకల్పాదౌ నూతన వత్సర కీర్తనాద్యారంభం ... ప్రతి గృహం ధ్వజారోహణం నింబపత్ర శనం



వత్సరాది ఫలశ్రవణం, నవరాత్రారంభః।
నవరాత్రోత్సవాది నిమిత్తాభ్యంగాదిశ్చ కార్యః'

సంవత్సరాది పండుగతోపాటు వసంత నవరాత్రాలు నాడే ప్రారంభం కాగలవనీ, అభ్యంగాదులతోపాటు ఇంటింటా ధ్వజారోపణం జరపాలనీ, వేపచిగుళ్ళు తినాలనీ దీన్నిబట్టి తెలుస్తున్నది. నింబపల్లవ భక్షణానికి బదులుగానే క్రమంగా నింబపుష్ప భక్షణం ఆచారంలోకి వచ్చినదేమో! ఈనాడు ప్రారంభమైన నవరాత్రులు శ్రీరామనవమి వరకూ జరుగుతాయి.

చాంద్రమానంవలెనే మరికొన్ని మానాలు కాలపరిగణనలో ప్రసిద్ధంగా ఉన్నవి అవి— సౌరమానం, సావనమానం, బార్హస్పత్య మానం, నక్షత్రమానమున్నూ. చాంద్ర మానాన్ని ఆంధ్రులనుసరిస్తే, తమిళులు సౌరమానాన్ని అనుసరిస్తారు. ఉత్తరాదిలో బార్హస్పత్యమానం ఆచరణలో ఉన్నది. ఇలా వున్నా కర్మకాండకు మాత్రం చాంద్రమాన సంవత్సరాన్నే గ్రహించవలసి వుంటుంది, మరొక మానాన్ని గ్రహించ కూడదట. వత్సరంయొక్క ఆదిలో చాంద్ర మానానికే ప్రవృత్తి ఉన్నది. కర్మాదుల ఆచరణలో సంకల్పం చెప్పేటప్పుడు అందరూ చాంద్రమానాన్నే స్మరించాలి. ఈవిషయం—

'స్మరేత్సర్వత్ర కర్మాదౌ
చాంద్రం సంవత్సరం సదా,
నాన్యం యస్మాద్వత్సరాదౌ
ప్రవృత్తిస్తస్య కీర్తితా'

అనే స్మృతివాక్యంవల్ల స్పష్టమవుతున్నది. వైదిక, కర్మలలో చాంద్ర మానాన్నే అనుసరించవలసి వున్నది.

విక్రమాదిత్యుని రాజ్యాభిషేక దినం ఈ చాంద్రమాన సంవత్సరాదే అని ప్రసిద్ధి. విక్రమశకం కూడా ఈ దినాన్నే ప్రారంభమవుతుంది.

ప్రకృతికి నూతన శోభను కలిగించే వసంతఋతువు ప్రారంభమయ్యే యీ దినం నూతన సంవత్సరానికి ప్రారంభం కావడం స్వాభావికమే!

—బు. వేం. ర.



# ఉగాది



ఇవాళ ఆపిల్ జూస్ బదులు
ఉగాది పచ్చడి ఇమ్మన్నారండి
ప్రొడ్యూసర్ గారు!




మీరు మరీను - ఉగాది
పచ్చడి కాస్త చేదుగా
వుండదేవిటో ?




కోసిన వేపపూవు
చాలని చెప్పకొరు!




పంచాంగ శ్రవణం



Jayadev


మా యింట్లోని ఉగాది
పచ్చడి రెడీయేనా
పిన్నీ?!


ఇతను చాల పైకి వస్తాడు!
మొన్న ఇంగ్లీషు సంవత్సరాదికి
శుభాకాంక్షలు చెప్పాడా! మళ్ళా
ఈ తెలుగు సంవత్సరాదికీ


ఏమండోయ్!
పచ్చళ్ళలో వేసేది
వేప పువ్వు మాత్రమే
తెలుసా?!


చూశారా హీరోగారూ! —
ఉగాది పచ్చడి సేవించేవ
వచ్చిందా!!
మీ ఇంట్లోని ఉగాది పచ్చడి మాంచి
రుచిగా ఉందా? ఐతే ఈ కార్టూనులు
చూడండి!!

# ముగింపు

సింగరాజు రామచంద్రమూర్తి



బొమ్మ: శ్రీ బాపు

ఈ కథలో నా పాత్ర ఎటువంటిదో నాకే తెలియదు. అయితే ఇందులోని వాళ్ళందరూ నాకు కావలసినవాళ్ళు. వాళ్ళకి కూడా నేను కావలసిన దాన్నే! ఇందులోని సంఘటనల ప్రభావం నామీద ఉన్నా వాటితో నేరుగా నాకు సంబంధంలేదు.

మా ఇంట్లో ఉన్నవాళ్ళం నలుగురం. నేను చిన్నత్తయ్య, మావయ్యగారు, కథానాయకుడు శేఖరంబావ. నిజానికి నేను ఈ ఇంటిలోని సభ్యుల సంఖ్యలో ఒకతెనయినా ప్రస్తుతానికి ఈ ఇంట్లో దాన్నిగాను. మా ఊళ్ళో చదువుకునే అవకాశం లేకపోవడంవలన మా చిన్నత్తయ్య గారింటిలో ఉంచారు నన్ను మా నాన్నగారు.

ఈ కథ మొదలు పెట్టేందుకు సరయిన వాతావరణం సంవత్సరంలో కనీసం అరడజను సార్లు ఉంటుంది మా ఇంట్లో. నా చిన్నతనంలో ఇంకొంచెం తక్కువగా ఉండేదిగాని ఈమధ్య పెరుగుతోంది.

కారణం మా పెద్దత్తయ్య రాకపోకలు ఈ మధ్యన మరీ ఎక్కువవడం.

మా పెద్దత్తయ్య చాలా సరదాగల మనిషి—కలుపుగోలు. నన్ను 'కోడలా' అంటూ సిగ్గులో ముంచుతుందనికాదు నేను ఆమాట చెప్పడం—అందరూ అనుకునే మాటే అది.

ఆవిడ రాకతో మా ఇంటి వాతావరణం మారి పోతుంది. 'ఏమిటే అక్కయ్యా, ఇప్పుడప్పుడే రానన్నావు కదటే!' అంటుంది మా చిన్నత్తయ్య.

'కడుపు తీపి నిలవనిస్తుందేమిటి?' అంటుంది ఆవిడ.

దాంతోటే మా చిన్నత్తయ్యకి మరి నోట మాట పెగలదు. నావంక ఒక్కసారి చూసి లోపలికి వెళ్ళిపోతుంది.

ఈసారి మాత్రం పెద్దత్తయ్యకి ఒంట్లో బావుండటంలేదని తెలిసి మందిప్పించుదామని పట్టుబట్టి తెప్పించారు మావయ్యగారు. వస్తూనే కాసేపు ఆవిడ ఆరోగ్య విషయాలు మాట్లాడటం అయినాక—

'ఏమే అమ్మడూ, కులాసానా? బావేడి' అంది.

'లోపలున్నట్టున్నాడత్తయ్యా. పిలవమంటావా?'

'పిచ్చిపిల్లా, ఉత్తప్పుడు వాడితో మాట్లాడేందుకే భయపడతావెందుకే? నువ్వు మాట్లాడినంత మాత్రాన వాడి చదువు పాడయిపోతే వాడింకేం అఘోరిస్తాడే చదువు?... చదువు... చదువు, అది తప్ప జీవితంలో వేరే పుణ్యం, పురుషార్థం లేనట్టు మాట! దీందంతా మరీ చోద్యం.'

'పోనీలే అత్తయ్యా, చిన్నత్తయ్యది లెక్క ప్రకారం జరగాలనే మతం .... పిలవమంటావా ?'

'పిలు పిలు.'

తరువాత కొద్ది సేపటికి ఏదో తప్పు చేసిన వాడిలా ముఖం పెట్టుకుని శేఖరం బావ ఆవిడ ముందు నిలబడ్డాడు.

'ఏరా నాయనా, పుస్తకాలగొడవేగాని ప్రపంచం ఎరగవా ఏమిటిరా?'

దీనికి శేఖరం బావ ఏమంటాడో, ఆ తరువాత పెద్దత్తయ్య ఎంతగా కృంగిపోతుందో నాకు తెలుసు. కనుకనే ఆవిడని ఓదార్చేందుకక్కడ సిద్ధంగా ఉంటాను.

'పరీక్షలు కదూ పెద్దమ్మా అందుకు చదువుతున్నాను.'

అప్పటిదాకా ఉన్న ఉల్లాసం, నవ్వు అన్నీపోయి చిన్న పిల్లలా కళ్ళనీళ్ళు పెట్టుకుంది ఆవిడ 'ఎప్పుడూ అదేమాట! నన్ను 'అమ్మా' అనరా నేను నీకు అమ్మనురా' అంటూ.

బావ మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళి పోయాడు.

'చూడవే, సరోజా, వాడు అంత కచ్చిపట్టినట్టు నన్ను 'పెద్దమ్మా' అని పిలుస్తాడు. 'అమ్మా' అంటే వాడినోటి ముత్యాలు రాలిపోతాయిటే!' అంది.

'పోనీలే అత్తయ్యా, దీనికి మీరింతగా బాధపడి పోవడం ఎందుకు?' బావతత్వం ఎరగనిదా ?'

'చూస్తుంటే ఎరగనట్టు అగుపడుతోంది. చిన్నతనంలో ఎంత సాధకుడుగా ఉండేవాడు? నా కొంగు వదలకుండా తిరిగేవాడు!... నేను ఒక్క క్షణం కనబడకపోతే చాలు గోల పెట్టేసేవాడు. ఆ ప్రేమ అంతా ఏమయిపోయిందో ?' పెద్దత్తయ్య గొంతు పూడిపోయింది. కళ్ళ నిండా నీళ్ళ

విరిచాయి.

అంత మనిషి అలా బెంబేలు పడిపోవటం చూస్తుంటే నాకే కష్టం వేసింది. అయితే ఆవిడని ఓదార్చేపాటి వయస్సూ, అనుభవం నాలో లోపించాయి. అందుకే ఎప్పటిలానే ఇప్పుడూ మాట్లాడకుండా ఉండిపోయాను.

'వాడి బాగుకోరి, వాడి ఉన్నతిని కోరి ఆనాడు నేనాపని చేశాను. అప్పటి నా పరిస్థితి అటువంటిది. ఏం చేయాలో తెలియని అయోమయావస్థలో ఉన్న నన్ను ఈయన ఆలోచించుకోనివ్వలేదు. ఆలోచించేందుకు అసలు ఆనాడు నాకు మరో ఆలోచనంటూ ఏడిసింది కనుకనా!' అంది ఆవిడ.

తరువాత ఆవిడ చెప్పబోయేది నాకు తెలుసు. ఆనాటి తన పరిస్థితిని వివరిస్తుంది. అది వినేందుకు నేనూ సిద్ధమే! ఎప్పటికప్పుడు మొదటి సారి వింటున్నట్లు ముఖంపెట్టి కూర్చోవడం నాకు అలవాటే! అంతకన్న నేనామెకు చేయగలిగిన సాయమూ లేదు కనుక !

'అవతల అటూ ఇటూ అన్నట్లున్నారు మీ పెద్ద మావయ్య. ఉన్నదంతా వూడ్చి పెడుతున్నా ఆయన జబ్బు డాక్టర్లకు వంగలేదు. ఆ రోజులటువంటివి. 'క్షయ' అంటే చాలు కొండంత గుండం అయినా మనిషిని దక్కించుకోలేనని అధైర్యపడిపోయాను. రాజులకి రావలసిన రోగం, అర్భకపు బడిపంతులుకి అందునా ముగ్గురు పిల్లలతో అంతంత మాత్రంగా జీవితం వెళ్ళమారుస్తున్న ఆయనికి వస్తే బ్రతుకు మీద ఇంకా ఆశ ఎలా మిగులుతుంది.

దిక్కుతోచని ఆ స్థితిలో దేముడి లాగా—నిజంగానే దేముడి స్వరూపంలాగే అగుపడ్డాడు—వచ్చాడు మీ చిన్నమావయ్యగారు.

ఆ మహారాజు కాస్తా పోయినాక జరగవలసిన తతంగం అంతా జరిపించాడీయనే! ఆ బడిపంతులు ఉద్యోగం బాపతు డబ్బు చేతికి వచ్చింది కొద్దీ. దాంతో నేనూ, పిల్లలూ, వాళ్ళ చదువులూ....

సరిగ్గా అప్పుడు చిన్నమావయ్య అన్నారు 'వదినగారూ, మీరు మరోలా అనుకోకపోతే నేనొక విషయం చెబుదామనుకుంటున్నాను. పిల్లలతో, వాళ్ళ చదువులతో మీరు నలిగిపోతారు. మీకు చెప్పిళ్ళకు వెన్నెళ్ళుగా ఉండగలనే తప్ప మొత్తం బాధ్యత వహించగలిగిన తాహతు ప్రస్తుతం నాకూ లేదు.... అందుకని..... పెద్ద పిల్లవాడిని నేను వెంట తీసుకు వెడతాను. నాకూ పిల్లలు లేరు. కలుగుతారన్న ఆశా లేదు. ఒక వేళ కలిగినా ఈనాడు చెబుతున్నాను, వీడే నాకు పెద్ద కొడుకు. నాకు పుట్టిన వాళ్ళు వీడికి తరువాత వాళ్లే! వాడి బరువు బాధ్యతలన్నీ నావి. అంతమాత్రాన వీడితో మీ సంబంధాలు త్రెంచుకోనవసరం లేదు. మనందరం కావలసిన వాళ్ళం అది మీకు సరాయిది కాదు. న్యాయానా చెల్లెలు.. ఆలోచించండి' అని.

మొదట నాకీ ఆలోచనే కష్టం అనిపించింది. ఉన్నవాళ్ళు ముగ్గురే కనుక వాళ్ళని నా ప్రాణంగా పెంచుకున్నాను. అందులోనూ పెద్దవాడికి నన్ను వదిలి క్షణం కూడా ఉండటం అలవాటు లేదు. వాడిని వదలడం అన్నది నా వూహాకందని విషయం.

అందుకనే వెంటనే అనేశాను 'కలో గంజో పోసి నా పిల్లల్ని పోషించుకోగలను' అని.

'కాదనను కాని మగ పిల్లలు సరయిన చదువు లేకపోతే ఎందుకూ పనికిరారు. మీరొక్కరూ ఈ బరువు భరించేకన్న మాకు కూడా పంచుకునే అవకాశం ఇవ్వండి. పిల్లల్ని పెంచడం అన్న ఆనందంలో కూడా మాకూ భాగం ఇవ్వండి. ఇది నా కోరిక. బాగా ఆలోచించి రేపు చెప్పండి' అని ఆయన బయటికి వెళ్ళిపోయాడు.

చీకట్లో కూర్చునున్న నాకు ఎదురుగా శేఖరం నుంచున్న చాలా సేపటికిగాని వాడున్నాడన్న స్పృహ రాలేదు.

తృళ్ళిపడి వాడివంక చూశాను.

అన్నీ విన్నాడు లాగుంది 'నన్ను పంపించేస్తావా అమ్మా!' అన్నాడు.

గుండెల్లో పొడిచినట్లయింది కావలించుకుని ఏడ్చేశాం ఇద్దరమూను.

మర్నాడు చిన్న మావయ్య బయలుదేరే వేళకి ఉట్టి చేతులతో వాడూ వెళ్ళి ఆయన పక్కన నిలబడ్డాడు 'నేనూ వస్తాను బాబాయిగారూ!' అన్నాడు.

'వెళ్ళకురా నాయనా' అనేందుకు నాకు నోరు రాలేదు. వాడి భవిష్యత్తు బాగుపడుతుంది. చదువుకుంటాడు. ఉద్యోగస్తుడవుతాడు. నలుగురిలో పేరు తెచ్చుకుంటాడు. అది నాకు కాదూ! గుండె రాయి చేసుకున్నాను.

'బట్టలు తీసుకెళ్ళు నాయనా' అన్నాను.

'తమ్ముడికి ఉండనీ అమ్మా!' అని వాడన్నప్పుడు నేనింక అక్కడ నిలబడలేక ఇంట్లోకి వెళ్ళి పోయాను. ఎంత సేపలా పడి ఉన్నానో నాకే తెలియదు.

లేచి చూసేసరికి నా పక్కన గిరి, పద్మ కూర్చుని ఉన్నారు. శేఖరం లేడు!

వాళ్ళ ముఖాలు చూడలేక పోయాను.

'అన్నయ్య చదువుకుందుకు పిన్నిగారింటికి వెళ్ళాడుట కదమ్మా' అనడిగాడు గిరి.

''అవున్నాన్నా, వాడిని పెంచే ఓపిక నా చేతల్లో లేక వాళ్ళకి అప్పగించేశాను' అన్నాను.

నా మాటలు వాళ్ళకి అర్థం కాలేదు. ఏడవడం మొదలెట్టారు. 'అన్నయ్యని రమ్మనమ్మా లేకపోతే మనం కూడా పోదామమ్మా!' అంటూ. వాళ్ళకి అన్నయ్యంటే అంత ప్రాణం. శేఖరానికి వీళ్ళిద్దరు రెండు కళ్ళు. వీళ్ళని విడదీసినదాన్ని నేను.

కట్టుబట్టలతో నన్ను వదిలినవాడు ఈనాడింత వాడయ్యాడు. నువ్వే చెప్పు సరోజా, వాడి బాగు కోరికదూ నేనా నాడు వాడిని వదులుకుంది! అందులో నా తప్పేమయినా ఉందా? అటువంటి పరిస్థితుల్లో నేను చేయగలిగింది మాత్రం ఏముంది?' అని కాసేపాగి 'నన్ను వాడు ఆఖరుసారిగా 'అమ్మా' అని పిలిచింది ఆ రోజునే! మళ్ళీ వాడిచేత నోరారా 'అమ్మ' అనిపించుకోవాలని తల్లిప్రాణం ఎంత అల్లాడి పోతోందో వాడికేమయినా తెలుసువా? అంత పెరాయి వాన్నయిపోయానా? ఏమిటి నా తప్పు?' అంటూ ఏడ్చేసింది.

మాట్లాడకుండా ఆవిడవంక చూశాను.

మనిషి బాగా కృశించి పోయింది. ఇదివరకు ఉండే ఉత్సాహం అంతా చచ్చిపోయినట్లుగా ఏదో ఆశతో బ్రతుకుతున్నదానిలా అగపడుతోంది.

ప్రతిసారి మా ఇంటికి వచ్చేప్పుడు ఎంతో ఉత్సాహంగా వస్తుంది. బహుశ 'ఈ సారయినా కొడుకుచేత 'అమ్మా' అనిపించుకో గలను' అనుకుంటుందనుకుంటూ. అప్పుడూ, బావకి మాత్రం ఎందుకో అంత పట్టుదల. ఆవిడ ఎదుర చూసే ఆ పిలుపు అంటే అతనికి కలిగే నష్టం ఏముంది?

నా ఆలోచనలకి అంతరాయం కలిగిస్తూ చిన్నత్తయ్య పిలుపు వినబడింది బయటనుంచి.

'అమ్మాయి సరోజినీ, పెద్దత్తయ్యని డాక్టరు దగ్గరకు తీసుకుని వెళ్ళమని చెప్పు శేఖరానికి. నువ్వు కూడా వెళ్ళు తోడుగా' అని.

'లేచి నిలబడ్డాను.

రిక్షాలో పోతుంటే పెద్దత్తయ్య బావతో 'గిరి మొన్న స్కూలు ఫైనలు పాసయాడు నీకు తెలుసు కదురా నాయనా, బాబాయి గారితో వాడి కాలేజి చదువు విషయం చెబుతావా?' అంది.

'బాబాయి గారెవరూ?'

'అదేరా.... చెప్పవే సరోజీ' అంది ఆవిడ చెప్పలేక.

నా కర్థం అయిపోయింది ఆవిడ బాధ. బావకి కూడా తెలుసుగాని తెలియనట్టు నాటకం! అందుకే విసుగ్గా అన్నాను 'చిన్న మావయ్యగారు బావా' అని.

'నాన్నగారా!'

అత్తయ్య ఏమీ మాట్లాడలేదు.

మళ్ళీ నేనే అందుకుని 'ఆవిడ చెప్పినే అనేది విషయం అయినా అర్థమయిందా?' అనడిగాను.

'ఆయన్ని నేనా విషయం అడగను.'

అత్తయ్య ముఖం చూడలేక పోయాను.

తిరిగి వస్తుంటే అత్తయ్య అడిగింది నన్నుం 'ఏమన్నాడూ డాక్టరు గారు?' అని.

ఏం చెప్పమంటావు అన్నట్లు చూశాను బావ వంక.

'త్వరలోనే నయమయి పోతుందన్నాడు' అన్నాడు బావే.

'నయమయాక పోతానన్నాడన్నమాట!'

'మాటలకలా అర్థాలు తీస్తావెందుకు? జబ్బు నయమవుతుందన్నాడు అంతే!' అన్నాడు విసుగ్గా.

బావ ఎందుకంత కటువుగా మాట్లాడుతాడు? తల్లి అన్న భావం కలగదా? అని ఆశ్చర్యం వేసింది.

సాయంత్రం డాబామీద ఒక్కడూ నిలబడి రోడ్డు వంక చూస్తున్నాడు బావ. 'షికారుకి వెళ్ళలేదేం?' అనడిగాను దగ్గరగా వెళ్ళి.

నా వంక చూసి అంతలోనే ముఖం తిప్పేసుకుని రుమాలుతో తుడుచుకున్నాడు. కాని ఆ కాసేపులోనే గ్రహించాను బావ ఏడుస్తున్నాడని.

'ఎందుకు బావా అదోలా ఉన్నావు?'

తదేకంగా నా వంక కాసేపు చూసి 'ఆవిడ ఎక్కువకాలం బతకదు' అన్నాడు.




# ముగింపు

అలిసి పడ్డాను 'ఏమిటీ పెద్దత్తయ్యా?'

అవునన్నట్లు తల ఊపాడు. కాసేపు మాట్లాడకుండా ఉండిన తరువాత నా మనస్సులోని మాట అడిగాను 'ఎందుకూ ఆవిడతో అంత కటువుగా ఉంటావు? అమ్మ కదా!'

'అందుకనే!'

'అంటే?'

'నీకు తెలియదు సరోజా నేనెటువంటి పరిస్థితుల్లో చిక్కుకుని ఉన్నానో!... పొద్దున్న నీకు చెబుతోంది కదా నేనావిడని చిన్నతనంలో ఎంతగా ప్రేమించేవాడినో ?'

'విన్నావా?'

'ఆ. ఇప్పుడే కాదు. నీతో ఆవిడ ఆ మాట చెప్పే ప్రతిసారి వింటూనే ఉంటాను.... అంతగా ప్రేమించే వాడినని, తల్లి క్షణం దూరం అయినా భరించ గలిగే వాడిని కాదని ఆవిడే చెబుతోంది కదా— అటువంటి వాడిని ఒక్కసారిగా శాశ్వతంగా దూరంగా పొమ్మంటే వాడేమయిపోతాడు?'

'అది నీ కోసం నీ భవిష్యత్తు కోసం కాదా!'

'నా కోసం— నా కోసం!... నాకు కావలసింది ప్రేమ! కడుపు నిండా తిండి, వంటికి ఖరీదయిన బట్టలూ కావు. నా వాళ్ళతో గంజి త్రాగడం! నా వాళ్ళతో పాటు చిరిగిన బట్టలు కట్టుకుని తిరగడం! ఆ చిరిగిన బట్టలతోనే చిరిగిపోయిన పలక పట్టుకున్న నాతమ్ముడిని బడికి తీసుకువెళ్ళడం! ఆ చిరిగిన బట్టలతోనే కొనుక్కునేందుకు ఏమీ ఇవ్వలేదు అమ్మ అని ఏడుస్తున్న చెల్లెల్ని బుజ్జగించడం! అది సరోజా నాకు కావలసింది. థర్డ్ ఫారంతోనే చదువు ఆపేసినా ఎక్కడున్నా వర్కుషాపులో పని చేసినా కష్టపడి సంపాయించిన నాలుగు రూపాయిలు తల్లి చేతిలో పోసినప్పుడు ఆవిడ ముఖంలో వెలిగే ఆనందం కావాలి సరోజా నాకు!.... ప్రేమ..... నాకు కావలసింది ప్రేమ! నేను పోగొట్టుకున్న ఆ రోజులు, పోగొట్టుకున్న ఆప్యాయతా ఈవాడు తివ్వగలడా ?'

బావ కంఠం పూడిపోయింది. విషయం ఎందుకు కదిపానా అని బాధ పడ్డాను. 'పోనీలే బావా, ఇప్పుడవన్నీ ఎందుకు ?'

అతను నా మాటలేమీ పట్టించుకోలేదు.

'నాన్నగారు పోయారు. పోవడమంటే పెద్దగా తెలియని వయసు నాది. అంతకన్న ముఖ్యం నాన్నగారి దగ్గర చనువు లేకపోవడం. పాపం, మమ్మల్ని పోషించి మనుష్యులుగా నిలబెట్టే యజ్ఞం వలన ఆయన మాకు దూరంగానే ఉండి పోయారు. బడి, ట్యూషన్లు— అదే ఆయన లోకం.

అందువలన నాన్నగారు ఇంకలేరు అనిపించినా కొండంత అమ్మ ఉందిలే నాకేం కావాలి అనిపించింది.

అప్పుడు ఈయన— అప్పట్లో బాబాయిగారు— వచ్చారు. వాళ్ళిద్దరి మాటలూ వినగానే నాకు గుండాగి పోయింది. ఈ ఇల్లూ, తమ్ముడూ, చెల్లెలూ అన్నిటికీ మించి 'అమ్మ'ని వదిలి వెళ్ళడమేనా అని నిలదీసింది.

అక్కడికీ అమ్మ ఒప్పుకోదు 'మనకున్న దానితోనే బ్రతుకుదాం నాయినా' అంటుందన్న ఆశతోనే వెళ్ళి 'నన్ను పంపించేస్తావా అమ్మా' అని అడిగాను.

మాట్లాడకుండా ఏడిచేసింది అమ్మ.

ఆ రాత్రి నాకు అన్నం సహించ లేదు. ఎంత సేపు వంటరిగా కూర్చున్నానో నాకే తెలియదు. లోపల తమ్ముడూ చెల్లెలూ పడుకుని ఉన్నారు. వాళ్ళ మధ్య నా కోసం స్థలం ఉంచారు. అది వాళ్ళకి అలవాటు. నేనంటే అంత ప్రేమ వాళ్ళకి. అన్నయ్యా వాళ్ళ కంటికి యువరాజా.

వెళ్ళి మధ్యలో పడుకున్నాను. నిద్ర పట్టలేదు. కాసేపటికి చూస్తే ఇద్దరూ నా మీద చేతులు వేసుకుని నా వైపు తిరిగి పడుకుని ఉన్నారు.

రేపు ఈ స్థలం ఖాళీగా ఉంటుంది. వీళ్ళకి అన్నయ్య ఉండడు. అని తలుచుకుంటే ఏడుపొచ్చేసింది... ముగ్గురుకీ ఒకే దుప్పటి కప్పుకోవడం అలవాటు. వాళ్ళని వదిలి వెళ్ళిపోతున్నా ననుకునే సరికి నాతో ఏదో పెద్దతనం వచ్చేసినట్లయింది..... దుప్పటి వాళ్ళద్దరికి నిండుగా కప్పి వాళ్ళని చూస్తూ కూర్చున్నాను ఎడంగా.

మర్నాడు బాబాయిగారితో వెళ్ళిపోతుంటే చూడలేక అమ్మ లోపలికి వెళ్ళిపోయింది. తమ్ముడడిగాడు 'ఎక్కడికి రా అన్నయ్యా' అని.

'నే వెళ్ళిపోతున్నాను నానా!' అన్నాను.

'ఎక్కడికి?' అంది చెల్లెలు. 'ఎప్పుడొస్తావు' అన్నాడు గిరి.

'దూరంగా వెళ్ళిపోతున్నాను. ఇక రాను' అన్నాను ఏడుస్తూ.

వాళ్ళిద్దరూ ఏడ్చేశారు.

ఇదంతా చూస్తున్న బాబాయిగారు పెద్ది నన్నాసుల్లారా, రాకపోవడమేమిటిరా ఎప్పుడు కావాలంటే అప్పుడొస్తాడు. పద శేఖరం' అన్నారు.

ఆఖరు సారిగా వాళ్ళని, ఆ ఇంటిని చూస్తూ రిక్షా ఎక్కాను. దారి పొడుగునా భయం— నా కోసం వాళ్ళిద్దరూ రోడ్డు మీదికి వచ్చేసి తప్పిపోతారేమోనని! ఆ మాటే ఆయనతో అంటే నవ్వేసి 'రారులే!' అన్నారు.

ఆయనకేం తెలుసు ఇటువంటివి!

అప్పటికి నాకు ఏడు సంవత్సరాలే అయినా కళ్ళకి కట్టినట్లు అదంతా గుర్తుంది. ఎందుకంటావు సరోజా? నా జీవితంలో మరువరాని మలుపు అది. మరిచిపోలేను.

ఇక్కడికి వచ్చాను. పిచ్చెత్తినట్లయింది. రోజూ కూర్చుని ఏడవడమే నా పని.

'నన్ను 'అమ్మా' అనరా శేఖరం' అనేది పిన్ని.

చాలాకాలం పాటు నా కలా పిలవడం చాతనయేది కాదు. 'అమ్మ' అందామనుకున్నప్పుడల్లా నాకు మా అమ్మే గుర్తుకొచ్చి ఏడుపొచ్చేది.

నా కోసం ఏవేవో తెప్పించేది పిన్ని. ఆ వస్తువులతో, బట్టలతో నన్ను మచ్చిక చేసుకుందామని ప్రయత్నించేది. అంతేగాని ప్రేమతో చేసుకోవడం ఆవిడకి చాతకాలేదు. ఆవిడకి అటువంటి ప్రేమ

అనుభవం కాలేదు కనుక. తెచ్చి పెట్టుకుంటే వచ్చేది కాదు కనుక!

కాలం నన్ను మార్చింది. నా కోసం, నా చదువు కోసం పాటుపడుతున్న వీళ్ళ ఋణం తీర్చుకోలేను అనిపించింది. అక్కడున్న అమ్మా వాళ్ళకి ఈయన డబ్బు రూపేణా కూడా సాయపడుతుండటం చూస్తుంటేవాడిని. వీళ్ళని ప్రేమించడం నా కర్తవ్యం అనిపించింది. ప్రయత్నించాను. కష్టపడి అలవాటు చేసుకున్నాను. పిన్ని అమ్మ అయింది. బాబాయిగారు నాన్నగారయారు. అది నా కర్తవ్యం. అంతే!' నిట్టూర్చాడు బావ.

'పెద్దత్తయ్యని కూడా 'అమ్మ' అనవచ్చుగా' అన్నాను.

''అనలేను. అంటే నా కర్తవ్యం దెబ్బతిని పోతుంది. సర్వశక్తులూ ధారపోసి ఒక పిల్లాడిని వాళ్ళ వాడిని చేసుకున్నారు వీళ్ళు. 'అమ్మా' అని పించుకోగలిగాను అని ఆనందపడుతోంది ఆవిడ. మనిషికి 'అమ్మ' అన్నది ఒక్కతే ఉంటుంది. నేను ఇద్దరిని 'అమ్మా' అనడం ఇద్దరూ సహించలేరు. అసలు అమ్మ సహించకపోయినా నేనేమీ అనుకోను. కాని ఈవిడ ఒకవిధంగా చెప్పాలంటే వీళ్ళకి ఋణపడి ఉన్నాను. వాళ్ళకి కొడుకుగా పరిపూర్ణమయిన సంతృప్తి నివ్వడమే నా 'ధ్యేయం' అని కాసేపాగి 'నువ్వొక విషయం గ్రహించావో లేదో సరోజా, పెద్దమ్మ వచ్చినప్పుడు అవిడ పట్ల అమ్మ ప్రవర్తన ఎలా ఉంటుంది?'

కొంతవరకు తెలిసినా బావ నోటనే చెప్పించాలని 'మామూలుగానే ఉంటుందే' అన్నాను.

'ఉండదు. తన చేతిలోని బొమ్మని ఎవరో ఎత్తుకు పోయేందుకు వస్తే భయపడే పిల్లలా ఉంటుంది. ఆవిడ ఉన్నన్ని రోజులూ అనుక్షణం మా ఇద్దరినీ కనిపెట్టే ఉంటుంది. అందుకనే ఇందాక డాక్టరు దగ్గరకు నిన్ను కూడా వెంట వెళ్ళమంది. ఆవిడలోని మాతృత్వం నన్ను గెలుచుకుని వెంట తీసుకుపోతుందని భయం వలన!.. చివరికి ఆవిడ వెళ్ళిపోతానన్న రోజున తేలికపడుతుంది పాపం. మళ్ళా ఆవిడ మనసు కష్టపడకుండా మంచి చీర, పిల్లలకి కూడా బట్టలు తెప్పించి ఇస్తుంది.

ఇవన్నీ ఎందుకంటావు? నా కోసం! కొడుకుగా నన్ను నిలుపుకోవడం కోసం.. ఆవిడకి తెలుసు. ప్రేమ అన్న పరీక్షలో అసలు తల్లితో తను పోటీపడి గెలవలేదని. అందుకనే ఆ అవసరం ఎక్కడ వస్తుందో అని భయపడుతుంది.

నేను పుట్టినది ఇక్కడ కాకపోయినా పెరిగినది ఇక్కడ. వీళ్ళ కొడుకుగా వ్యవహరింపబడ్డాను. అలాగే నిలబడతాను. అది నా విధి.'

'బాగానే ఉంది కాని బావా—నీ తమ్ముడు కదా, అతనంటే నీకు వల్లమాలిన అభిమానం కదా అతని చదువుకి సాయం చేయమని అడగమంటే కూడా ఎందుకంత నిష్ఠురంగా మాట్లాడావు? పాపం పెద్దత్తయ్య ఎంత బాధపడిందో తెలుసా?'

'తెలుసు. కాని నాలోనూ అమాయు ఉంది. నాకు దూరం అయిన 'అమ్మ' వాడికి దూరం కాలేదు. అందుకనే వాడంటే నాకు జలసీ. ఆ విషయం ఆవిడకీ తెలియాలి. వాడికీ తెలియాలి. అందరికీ తెలియాలి.. నేను చాలా విలువయినది పోగొట్టుకున్నాను. వాడికది స్వంతం. ఆ అదృష్టం చాలు వాడికి..'

హఠాత్తుగా ఏదో వినబడి మెట్ల వైపుకి వెళ్ళాను. అప్పటికే పెద్దత్తయ్య మెట్లు దిగి వెళ్తోంది. నాకు వినబడినది ఆవిడ ఏడుపు.

'నీ మనసు విశాలం కాదు బావా— చాలా సంకుచితం' అని కోపంగా అనేసి విసురుగా కిందికి వచ్చేశాను.

'ఏమన్నాడే డాక్టరూ' అనడిగింది చిన్నత్తయ్య.

ఏం జవాబు చెప్పాలో బుద్ధి కాలేదు. పెద్దత్తయ్యకి అన్యాయం జరిగిపోతోంది. దీన్ని నా చేతనయినంత వరకు సరిదిద్దాలి—

'గుండె జబ్బు కదా— పైగా ఏదో దిగులు ఉన్నట్టు అగపడుతున్నారావిడ!..రోజులతో పడింది. ఎప్పుడయినా కావచ్చునన్నాడు.'

ఏడ్చేసింది చిన్నత్తయ్య. 'అదుట్ట అమాయకురాలే సరోజా చిన్నతనం నుంచీ కూడా! పిల్లలంటే పడి చచ్చిపోయేది! 'సుఖంగా అంకంత ఇంట్లో ఇంటి నిండా పిల్లలతో బ్రతకాలే సావిత్రీ! చిన్నతనంలో మనం పెద్దగా సుఖపడుతోంది లేదు. దాని క్కారణం నాన్నగారికి చేతినిండా డబ్బు లేకపోవడం. మళ్ళీ జీవితంలో ఇటువంటి కష్టం కలగకూడదు.' అంటుండేది. కాని దురదృష్టవంతురాలు—దాన్ని వెన్నంటే ఉంటాయి కష్టాలని తెలియదప్పట్లో! చాలా కష్టజీవి. మా బావగారికి వచ్చే ఆ కాస్త సంపాదనలోనే గుట్టుగా జీవితం లాగేస్తుండేది పాపం. అటువంటిదాని అదృష్టం దయా తీరిపోయింది దానిమీద.

నా ఇంటికి ఒక వెలుగు నిచ్చింది అదేకదు 'ఓ! లేకపోతే పిల్లల రాతలేని నా ముఖానికి 'అమ్మా' అనిపించుకునేంత అదృష్టం ఎక్కడిది?.. డబ్బులో దానికన్నా మెరుగే అయినా అది అదృష్టవంతురాలు కనుక దీనికి కడుపు పండింది. నాకీ అదృష్టం లేకపోయింది. చివరికి ఎంతటి త్యాగం చేసిందంటే ఆ అదృష్టంలో నాకది భాగం ఇచ్చిందే! దాని ఋణం ఎలా తీర్చుకోగలను చెప్పు? మనం డబ్బు సాయం చేస్తున్నామనుకో, కాని నా నట్టింట చెట్టంత మగపిల్లాడు 'అమ్మా' అని తిరిగే భాగ్యం సామాన్యమయినదా— కలలో నయినా అనుకున్నానా!'

'నిజమే కాని అత్తయ్యా, పెద్దత్తయ్యకి ఒక దిగులు పట్టుకు పీడిస్తోందని నా అనుమానం.'

'ఏమిటది?'

'బావ ఆవిడ్ని 'అమ్మా' అనడం లేదని'

కాసేపు ఆవిడ ఏమీ మాట్లాడలేదు.

'నేను వాడిని అనద్దన్నానుటే! నా అంత మూర్ఖురాలు నేనే. బిడ్డ. వాడిష్టం. అయినా వాడు నీతికి నిలబడ్డాడు. కడుపున కనకపోయినా వాడిని అప్పటి నుంచి పెంచిన దాన్ని నేను, ఇంత వాడిని చేసినది నేను, వాడి చేత అమ్మ అనిపించుకోవలసినదాన్ని నేను. వాడు నన్ను అలా పిలుస్తుంటేనే నాలు నా జన్మ తరించిపోయినట్టుంటుంది.. ఇంకా ఇద్దరు పిల్లలున్న అదృష్టవంతురాలది. నాకున్న ఈ కాస్త కూడా తను భాగం పంచుకోవాలనుకోవడం దేనికి? అది చేసిన ఈ సహాయానికి జన్మంతా కృతజ్ఞురాలిగా ఉంటాను.'

లాభంలేదు. ఇందులో ఎవ్వరూ మారే మనుషులు



మిగిలా లేదు. ఇక్క ఎలా జరిపించుకుందో, చూస్తూ ఉరుకోవడం తప్ప నాలాంటివాళ్ళు చేయగలిగింది లేదని పించింది.

చదువుకోవడం పూర్తయి పడుకునే ముందు ఓరికినే పెద్దత్తయ్య పడుకున్న గది వైపు వెళ్ళి చూశాను. మంచం మీద అటు ఇటు కదులు

## ముగింపు

తోంది. దగ్గరగావెళ్ళి 'నిద్ర పట్టలేదా అత్తయ్యా?' అనడిగాను.

'లేదమ్మాడూ. పెద్దదాన్నయిపోయాను. ఆటే కాలం లాగలేవింకా! దక్షురా అమాటే అన్నాడు కదూ!'

'భలేదానివే, అటువంటిదేమీ అనలేదు. మందు మాత్రం జాగ్రత్తగా వాడండి, అవి కొచ్చిన భయం లేదు. అన్నాడు అంతే.

'నువ్వు విన్నట్టే చెప్పావు కదు లే!' అని నవ్వి 'బావనే చేసుకుంటావు కదూ!' అంది.

'ఇప్పుడా మాటలన్నీ ఎందుకత్తయ్యా!

'ఎవరేమన్నా వినకు. శేఖరాన్నే చేసుకో. వాడి మనస్సు నవనీతం. నువ్వంటే వాడికీ అమిత మయిన ఇష్టం.'

తెలుసు నన్నట్టుగా తల ఊపాను.

'చదువుకోవడం అయిందా — మరి వెళ్ళి పడుకో. కొంచెం గుండెలో నెప్పిగ ఉన్నట్టుంది నిద్రపట్ట లేదిప్పటి దాకా ఇహ వస్తోంది లే!' అంటూ పక్కకి వత్తిగిలి పడుకుంది

లేచి వచ్చేశాను.

నేనూ, బావా, భార్యాభర్తలమయితే చూడా లని పెద్దత్తయ్య కోరిక. చదువు పూర్తయ్యేదాకా అటువంటివి జరగకూడదని చిన్నత్తయ్య పట్టుదల. ఆ కోరిక తీరేదాకా ఆవిడ పాపం ఉంటుందా అనిపించింది. ఆలోచిస్తూనే పడుకున్నాను..

తెల్లవారు జామున మళ్ళీ చదువుకోనేందుకు లేచినప్పుడు చూస్తే పెద్దత్తయ్య మంచం మీద లేదు. కాసేపు చూశాను.. ఇంకాసేపు చూశాను. మనిషి అయిపు లేదు. బెంగారా పుట్టి బావ గది కేసి వెళ్ళాను— చెబుదామని.

బావ గదిలో లైటు వెలుగుతోంది. మంచం మీద పెద్దత్తయ్య పడుకునుంది. మంచం పక్కనే కుర్చీలో కూర్చుని ఆవిడ వంకే చూస్తున్నాడు బావ.

'బావా!' అని పిలిచాను.

నా వైపు చూసి, లేచి బయటికి వచ్చాడు. అతని ముఖం చూడగానే నాకు భయం వేసింది. ఏడ్చి ఏడ్చి ఉన్నట్టున్నాడు..!

'బావా!' అన్నాను బెంగాడుగా.

'అమ్మ పోయింది సరోజా!'

'ఏ అమ్మ— పెద్దత్తయ్యా?'

'అవును సరోజా—మా అమ్మే!'

వెంటనే నా కెందుకో కోపం వచ్చేసింది. 'ఇప్పుడు నువ్వు నా ముందు అన్నమాట కోసం ఆవిడ తపించిపోయింది. 'అమ్మా' అని నువ్వు పిలిచే ఉంటే అసలు పోయేదే కాదు. ఏమయినా సంతృప్తిగా ప్రాణం వదిలేది' అన్నాను ఆవేశంగా.

'ఆవిడ ముఖం వంక చూసి వచ్చిన తరువాత మాట్లాడు సరోజా.'

లోపలికి వెళ్ళి చూశాను.

సంతృప్తితో వెలిగిపోతోంది! సాధించాలను కున్నది పొందిన ఆనందం ఆవిడ ముఖంలో స్పష్టంగా కొట్టవచ్చినట్లు అగపడుతోంది.

నాకు నమ్మకం కలిగింది.

'నన్ను క్షమించు బావా.' అన్నాను.

'ఫరవా లేదు.. రాత్రి నువ్వు మాట్లాడి వెళ్ళ గానే నా దగ్గరకు వచ్చింది అమ్మ. మరెవ్వరినీ పిలవద్దంది— తను పోయే దాకా!

పద, ఈ వార్త నీళ్ళకి చెప్పాలి. తమ్ముణ్ణి, చెల్లాయిని తెప్పించాలి.'

ఇద్దరం బరువుగా కదిలాం.




డా॥ సి. నారాయణరెడ్డి — సుంధర

నేను నడుస్తున్నాను.
నిన్ను విడుస్తున్నాను.
నిట్టూర్పుల పంచాంగం విప్పితే
విలవెత్తుగా జడుస్తున్నాను.
అంతస్తులు పెంచుకోవడ
మెందుకు?
అంబరాల చీనాంబరాలు
కప్పుకోవాలని
బెంబేలు పడడ మెందుకు?
తొడిమెల్లా ఊడిపోతుంటె
తోక తొక్కిన తాచులా
తుళ్ళి పడడమెందుకు?
అందుకే నేను నడుస్తున్నాను
అనుకున్న నగ్న సత్యాలకు
అక్షరాకృతి కలిగిస్తున్నాను.

కలల కవుగిళ్ళు ఆశించలేదు.
కళల పొదరిళ్ళు కాంక్షించలేదు.
ఉట్టి కెక్కలేనిదే స్వర్గాలను
ఊహించలేదు; మోహించలేదు.
ఉన్నదానితో పెంచుకున్నాను
తృప్తి.
దున్నిన దుక్కిలో పండించు
కున్నాను దీప్తి.
నీ సంగతి వేరు.
నీ ఆలోచనా శ్రుతి వేరు.
విగ్నస్వరంలో నాదస్వరం కోర్చు
కున్నావు.
తంబురా చేతో పుచ్చుకుని
తుంబురుణ్ణని అనుకున్నావు.
పలికించావు పిచ్చిపాట

పడ్డావు ఆనోట ఆనోట
వేయిడికిళ్ళ లక్షనోళ్ళ
వికటంగా నవ్వినై.
దొరకలేదు ఆకాశం
జరిగింది రసాభాసం.
చుట్టూ చూశావు
జావురుమని ఏడ్చేశావు
ఒళ్ళు రక్కుకున్నావు
జుట్టు పీక్కున్నావు.
కీకారణ్యంలాంటి ఏకాంతంలో
కిమ్మనకుండా దాక్కున్నావు.
అందుకే నిన్ను విడుస్తున్నాను
నేను నడుస్తున్నాను
క్షతిలేని సత్యం వైపు.
మృతిలేని స్వప్నం వైపు.




# ఏది సత్యం? ఏదసత్యం?

సి. ఆనందారామం

**జ రి గి న క థ**

కంట్రాక్టరు సుందర్రావుగారు అయిశ్వర్య వంతుడు. ఆయన భార్య శాంతమ్మ పెద్దకొడుకు కృష్ణమోహన్ మెడిసిన్ చదువుతున్నాడు — చిన్నకొడుకు వెంకట్రావు యమ్మెస్సీ చదువుతున్నాడు. తర్వాతది కల్యాణి. ఇద్దరన్నలకీ గారాబు చెల్లి ఆమె. కల్యాణికి మౌళి తటస్థపడతాడు అతను పేదవాడు. వాళ్ళ పరిచయం ప్రేమగా మారుతుంది. తండ్రి ఆమె కొక పెద్ద సంబంధం తీసుకువస్తాడు. కల్యాణి ఇష్టపడలేదు. కొంత డబ్బు తీసుకుని మౌళితో మద్రాసు పారిపోవాలనుకుంటుంది. మౌళి అంగీకారాన్ని కూడా తీసుకుంటుంది. ఇద్దరవాకలిసి మద్రాసు వచ్చేస్తారు. కల్యాణి ఒక స్కూల్లో ఉద్యోగం సంపాదించుకుంటుంది.

4

కల్యాణి ఉద్యోగంలో చేరింది. వసుతులు లేకుండా రోజులు గడుస్తున్నాయి. కాని మౌళి ముఖంలో - చిరునవ్వు పూర్తిగా మాయమయింది. కల్యాణి ఎంత ఆదరంగా వడ్డించినా అతనికి భోజనంలో రుచి తెలియటంలేదు. ఆ ఉద్యోగం ఈ ఉద్యోగం అని లేకుండా అన్నింటికీ అప్లై చేస్తున్నాడు. ఫలితం శూన్యం. యమ్. ఏ. ఫస్టు క్లాస్ డిగ్రీ సిగ్గుతో ముడుచుకుపోయి బాధతో నలిగిపోయింది — మౌళి ఆవేదన కల్యాణికర్థమయింది. కానీ ఏంచెయ్యగలదు? అహర్నిశమూ అతని మనసెక్కడ నొచ్చుకుంటుందో అని ఆలోచిస్తూనే ప్రవర్తిస్తుంది — ఇంటి పనుల్లోకి అతను సాయం వచ్చినా రానియ్యదు. పొరపాటున కూడా అతని ఉద్యోగ ప్రస్తావన లేదు. డబ్బు ఇబ్బందుల విషయం సంభాషణలలో రాకుండా జాగ్రత్త పడుతుంది — ఏంచేసినా అతని మనసులోని ఆవేదన నెలా తుడిచెయ్యగలదు?

ఇదివరకు కల్యాణీ తనూ ఇద్దరూ ఇంట్లో ఉంటున్నప్పుడు మౌళికి కొంత కాలక్షేపంగా ఉండేది. ఇప్పుడు కల్యాణి ఉద్యోగానికి వెళ్ళటం తను ఒంటరిగా మిగిలిపోవటం, అతనికి మరీ పిచ్చిగా ఉంది—

ఒంటరితనం — సోమరితనం — భయంకరమైన ఈ రెండూ జతగూడి అతని మనసును మధించి మూల మూలల కల్మషాన్ని ఇవతలకు లాగుతున్నాయి — కారణంలేకుండా కల్యాణిమీద చిరాకు కలుగుతోంది—

పాపం, కల్యాణి బేలగాచూసి తలవంచుకుని ప్రతిసమాధాన మియ్యకుండా వెళ్ళిపోతుంది. ఆ బేలచూపులతణ్ణి నిలువునా దహిస్తాయి.

'నన్ను క్షమించు కల్యాణీ! నాకెందుకో మనస్థిమితం ఉండటంలేదు—' దీనంగా అన్నాడు మౌళి—

కల్యాణికి తెలుసా సంగతి — జాలితో ఆమె మనసు ద్రవించింది.

'ఛ! నేను క్షమించట మేమిటి? నామీద చిరాకు పడ్డారంటే, అంతకు పదిరెట్లెక్కువగా మీ మనసు చికాకు పడుతోందని నాకు తెలుసు—'

ఆర్ద్రంగా అంది—

ఆ రోజు మౌళిమనసు మరీ చిరాగ్గా ఉంది. పత్రికలో ఏదో మంచి సినిమా ప్రకటన కనిపించింది. సాయంత్రం కల్యాణి రాగానే 'ఇవాళ మనం సినిమా కెళ్దాం కల్యాణీ! నాకు చిరాగ్గా ఉంది — కొంత రిలీఫ్!' అన్నాడు.

పెళ్ళయిన క్రొత్తల్లో సినిమా అనగానే కల్యాణి ఎంతో ఉత్సాహంతో తయారయ్యేది ఇప్పుడూ అలాగే ఉత్సాహం చూపిస్తుందనుకున్నాడు. కాని సినిమాపేరు చెప్పగానే కల్యాణిముఖం వాలిపోయింది — అతి కష్టంమీద కంఠం పెగుల్చుకుంటూ 'ఇంట్లో పదిరూపాయలే ఉన్నాయి ఇంకా ఫస్టు పదిరోజాలుంది.' అంది—

మౌళికి అకారణంగా కోపం వచ్చింది.

'అవును. పెద్ద సంపాదిస్తున్న వాడిలా నిన్ను సినిమాకాహ్వానించటమేమిటి? ఏదో గుప్పెడు మెతుకులు దొరుకుతున్నాయి, తిని పడుండక సినిమాలూ షికార్లూ ఏమిటి?'

కసిగా అన్నాడు. కల్యాణికళ్ళు నీటితో నిండిపోయాయి. కన్నీటి తెరలు చీల్చుకొంటూ అతనివంక దీనంగా చూసి పక్కమీద వాలి కుమిలి కుమిలి ఏడవసాగింది —

జుట్టు రెండు చేతులతోను పీక్కున్నాడు మౌళి. ఏమిటిది? ఎందుకిలా అయి

పోతున్నాడు తను? 'కల్యాణదగ్గరగా వచ్చి ప్రక్కన కూర్చుని కళ్ళు తుడిచాడు. అతని మెడచుట్టూ చేతులువేసి గుండెల్లో తల దాచుకుని కరువుతీరా ఏడ్చింది కల్యాణి—

'ఊరుకో కల్యాణీ! ఊరుకోవా! ఈ కోపం నీమీదకాదు. నామీద నాకు—రోజులు మూడాయి పోతున్నాను కల్యాణీ! నిన్ను హింస పెడుతున్నాను. అంతకు కోటిరెట్లు నరకం నేను అనుభవిస్తున్నాను—'

'నాకు తెలుసు అందుకే అసలు భరించ లేకుండా ఉన్నాను.'

కల్యాణి కళ్ళు తుడుచుకుంది—

'కష్టాలొచ్చినప్పుడే మనిషి [illegible] బయటపడుతుంది. ఇంత మాత్రానికే ఇంత కుంగిపోతారా? ఉన్న డిగ్రీ ఏమయి పోతుంది? ఇవాళ కాకపోతే రేపు ఉద్యోగం దొరకదా? పోనీ, నన్ను మానెయ్య మంటారా, చెప్పండి—'

'నీకు పుణ్యముంటుంది. ఆ పని చెయ్యకు. ఈ మధ్య పస్తులులేవు. పాపం! అయిన వాళ్ళందర్నీ వదులుకుని ఏం సుఖపడుతున్నావు కల్యాణీ! పోనీ! మీవాళ్ళ దగ్గర కెళ్ళిపోతావా? నాకుద్యోగం దొరి కాక వద్దువుగాని...'

'మావాళ్ళ దగ్గరకా? [illegible] వాళ్ళకూ నాకూ ఋణం తీరిపోయింది. నాకున్నదల్లా మీరొక్కరే! మీ సాహచర్యమే నాకు సర్వసుఖాలూ! మీరు లేకుండా నాకు సుఖమనేది ఉంటుందా? ఎందుకు మరొకచోటకి వెళ్ళటం'

మురళి బరువుగా నిట్టూర్చాడు. ఏం మాట్లాడలేదు.

మురళికి కాఫీ అందిస్తూ భయం భయంగా అడిగింది కల్యాణి.

'ఇవాళ మా స్కూల్లో ఫంక్షనుంది. సాయంత్రం ఆలస్యమవుతుందేమో,



'ఉండూ?'

'ఉండు! నువ్వో ఉద్యోగస్తురాలివి. నీకు స్కూల్ ఫంక్షన్లూ, ఇవన్నీ—నాకేమిటే? పంపేరివి! ఎలాగో అయిదువరకు గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటానా? మరో అయిదుగంటలు కూర్చుంటాను. నువ్వొచ్చే వరికి వంటా అదీ పూర్తి చేసేస్తాను వెళ్ళరా!'

కల్యాణి ఒక్కమాట మాట్లాడకుండా గిరుక్కునతిరిగి లోపలికెళ్ళిపోయింది.

సాయంత్రం కల్యాణి అయిదింటికే వచ్చే సరికి చంద్రవౌళి ముఖం వికసించింది. అది కల్యాణి కంట పడింది. రాబోయే చిట్కాల్పున్ను లోపలే అణచుకుంది.

'ఆలస్యంగా వస్తానన్నావుగా! ఇంత త్వరగా వచ్చేసావేం?'

'ఉండాలనిపించలేదు —' మనసారా అంది

'అదేమిటి కల్యాణీ! ఉండిపోవలసింది. నేను బాధపడతాననుకున్నావా? ఏంలేదు. పోనీ ఇప్పుడువెళ్ళు—అయిదేగా అయింది—మీ ఫంక్షన్ ఆరున్నరకి గదూ!'

'పోనిస్తురూ! ఆఫంక్షన్లో ఏముంది? హాయిగా మీతో కబుర్లు చెప్పుకుంటుంటేనే బాగుంది' నవ్వుతూ లోపలి కెళ్ళిపోయింది కల్యాణి—

వౌళి కిష్టమయిన ఉల్లిపాయ పకోడిలు చేసి రెండుప్లేట్లలో తెచ్చింది—వౌళిమనసు సంతోషంతో ఉరకలేసింది. చాలా రోజుల తరువాత అతనికేదో సంతృప్తి

# ఏది సత్యం?...

కలిగింది—

'ఏయ్! కల్యాణీ! రెండు ప్లేట్లలోవి ఒక ప్లేట్లో వేసెయ్యి— ఆ ప్లేటిలా మధ్యకి తీసుకురా!'

వౌళి ఇంత సరదాగా మాట్లాడు తొంటే కల్యాణికసలు వళ్ళు తెలియలేదు.

పకోడిలు కల్యాణి నోటికందిస్తూ నోటి దగ్గరవి లాక్కుంటూ చిలిపిగా ఆడుకుంటు న్నాడు వౌళి—అంతలో పదిపది హేనుమంది కల్యాణి కొలిగ్స్ బిలబిలలాడుతూ వచ్చే సారు—వౌళి చటుక్కున లోపలి కెళ్ళి పోయాడు. కల్యాణి ఉస్సురంది వాళ్ళెందు కొచ్చారో తెలుసు కల్యాణికి—తనను బల వంతంచేసి తీసికెళ్ళడాని కొచ్చారు.

'ఏమిటిది కల్యాణి! అవతల స్కూల్లో ఫంక్షనుంటే తమరిలా సరసాలాడుతూ కూర్చున్నారా? ఏీ ఆయనగారెక్కడికీ పారి పోరుగాని త్వరగా బయలుదేరు—'

కొంత చనువున్న ఒక స్నేహితురాలు స్వతంత్రంగా అంది—

'మీ ఆయనగారికోసం చేసిన పకోడీలు మేం తినొచ్చా?' మరొకావిడ అల్లరిగా అడిగింది.

'అయ్యో తీసుకోండి. ఉండండి. కాఫీ చేస్తాను.'

'వద్దు. ఇప్పుడు కాఫీలు పెట్టుకుంటే ఆలస్యమయిపోతుంది. త్వరగా బయలదేరు'

'క్షమించండి. నేను రాలేను—'

'క్షమించం. నువ్వు రాక తప్పదు మేం లాక్కుపోతాం—'

'నేను రాలేను. పాపం. ఆయున ఒంటరిగా ఉండవలసి వస్తుంది—'

'ఒంటరిగా ఇంట్లో ఎందుకూ? ఏ క్లబ్‌కో వెళ్ళమను.'

'ఆయన కలాంటివి ఇష్టంలేదు—'

'ఆహా! పురాణ పురుషుడన్నమాట! ఏం చేస్తున్నారు?'

'ఆయన...ఆయన... వ్యాపారం చేస్తు న్నారు.'

'ఏం వ్యాపారం?'

'ముత్యాల వ్యాపారం!'

'నిజంగానా? నీవంటిమీద ఒక్క ముత్యాల నగకూడా లేదే!'

'నాకు నగలంటే ఇష్టంలేదు.'

'ముత్యాల వర్తకంలో బాగా లాభం వస్తుందంటారు కదూ! మీ బేంక్ ఎకౌంట్ బాగా ఉండి ఉండాలి—'

'అంతా ఈ మధ్యే ప్రారంభించారు.'

'అయితే ఉద్యోగమేదీ లేదన్నమాట! ఏం చదువుకున్నారు?'

'ఎం. ఎ లెక్కలు ఫస్ట్‌క్లాస్.'

'అబ్బా! అంత చదువుకుని ఊరికే ఉండగలరా?'

'ఆయనకు మరొకరిక్రింద పనిచెయ్యటం ఇష్టంలేదు. వల్లమాలిన ఆత్మాభిమానం—'

'ఈ సోది వరేకాని బయలుదేరు. టైం లేదు—'

'ప్లీజ్ నన్నొదిలేయండి నేను రాను. నావంట్లోనూ బాగులేదు.'

'ఇప్పుడేగా పెళ్ళికూతురిలా కిల కిల నవ్వుతున్నావు. వంట్లో బాగుండలేదంటే ఎవరు నమ్ముతారు? నువ్వు రాకపోతే తెలుగుడ్రామా నాశనమయి పోతుంది. స్టూడెంట్సంతా గోల పెడుతున్నారు.'

'అదికాదు. ఆయన కిష్టంలేదు' కల్యాణి నాలుక కరచుకునే లోపలే ఒకా విడ స్వతంత్రంగా వౌళి దగ్గరకెళ్ళి పోయింది.

'ఏవండీ! ఇవాళొక్కరోజుకి కల్యాణిని కాస్త పంపించండీ! తెలుగుడ్రామా ఆవిడ డైరెక్టు చేస్తున్నారు. పిల్లలందరికీ చాలా నిరుత్సాహంగా ఉంటుంది—'

వౌళి ముఖం పాలిపోయింది. ఇందాకటి నుంచీ వాళ్ళ సంభాషణంతా అతనికి వివి





పిస్మా_నే ఉంది—అతని మనసు ముక్కలు ముక్కలవుతోంది—

'తీసికెళ్ళండి! నేనెందుకు వద్దంటాను?' అన్నాడు కొంచెం కఠినంగా.

'చూసావా? ఆయన ఒప్పుకున్నారు. ఇంక వంకలు పెట్టకు. సంవత్సరాని కొకసారి ఉద్యోగం కేవలం జీతానికి కాకూడదు—మన విద్యార్థినులమీద మనక్కాస్త అభిమానముండాలి—'

విధిలేక లేచింది. దడదడలాడే గుండెలతో వసారా దగ్గరకొచ్చి 'వెడుతున్నాను—' అంది—చిరునవ్వుతో 'వెళ్ళు' అన్నాడు. ఆచిరునవ్వు బొత్తిగా అర్థంకాలేదు కల్యాణికి—యాంత్రికంగా వాళ్ళతో నడచింది.

ఫంక్షన్ పూర్తయ్యేసరికి పదిన్నరయింది రిక్షాలో ఇంటికొచ్చిన కల్యాణికి పెద్ద తాళంకప్ప భయంకరంగా కనిపించింది—ఒక్కక్షణం గుండె ఆగి నట్లనిపించింది—పక్కవాటాలో ఉంటున్నావిడ అలికిడికి ఇవతలికొచ్చి తాళంచెవి ఇచ్చింది.

'ఆయనెక్కడికెళ్ళారు?' ఆదుర్దాగా అడిగింది కల్యాణి—

'ఏమోనండీ!'

'ఎప్పుడొస్తారు?'

'నేనడగలేదండీ!' సగం నవ్వుతోలుగా సగం వెక్కిరింపుగా అనేసి వెళ్ళిపోయిందావిడ—యాంత్రికంగా తాళంతీసి లోపలికి నడిచే ఓపికకూడాలేక గుమ్మంలో కూలబడింది. చిమ్మచీకటి వికృతంగా వికటాట్టహాసం చేస్తున్నా లైట్ వెయ్యాలని తోచలేదు కల్యాణికి—తనకు చిరపరిచితమైన పదధ్వనికోసం వళ్ళంతా చెవులు చేసుకుని చీకట్లో అలాగే గుమ్మంలో కూలబడింది:

* * *

చిమ్మచీకటి—నీరవ నిశీధి — కల్యాణి సర్వాంగాలలో చెవులుమాత్రమే పనిచేస్తున్నాయి. కీచురాళ్ళ అరుపులు—ఎవరో బలవంతాన గొంతు నొక్కుతుంటే, ఊపిరి కోసం సమస్త శక్తులతో పెనగులాడుతూ చేసే ఆక్రందనలాంటి 'కీ'కారాలు.

ఎక్కడో పసిబిడ్డ ఏడుపు—గంటలు కొడుతున్నారు—

పదకొండు! పన్నెండు!

ప్రక్క వాటాలో ముసలావిడకి జబ్బుగా ఉంది. ఉండుండి మృత్యువుతో పెనగులాడుతూ గట్టిగా అరుస్తోంది. వయసు చెల్లిపోయినా, బ్రతుకులో మాధుర్యం పూర్తిగా ఇంకిపోయినా, శారీరిక మానసిక వేదనలు బ్రతుకునుక్షణం క్రుంగదీస్తున్నా మృత్యువంటే భయమే!

'ఈ 'నేను'! ఈ 'నేను' లేకుండాపోతే ఏమవుతుంది? అసలీ 'నేను' లేకుండా ఎలా పోతుంది? 'నేను'గా కాక మరోలా ఎలా ఆలోచించటం?

ఎన్ని కష్టాలైనా, ఎంతటి ఆవేదనైనా, ఎలాంటి దుఃఖాన్నయి సహించచ్చు. ఈ 'నేను' తో ముడిపడి ఉంటే! కాని 'నేను' లేకపోతే? అమ్మో! అదే భయం—

మరణానంతరం 'నేను' లేకుండా ఊహించటం చాతకాకే స్వర్గ నరకాల కల్పన!

ఎవరో రెండో ఆట చూసి వస్తున్నారు కాబోలు! అందులో హాస్యాన్ని చెప్పుకుని నవ్వుకుంటున్నారు—

# ఏది సత్యం?...

గంటలు! ఒంటిగంట! రెండు!

అటు వక్కవాటాలో తలుపులు తెరిచిన చప్పుడు! అతి మెల్లగా పడుతున్న పద ధ్వని. ఏదో పురుషాకారం కదిలి వెళు తోంది—దొంగా? కాదు. తన దొరతనం కాపాడుకోవటానికి త్వర త్వరగా వీధిలో కలిసిపోతున్నాడు —ఏదో మధ్య తరగతి కుటుంబం. కట్నమిచ్చుకోలేని తండ్రి — ఆవిడకేవిధంగానూ అర్హుడుకాని రెండో పెళ్ళివాడికిచ్చి పెళ్ళి చేసాడు—ఆవిడ చాలా మంచిది. పాపం, గుట్టుగా కాపురం చేసుకుంటోంది. గుట్టు రట్టు చేసుకోలే దెప్పుడూ.

గంటలు— మూడు -- నాలుగు—

వక్కవాటాలోంచి ఒక్కసారిగా ఘొల్లు మని కేకలు—

'అయ్యో! అమ్మా! వెళ్ళిపోయావా?'

'మమ్మల్నొంటరిచేసి పోయారత్తయ్యగారూ!'

అంతవరకూ నిద్రపోతున్నవాళ్ళు లేచి ఏడు స్తున్నారు. ఆవిడ పోయినట్లుంది—

అలవాటు! మనిషి అలవాటుకు బానిస. సుఖాలేకాదు. భరింపరాని కష్టాలుకూడా అలవాటయిపోయి మామూలుగా అయిపో తాయి—అప్పటికి నాలుగేళ్ళనుండీ ఉన్న ఆవిడ జబ్బు మూలుగులూ అందరికీ అల వాటయి పోయాయి—అందుకే నిశ్చింతగా నిద్రపోయారు.

ఏ అజ్ఞాతశక్తి అజ్ఞకొరకో ఆమె పరి సరాలలో తచ్చాడుతూ తటపటాయిస్తున్న మృత్యువు ఇన్నాళ్ళకామెను తన చల్లని కౌగిలిలో బిగించింది.

ఆమె మరణం అత్యంత సహజమే అయినా, బ్రతుకుకంటె మరణమే ఆమెకు వాంఛనీయమైనా హృదయ విదారకమైన ఆక్రందనలు—తమను శాశ్వతంగా వదిలిన ప్రాణికోసం—

అంతవరకూ జీవంతో స్పందించి జడా కృతి వహించిన శరీరాన్ని దర్శించలేక నిత్య నూతనమైన ఆ కటిక సత్యాన్ని జీర్ణిం చుకోలేక —

గంటలు! అయిదు! ఆరు!

భళ్ళున తెల్లవారింది!

నిద్రలేని కల్యాణికళ్ళు భగ్గుమన్నాయి. ఏడుగంటలకాలం బిగించుకొని ఉన్న నుపుట్టుక్కున విరిగింది—

దినమస్తు ప్రకృతి భూపాలరాగాన్ని ఆల పిస్తోంది. క్రొత్తరోజా—క్రొత్త ఆశలు— క్రొత్త ఆశయాలు— క్రొత్త భయాలు— క్రొత్త దుఃఖాలు—

సరికొత్త పాట! నిత్య నూతనమైన సృష్టి ప్రకృతిని రాగరంజితం చేస్తోంది. బ్రతకటమే తప్ప బ్రతుకునిగురించి ఆలో చించటం తెలియని (మనకు తెలిసినంత వరకు) పక్షులు పరవశించి కలకల నవ్వాయి.

చీకటిని చీల్చుకొంటూ వెలుగురేఖ లావ రించు కొంటున్నాయి. ఆ వెలుగు స్వరూప మేదో తెలియరానంత మసక కాంతి. ఆ మస కలో ఏదో మాధుర్యం మత్తువదిలీ వదలని కళ్ళు ఆ వెలుగులకు విచ్చుకుంటున్నాయి. విచ్చుకుని వింతగా చుట్టూ చూస్తున్నాయి.

అలసటే ఎరుగని నిరంతర ప్రయా ణీకుడు సూర్యభగవానుడు నిండుగానవ్వుతూ పైకొచ్చాడు.

రాసిపోసుకున్న కెంపుల్లాగ — గడ్డ కట్టిన నెత్తురులాగ, రూపుదాల్చిన రాగం లాగ—అంతుతెలియని క్రౌర్యంలాగ జాలితో రక్తాశ్రువులు కారుస్తూ.

—క్రోధంతో నిప్పులు క్రక్కుతూ ప్రకృతిని పులకింపచేస్తూ

—జీవులను హెచ్చరిస్తూ.

బాలారుణ సూర్యబింబం చక చక మింటి కెగబ్రాకుతోంది—

లయ తప్పని పదధ్వని— కల్యాణి చటు క్కున లేచి నించుంది. మౌళి—నలిగిపోయిన బట్టలు—రేగిపోయిన తల— అలసిపోయిన కళ్ళు—

సుడిగాలిలా ఎదురెళ్ళి అతనినల్లేసు కుంది. 'వచ్చారా ? వచ్చారా? వచ్చారు ! నా ప్రాణాలు పోకుండా వచ్చారు.'

కన్నీళ్ళు—చిరునవ్వులూ—

దుర్భరావేదన అంతమైన తొలి క్షణపు అనిర్వచనీయానందం—

'వచ్చాను. కాకేం చేస్తాను? నీ దగ్గిరకి రాకపోతే నాకు తిండెవరు పెడ్తారు ? నే నెలా బ్రతుకుతాను ?'

అతి గాఢంగా మౌళిని పెనవేసుకున్న కల్యాణి చేతులు వాలిపోయాయి. రాత్రి తెల్లవార్లూ నిద్రలేని ఆ కళ్ళు విభ్రాంతంగా మౌళి ముఖంలోకి చూసాయి.

తల వాల్చుకుని లోపలకు నడిచింది. రెండడుగులు వెయ్యగానే కూలబడిపోయింది.

'ఏం చెయ్యమంటారు నన్ను ? నేనేం చేస్తే మీకు సంతోషంగా ఉంటుంది ? ఎందుకిలా హింసిస్తున్నారు నన్ను?'

అణచి అణచి ఉంచుకున్న దుఃఖం పొంగి పొంగి ప్రవహించింది.

'నేను నిన్ను హింసిస్తున్నానా? అప్పుడు నీ స్నేహితురాళ్ళతో నీ భర్త ఉద్యోగస్థుడని చెప్పకోడానికి వీల్లేకుండా చేసాను. వ్యాపారస్థుడని కల్లబొల్లి అబద్ధాలు కల్పించి చెప్పుకోవలసిన అవస్థ కలిగించాను. దారుణమైన హింస కదూ!'

చిత్తరపోయి చూసింది కల్యాణి.

'అదా ? అది...నేనేం చెయ్యను ? వాళ్ళతో అలా చెప్పవలసి వచ్చింది—ఈనాటి మన సంఘ స్వరూపమేమిటో మనకే సరిగ్గా అర్థం కావడంలేదు స్త్రీ పురుషులు సమానులని నినాదాలు. కానీ, ఏ సంసారంలో నైనా పురుషునికంటే స్త్రీ ఎక్కువ సంపా దించుకొంటే స్త్రీలకే ముందు నవ్వులాట—

మాస్కూల్లోనే ఒకావిడకు భర్తకంటె జీతమెక్కువ. ఇంచుమించు ప్రతి ఒక్కరూ ఆవిషయం చెప్పుకుని నవ్వుకోకుండా ఉండరు. ఆవిడదగ్గిర అప్రస్తావన ఏదో ఒక విధంగాతెచ్చి కించపరచక మానరు. అట్లాంటప్పుడు—'

'అలాంటప్పుడు నీభర్త కసలుద్యోగం లేదని చెప్పటం నీకు మరీ అవమానమవు తుంది. అవును ఈ నాటి మనసంఘ స్వరూపమేమిటో మనకే అర్థం కావటం లేదు పురుషుడు తన ఆధిక్యతను వహించ లేక పోతున్నాడని స్త్రీల ఆరోపణ—కాని న్యాయానికి స్త్రీలే తమకంటె అధికుడు కాని భర్తను వహించలేరు. తనకంటె అన్ని విధాలా అధికుడయినవాడి నీడను ఒదిగి ఉండటమే స్త్రీ సహజంగా భావిస్తుంది. అందరూ దానినే గౌరవిస్తారు. దానికి వ్యతిక్రమం ఐ పరిహాసాస్పదమవుతుంది. నీభర్త నీ సంపాదనమీద ఆధారపడి ఉంటు న్నాడన్న విషయం నీకే అవమానకర విష యంగా తోచింది. ఇంతటి సామాన్య విష యాన్ని లేనిపోని అబద్ధాలతో క్రమ్మకో వలసొచ్చింది—వద్దు! కల్యాణీ! ఈ అబద్ధాల జీవితం వద్దు. ఈనరకం ఇంక నేను భరించ లేను. మీవాళ్ళ దగ్గిరకెళ్ళిపో! నేనేదైనా ఉద్యోగం చూసుకున్నాకే నాదగ్గిర కొద్దువు

గాని...'

మౌళి విసురుగా లేచిపోయాడు. కల్యాణి తూలిపోతూ లేచింది—త్వరగా కాఫీ తయారుచేసి మౌళి కందించింది—ఆ కాఫీ వంక అసహ్యంగా చూశాడు మౌళి—

'వద్దు నాకెందుకో త్రాగాలని లేదు' చికాగ్గా అన్నాడు.

కల్యాణికి కన్నీళ్లు కరువయ్యాయి వకాసంగా కాఫీ కప్పుతీసుకుని లోపలకు నడిచి ఆ కాఫీ మోరీలో పారబోసింది—నిలబడటానికి కూడా శక్తి లేకుండా శరీరం తూలిపోతోంది. ఆలోచించే శక్తి నశించిపోయింది—వెళ్లిపడు కుంది. తొమ్మిదిగంటలకు కల్యాణి దగ్గర కొచ్చాడు మౌళి.

'ఇవాళ స్కూల్‌కి సెలవా ?'

'.........................'

'ఇవాళే మీవాళ్ల దగ్గరకెళ్లు—'

కల్యాణి మూసినకళ్లు విప్పి చూసింది. మౌళి కల్యాణి వంక చూడటంలేదు. లేకుంటే ఎర్రగా జ్యోతుల్లా ఉన్న ఆకళ్లు అతనినింక మాట్లాడనిచ్చేవి కావు. కంఠంలో ఆ కాఠిన్యాన్ని నిలవనిచ్చేవి కావు

'డబ్బు లేదంటావు. ఉన్నదంతా తీసుకుని టికెట్ రిజర్వు చేయించుకొస్తాను. శాకేం మిగలకపోయినా ఫరవాలేదు'

మౌళి వెళ్లిపోయాడు—కల్యాణి చాలా సేపు అలాగే పడుకుని ఉండిపోయింది. తరువాత అతి ప్రయత్నంమీద లేచింది—ఒంట్లో ఏమాత్రం శక్తి లేదు. జ్వరం వచ్చి పట్నుగా ఉంది. మనసేదో మైకం ఆవహించినట్లయి పోతోంది—అలాగేలేచి ఎలాగో అన్నంవార్చి, కూర, సాంబారు చేసింది. తన ముఖం చూస్తే చికాకొచ్చి వరిగ్గా తిన దేమోనని పీటా, కంచం, మంచినీళ్లూ, పదార్థాలూ, అన్నీ ఏర్పాటుగా అమర్చి మళ్లీ పక్కమీద వాలిపోయింది—

హైదరాబాద్‌కు టికెట్ కొనేసి హోటల్లో భోజనంచేసి తిరిగి తిరిగి వచ్చాడు మౌళి.

రెండే గదులు. చిన్నవంటిల్లు ముందుగది లోంచే 'కల్యాణీ!' అని పిలిచాడు. సమాధానం రాలేదు.

మళ్లీ పిలిచాడు. సమాధానం లేదు—

పడక గదిలో కెళ్లాడు. కల్యాణి కళ్లు మూసుకు పడుకుంది.

'హుఁ! పొగరు! పిలుస్తూంటే కూడా పలకాలని లేదు. ఆవిడ ఉద్యోగస్తురాలు!' కళ్ళు మూసుకున్నాడు!

'కల్యాణీ!' గట్టిగా పిలిచాడు.

అప్పటికీ సమాధానం లేదు.

ముందుకు వంగి గట్టిగా కుదిపాడు. చెయ్యి చుర్రుమంది. కల్యాణి శరీరం జ్వరంతో పేలిపోతోంది. వంటిమీద స్పృహ లేదు.

మౌళి గాభరాపడిపోయాడు అంతవరకూ చేతులో పట్టుకున్న హైదరాబాద్ టికట్ పట్టు తప్పి చెయ్యి జారిపోయింది. మీదకు వంగి 'కల్యాణీ ! కల్యాణీ !' అన్నాడు ఆందోళనగా!

కల్యాణి కళ్లు విప్పి అయోమయంగా చూసింది. 'దాహం' అన్నట్లు సంజ్ఞ చేసింది. త్వరగా వంటింట్లో కొచ్చాడు. కల్యాణి తయారుగా ఉంచిన భోజనం అతనివంక దీనంగా చూసింది. ఇన్నాళ్లుగా మౌళి ఆత్మాభిమానంలో, ఆవేదనలో అణగి పోయిన అంతరాత్మ మేలుకున్న మౌళి మనసును చిత్రవధ చెయ్యసాగింది. గ్లాసుతో నీళ్లు తీసుకుని కల్యాణిదగ్గర కొచ్చాడు. కల్యాణిని లేవదీసి మంచినీళ్లు పట్టించాడు. రెండు గుక్కలు తాగి అంతలోనే వెనక్కు వాలిపోయింది కల్యాణి.

'కల్యాణీ!' ఆర్తనాదం చేసాడు మౌళి. మోకాళ్లలో తల పెట్టుకుని పసిపిల్లాడిలా ఏడవసాగాడు.

'ఛీ ఛీ! ఈ సమయంలో ఏడుస్తూ కూచుంటారా? ముందెళ్లి డాక్టర్ని తీసుకు రండి—'

మౌళి ఉలికిపడి చూసాడు. ఎవరో అపరిచిత—

'నేను కల్యాణి స్నేహితురాల్ని. నాపేరు సుమిత్ర. తను నిన్ననే అదోలా ఉంది. దానికితోడు ఇవాళ స్కూల్‌కి రాకపోవ టంతో ఎలా ఉందోనని వచ్చాను. ముందెళ్లి డాక్టర్ని తీసుకు రండి—స్పృహకూడా లేనంతటి జ్వరంలో తనుంటే ఏడుస్తూ కూచున్నారా?'

మౌళిలేచి తలవంచుకు నిలుచున్నాడు. అతనిజేబులో ఒక్కరూపాయుంది. ఉన్న దంతా ఊడ్చి హైదరాబాద్‌కు టికట్‌కొని మిగిలింది హోటల్లో ఖర్చు పెట్టాడు. ఒక్కరూపాయ కేడాక్టరొస్తారు?

'వెళ్లరేం ?' చికాగ్గా అంది సుమిత్ర.

'నా దగ్గర డబ్బులేదు—' వణకుతూ అన్నాడు మౌళి.

సుమిత్ర నిశ్చేష్టురాలై చూసింది.

మౌళి తన నిగ్రహాన్ని పూర్తిగా కోల్పోయాడు.

'నేను రాక్షసుణ్ణి ! పిశాచాన్ని — మీ యిష్ట మొచ్చినవిధంగా నన్ను శిక్షించండి — భరిస్తాను. జీవితాంతం మీకు బానిసగా ఉండి మీ ఋణం తీరుస్తాను. నా కల్యాణిని రక్షించండి—'

కన్నీళ్లతో చేతులు జోడించాడు సుమిత్రకు—

సుమిత్ర చటుక్కున ముఖం తిప్పు కుంది.

'మీరిక్కడే ఉండండి. నేనెళ్లి డాక్టర్ని తీసుకొస్తాను'

చక చక బయటకు నడిచింది.

(ఇంకా ఉంది)

మన పెద్దాళ్లు కుటుంబ నియంత్రణం అవలంబించడం నాకేమాత్రమూ నచ్చలేదురా
రేపు ఆడుకోడానికి మనకి నేస్తాలు కరువైపోరూ!



# వారఫలం

**21-3-1969 శుక్రవారం మొదలు**

**27-3-1969 గురువారం వరకు**

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం:** వారం మధ్యలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. వృత్తిలో శ్రమకు గురికాగలరు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— అధికవ్యయం జరుగుతుంది. ఆరోగ్యంబాగా ఉంటుంది.

**మిథునం:** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. వారంమధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో యెవరిని విశేషంగా నమ్మడం తగదు. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది.

స్త్రీలకు:— సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**కర్కాటకం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. సాహసముతోకూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు:— బంధువులకు సహాయం చేస్తారు. ఆరోగ్యం బాగా ఉండదు.

**సింహం:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. సాహిత్యకళారంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు:— బంధుమిత్రులను కల్సుకొంటారు. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**కన్య:** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో బాధ్యత భారం పెరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారంమధ్యలో అనుకోని చికాకులకు గురి కాగలరు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ఆందోళన కలుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాలలో పాల్గొంటారు.

**వృశ్చికం:** ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో నూతన మార్గాలు తగవు. వ్యాపారంలో ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అలంకారంకోసం వ్యయం చేస్తారు.

**ధనుస్సు:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు లాభిస్తాయి. పోటీవారితో మాట పట్టింపులు తగ్గు. నూతన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మకరం:** కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాలు శ్రమనిగూడ నడుస్తాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు:— దైవకార్యాలు నెరవేరుతాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కుంభం:** వ్యాపారంలో పోటీవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాలలో పాల్గొంటారు.

**మీనం:** వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

— ప్రకాష్

మధుసూదనాన్ని చాలా క్లిష్ట పరిస్థి
తిలో ఆస్పత్రికి తీసుకెళ్ళారని తెలియ
వచ్చింది. నిన్న సాయంత్రంవరకూ ఓపిగ్గానే
పనిచేసిన మధుసూదనం — ఎప్పుడో
ఒకప్పుడు - అట్లా హఠాత్తుగా హాస్పి
టలుకు చేర్చబడతాడని, సుందరం అను
కుంటూనే ఉన్నాడు. కాని — ఆ అను
కోవడం ఇంతత్వరగా నిజమవుతుందని
అనుకోలేదు

మధుసూదనం అంటే—చాలా నెమ
్మదైన మనిషి. సుందరం పరిభాషలో
గొత్తిగ నోట్లో నాలుక మెదలని మనిషి
అతగాడికి ఇద్దరు పిల్లలూ, భార్యాగాక
ముసలి తల్లిదండ్రులు. పెళ్ళికావలసిన
చెల్లెలూ, ఆ పైన— డిపార్టుమెంటులో
ఎన్ని సిగాన్నా ఎదగని ఉద్యోగమూ —
మొగలగు దేశంలో అందరు గుమాస్తా
లకు కొద్దో గొప్పో ఉండే క్వాలిఫికేషన్లన్నీ
— వున్నాయి. దీనికితోడు— మూడోచెయ్యి
అనేది ఎదగని వాడుగూడాను. ఇవన్నీగాక
— సర్వీసులో వచ్చిన అయిదారు ఇంక్రి
మెంట్లకన్నా, బోలెడు రెట్లు పెరిగిన—
ఉబ్బసవ్యాధీ ఉంది. పాపం, ఆ ఉబ్బసం
చెయ్యబట్టే — అతను చాలా తిప్పలు
పడ్డాడు. సెలవులు అట్లావుండనీ, చివాట్లు
గూడా తింటాడు. ఎప్పుడన్నా అయ్యగారి
ముందు వున్నప్పుడు దగ్గితే — 'నయం
చేయించుకుంటే ఏం రోగమయ్యా?' అని
చిరాకు చిత్తగించటం, చిత్తమని మధు
సూదనం విన్నవించుకోవడం అప్పుడప్పుడూ
జరిగే సంఘటనల్లో ఒకటి.

అట్లాగని మధుసూదనం మీద అయ్య
గారికి అభిమానం లేదనికాదు. ఎంత అభి
మానం లేకపోతే— 'మీరు నన్నొక నెలపాటు
సెలవుమీద వదిలితే, ఎట్లాగో ఆస్పత్రిలో
చేరి ఈ ఉబ్బసాన్ని వదల్చుకుంటాను,
అప్పుడు— ఇహ ఎప్పటికీ ఇల్లూ వాకిలీ
లేకుండా మీచుట్టే ఉండే అవకాశం
వుంటుంది'— అర్జీ దాఖలు చేసుకుంటే,
'పిచ్చయ్యా, నువ్వులేక ఆ సీటూ పని
చేయదు'— అని అనగలడు. ఒకవేళ మొం
డిగా సెలవుమీద వెళ్తాడేమోనని—'సెలవూ,
గిలవూ అడిగావంటే—సెలవు శాంక్షనూ
చెయ్యను, జీతమూ ఇవ్వను. అటే వెళ్ళే
ట్లయితే సెలవుపెట్టి వెళ్ళు' అన్న
వార్నింగులాంటి మాటలు మధుసూదనం



తెలిసి వేసేడుగూడాను.

ఇటువంటి సంగతులు జరిగినప్పుడల్లా— ఏరోగెంట్ సుందరం అసలు ఫూర్కోడు. ఊర్కొంటే—ఏరోగెంట్ అయ్యేవాడేకాడు. అసలు ఈ సుందరం అనబడే శాల్తీకి, అయ్యగార్ల జాతికీ—జన్మ జన్మాంతరాల గా—పెట్రోలూ, అగ్గిపుల్లకున్నంత స్నేహం. అందుకే మధుసూదనానికన్నా రెండేళ్ళ సర్వీసున్నా ప్రమోషన్ ప్రాప్తి లేదింత వరకూ! దానికి అతనసలేమంటాడు— 'పల్లెత్తు మాటగూడా ఎదురాడని మధుసూదనానికి ఏం పొరగ బెట్టారుగనక, మనకి ఒగలెయ్య డానికి! అసలు సంగతి అదికాదయ్యా బాబూ, తెల్లవాడు నల్లవాళ్లని అణచి పెట్టాలని—ఉద్యోగులు, ప్రమోషన్లతో బాటు — కొన్నిడెన్నియులూ, వర్గాలు సృష్టించి—పోతూపోతూ ఇక్కడ వొదిలి వెళ్లారు. మూడొందల సంవత్సరాలుగా బానిసత్వం జీర్ణించిన రక్తంగదా, అంతా ఆఫీసర్లయితే— ఇండ్లకి ఆగటి గెలలూ, కోళ్లూ, పళ్లబుట్టలూ, ఎవరు తెస్తా రని—ఈ దేశంలో పుట్టి, అదేపని వాసలు పీల్చిన కొన్ని పెద్ద తలలు సృష్టించిన తతంగం. తమ్ముడూ—ఈ ఆయుధం ఈ ఇరవై ఏళ్లలోనూ— ఫారిన్‌మేడ్ పొనరాయి మీద మరింత పదును పెట్టారోయ్! ఖర్మరా బాబూ ఖర్మ...

## హత్య

—అట్లా సాగుతుంది అతని ధోరణి!

మధుసూదనం అమాయకత్వం మీద సుందరానికి జాలి, ఆపైన అతని నెమ్మదయిన స్వభావంమీద అభిమానమును! ఆ అభిమానంకొద్దీ—మన్వింత మెత్తగా వుండ వద్దని మందలిస్తూ వుంటాడు— అప్పు డప్పుడూ. ఆ ఱ్రోజుల క్రితం—మేము పంపిన ఫలానా రిఫరెన్సుమీద వెంటనే జవాబు రాకుంటే, ఛార్జిషీటు చేస్తానన్నంత ఘాటుగా, హెడ్‌క్వార్టర్సు ఆఫీసునుంచి డి. ఓ. ఒకటి దిగబడింది. దాంతో— అయ్యగారు ఫైరయ్యాడు. అదీ మధు సూదనం సీటుకి సంబంధించిందే చాలా పాళ్ళు దానిమీద—డిస్కస్ చెయ్యాలని— ఎప్పుడడిగినా అయ్యగారు టైము లేదంటూ ఇన్నాళ్లూ గడిపారు. అదే గుర్తుచేస్తే— మరింత ఫైరయ్యి—మర్నాటికల్లా రిప్లయి పుటప్ చెయ్యమన్నాడు.

మర్నాడు ఆయన ఆఫీసుకి రాలేదు. ఒంట్లో బాగాలేదు, రాడని తెల్సింది. మధుసూదనం తన రెస్పాన్సిబిలిటీని మర్చి పోలేదు. ఎందుకోయ్ ఇంటికి—అని సుంద రం అంటున్నా—ఫైలును అయ్యగారింటికి మోసుకెళ్లాడు.

అరగంట తర్వాత—కడివెడంత బొర్ర ముందూ ఆవెనుక అయ్యగారూవచ్చి 'ఆ! ఏమిటి?' అన్నారు కణతలు నొక్కుకుంటూ.

'ఈ డివో...నిన్నటిది...' ఫైలుతీసేడు మధుసూదనం.

భగ్గుమన్నాడు అయ్యగారు. 'బొత్తిగా మేనర్సూ, ఎటికేసీ లేదయ్యా. ఒకవైపు తలనొప్పితో నేను చస్తున్నానా, ఫైలూ, డిస్కషనూ...'

'ఇది ఇవ్వాళ వెళ్లాలని...'

'తెలుసునయ్యా! ఒక్కరోజు ఆగితే ఏం కొంపలంటుకు పోయినయి? నీ ప్రాణం అయితే నువ్విట్లా రొమ్మున వడ్తావా? రేపు చూస్తాగానీ,ఆట్టే వాగించక వెళ్లు!'

గసిరాడు బిక్కమొహంతో తిరిగివచ్చేడు మధుసూదనం.

అతన్నిచూసి—ఏదో జరిగిందని— జరి గిందేమిటోగూడా సుందరం ఊహించాడు. 'అసలు తప్పు నీది మధుసూదనం! ఎవరినని ఏమిలాభం? నువ్వు పుట్టెడు రోగంతో బాధ పడుతూంటే వారంరోజులు సెలవివ్వడే, పొద్దస్తమానూ చాకిరీ చేయించుకుంటాడే, తనకింత వేలునొప్పి వస్తే — కలంగూడా ముట్టుకోడా? ఈ అరగంటా నిన్ను తిట్టే వుంటాడు. అరగంట తిట్టేబదులు— అర నిముషం వొక సంతకంపేస్తే ఏంపోయింది? అవున్లే—నీ తప్పులేదు బ్రదర్. ఒకవేళ నువ్వు తీసుకుపోకుండా ఉంటే—ఎందుకు తేలేదని అదొక దొబ్బా! ఆఫీసులన్నీ వీళ్లందరి సొంత జాగీర్లయినాయి... జాగీర్లు! ఇదిగో — ఇటువంటి బుద్ధావతారపు మధుసూదనాలు ఉండబట్టే వీళ్ళ కింత అలుసు!'

పాపం, మధుసూదనం కిమ్మనలేదు.

అంతకు ముందోకసారి, మధుసూదనం కొడుకు స్కూల్లో ఆడుకుంటూ కిందపడితే చెయ్యి మణికట్టు దగ్గర ఫ్రాక్చర్ అయింది. డబ్బూ, సెలవూ రెండు కావల్సి వచ్చింది. డబ్బు సుందరందగ్గర ఎప్పుడూ వుంటుంది. దానికతను కారణాలు బాహాటం గానే చెప్తాడు. 'అవునయ్యా, నేను డబ్బు తింటాను. ఆరొందలూ, ఎనిమిదొందలూ, పదొందలూ జీతాలు మేసే గాడిదకొడుకులూ మహాతుబొ అడ్డమైన వెధవపన్లూచేసి— వేలూ, లక్షలూ మింగేస్తుంటే—అప్పరాల్ మాటయాళయి రూపాయల గుమాస్తా ముండాకొడుకుని నేను తినటం విచిత్రం కాదండి! నాకేమైనా జరిగితే తీతం



వస్తుందా? ఒక్క బియ్యానికే సరిపోదుసార్ జీతం. జీతాలు తగినంత పెంచండి బాబో అని గోలపెడితే ఆర్రూపాయలు పెంచి, మూడు రూపాయలు ప్రావిడెంటుఫండు అవ బడే వెంకటేశ్వరస్వామి హుండీకి జమకట్టి మూర్రూపాయలే ఇస్తారూ? అవతల ధర లేమో తొమ్మిదిరూపాయలు పెరుగుతాయీ? కాగా—అడ్డమైన ఆందోళనలూ, సమ్మెలూ చేసి, నానా అల్లరిపాలయ్యేదీ, రెడ్ ఎంట్రీలు వేయించుకునేదీ, ఆరూళ్లు, మూళళ్లు ముష్టెత్తుకునేది మేమూ, వందలకొద్దీ పెరిగేది అయ్యగార్లకూనా? ఇదెక్కడి న్యాయంసార్? బోడి మూర్రూపాయలు పెంచి, అసలే స్టాఫ్‌లేక నలుగురి పని ఒక్కడు చేస్తూ, పెళ్లాం పిల్లా, ఇల్లూ వాకిలీ — మర్చిపోయి—నడుములు విరిగేలా గాడిదచాకిరీ — రాత్రింబవళ్లూ చేస్తూవుంటే రిట్రెంచిమెంటూ! అయ్యా: ఇలాచేసి వీళ్లు సాధించిన ఘనకార్యం ఏమంటే ఇంకోపాతికమంది ఆఫీసర్లకూ, అడిషనల్సుకూ ఉద్యోగాలు సృష్టించటం. ఇదయ్యా టూకీకథ...ఇహ నేనెందుకు ఇవన్నీ సహిస్తూ నీతిగా బతకాలి? నా భార్యా పిల్లలు కడుపునిండా తిండి అయినా ఎందుకు తినగూడదు? నేను డబ్బు తింటాను. తింటానని మీ దిక్కున్న చోట చెప్పుకోండి ఛాయ్...

—ఇదీ అతని ధోరణి.

మధుసూదనం సెలవు చీటిమీద—ప్రెయర్ పర్మిషను తీసుకోలేదు గనుక, ఒకవార్నింగ్ మెమో ఇవ్వమని వ్రాసేడు అయ్యగారు...

'ఒకోసారి వీడు మరీ రాక్షసంగా ప్రవర్తిస్తాడోయ్!' 'హెడ్‌క్లర్కు గొణిగేడు. అతను—అయ్యగారికి ఎంతగొప్ప కాకా ఇష్టు అయినా, ఇంకా అయ్యగార్ల కోవలో చేరలేదు గనుక — ఆమాత్రమైనా దయ ఉందని సుందరం అంటాడు.

'దమ్ములుంటే— మీరు మెమో ఇవ్వా వియ్యవద్దు' సుందరం — ఆ గొణుగుడు విని సవాలు చేసేడు.

'అందరూ నీలాంటి మొద్దుగొళ్లు కారు కదా.'

# రచయితలకు మనవి

### కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంప రాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాత ప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

### నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 ఆరఠావు పేజీల పయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

### కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్‌లు తిప్పి పంపకోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులని, కార్టూన్లని వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమంలో ఎటువంటి బాధ్యతని స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

*సంపాదకుడు*

*ఆంధ్ర సచిత్ర వారపత్రిక*

# హత్య

నవ్వేడు సుందరం. 'నాకు తెల్సుసార్! బానిసలం మనం...అంకా బానిసబుద్ధులే! మనగుమాస్తాలకున్న రూల్సు రెగ్యులేషన్సు —అన్నీ మనల్ని బానిసలుగా చెయ్యడానికే. తమ్మెళ్లా — తగలెయ్యండి తెల్లవాళ్లు బానిసలకోసం వొదిలిన ఈ వాల్యూముల్ని, కొత్త అట్టల్లో—అచ్చుల్లో—జీర్ణించుకున్న— బూజుపట్టిన ఈ మస్తిష్కాల్ని— వందగాలన్ల పెట్రోలుపోసి తగలెయ్యండి సార్'

'సర్లే...' హెడ్‌క్లార్కు సణుగుడుతో కాయితాల్లో తలదూర్చేడు.

మధుసూదనం ఆఫీసుకి వచ్చినరోజు మెమో చేతికిచ్చారు.

'గాడిద నయం! కుక్కనయం' ప్రాణం పోయే పరిస్థితిలో గూడా న్యాలోజులు శెలవు వాడుకుంటే, మెమో అందుకునే దౌర్భాగ్యపు బతుకు. మధుసూదనం...దండగయ్యా! మనం, మనబతుకులు...ఒక ఆదివారమనీలేదు, ఒకశెలవూ వాడుకోడానికి గూడా లేదు పోతేపోనీ! చస్తున్నామన్నా ఒకపూట వదలడుగదా?' సుందరం మాటలు విన్పించుకునే అలవాటు మధుసూదనానికి ఎప్పుడూ లేదు...

చిత్రమేమంటే ఇట్లా—పేట్రరిస్టుగా వాగే సుందరంకన్నా — మధుసూదనమే అయ్యగారికి ప్రాబ్లమ్ ఒకోసారి! ఎందుకంటే సుందరం ఎట్లాగా ఎవరిమాటా వినడు. తను చెయ్యగలిగినంతవని తప్ప, తనసీటు పనితప్ప—మరేదీచెయ్యడు. మరేపని చెప్పినా—కుదిరినపుడితే చేస్తాడు, లేదా చేసినంత చేస్తాడు, మిగతాది వదిలేసి— చెయ్యనంటాడు. మరీ వొత్తిడి తెస్తే—'నేను చెయ్యను. చేసినంత చేశాను. అంతే చేస్తాను. మవ్వు చెయ్యగలిగింది—మవ్వు చేసుకో' అని సాఫ్‌సీదాగా చెప్తాడు. మధుసూదనం అట్లా అనలేడు. తీసుకుంటాడు. ఎంతచేసినా — ప్రవాహంలాగా వస్తే పనిని—సరిగా చెయ్యవొట్లే ఉరుకున్నాడు.

అదిగాక—అతను అస్తమానమూ దగ్గుతాడనీ, పని ఎగ్గొట్టడానికి అదొక ఎత్తుగడ అనీ అయ్యగారి అభిప్రాయం...

—ఇవ్వాళ సుందరం, మధుసూదనం కోసం ఎదుర్చూస్తున్నాడు ఎందుకంటే — అంత క్రితమే తెలిసిన వార్త ఏమంటే— కాన్ఫిడెన్షియల్సు డిస్పాచ్ అయ్యాయని అందులో మళ్లీ తనకూ, మధుసూదనానికి బిలో ఏవరేజ్ రిమార్కువుందని! అది విని సుందరం విరగబడి నవ్వేడు. రహస్యంగా చెప్పిన హెడ్‌క్లర్కు భుజంమీద చెయ్యేసి, 'భలేవార్త గురూజీ! బిలో ఏవరేజ్ గనుకనే గుమాస్తాలం. ఎబోవ్ ఏవరేజ్ అయితే —ఈ బాస్‌లకి బాస్ అవుండుము గదా?' అన్నాడు.

హెడ్‌క్లార్కు బుర్ర గోక్కున్నాడు.

మధుసూదనం కోసం— ఇది చెప్పాలని ఎదుర్చూస్తున్న సుందరానికి, అతన్ని ఆస్పత్రిలో చేర్చారని తెలిసి చాలా బాధపడ్డాడు. నిన్ననే అనుకున్నాడు మధుసూదనం మరీ క్షీణించాడని. నిన్న దగ్గు మరీ ఎక్కువైంది. దానికో కారణంకూడా వుంది.

సుందరం ఒక కంట్రాక్టరు బిల్లు పాస్ చెయ్యకుండా పదకొండుపేజీల ఆడిట్ వ్రాసి పట్టుకు వెళ్లాడు. అవతల కాంట్రాక్టరుగారు డబ్బుకి తొందర పడుతున్నాడు. అయ్యగారికి అంతకన్న తొందర. కాని తనవొంతు తాంబూలంలో కాస్త తక్కువైనా—అది దేవుడి బిల్లేకానీ — సుందరం కొట్టిపెడ్తాడు. ఎంత నచ్చచెప్పినా వినని అసహనం అయ్యగారిలో స్పష్టంగా కన్పిస్తోంది.

సుందరానికి నవ్వులాటగా వుంది.

అర్జంటు కాయితంతో మధుసూదనం లోపలకి వస్తూ — దగ్గు ఆపుకోలేక పోయేడు. ఆ కోపం ఇటుమళ్లి — గంయ్‌మన్నాడు.

'ఏమిటయ్యా ఆ దగ్గు! పెద్దమనుషు లున్నారని తెలీదు. పాడూ లేదు. మందులువాడితే ఏం దొబ్బిడాయి?'

మధుసూదనం, తెల్లబోయాడు. సుందరంకూడా ఒకక్షణం కళ్లు పెద్దవిచేసి చూసేడు.

'ఏంటి అసహ్యం? నా కర్థం కాదు; ముందులా వాడక, బట్టలూ సరిగా కొనుక్కోక, ఏమిటీవాలకం? ఆ గెడ్డం గీసుకుని ఎన్నాళ్ళయింది? ఇది ఆఫీసా? లేక బందిల దొడ్డా? ఇట్లాగేనటయ్యా ఆఫీసుకి వచ్చేది?'

మధుసూదనం తనని తిట్టినా బాధపడదుగానీ, తనరోగాన్ని వయసు నెపంగా చేసుకొని అసమర్థతని ఎత్తి చూపిస్తే బాధపడ్తాడు. అతని కళ్ళలో నీరు తిరగటం సుందరం గమనిస్తూనే వున్నాడు. ఎంతో బాధపడితే తప్ప కళ్ళనీరు రాదు — మధుసూదనానికి.

మరోక నిముషం అతనక్కడే వుండి, అయ్యగారు మరో నాలుగు జాడింపులు వేసి ఉంటే, సుందరం లేచిపోయి యుండేవాడు. అప్పటికీ బయటికి వచ్చేక మధుసూదనాన్ని దులపరించేడు.

'అయినా, మధుసూదనం? నువ్వింత పౌరుషం లేనివాడివయ్యావేం? వాడేం నిన్ను పోషిస్తున్నాడా? నీ పర్సనల్ థింగ్స్ వాడికెందుకు?'

'పోనీ సుందరం...' ఇంక బాధపడటం ఇష్టం లేక అన్నాడతను.

సుందరం బుస్సుమన్నాడు. 'ఏమండయ్యా సోదర గుమస్తాలూ! అయ్యగారు తనలాగా మనం ఆ కౌంటర్లో జీతం డ్రా చేసి, ఈ కౌంటర్లో జమ చెయ్యనందుకు, మనం కేవలం తిండికీ, పెళ్ళాం పిల్లల బాగోగులకి ఖర్చు పెట్టున్నందుకు ఈయన్ని తిట్టేడు. ఈయన పౌరుషం చచ్చి, పోనీ అంటున్నాడు. ఏం, నువ్వు మాత్రం కంట్రాక్టర్ల దగ్గర, పనులు కావల్సిన వాళ్ళదగ్గరా మెక్కి, నీరోగం ఎందుకు నయం చేయించుకోవు? టెర్లిన్లూ, టెరికాటన్లూ నాలాగా ఎందుకు కొనుక్కోవు?'

అతనంటున్న కొద్దీ — మధుసూదనం దగ్గు మరింత ఎక్కువైంది.

* * *

నిన్న తనతన్ని రెచ్చగొట్టిన సంగతి గుర్తొచ్చి, సుందరం తనని తనే తిట్టుకున్నాడు. ఎందుకంటే—తనమీద—తనతోటి ఉద్యోగానికి. అల్లరికి

# వసంత సందేశం

తరులూల దరహాసముతో విరబూసెను మధుమాసము!
గుండెగుండె నినదించెను కుసుమాస్త్రుని సందేశము!

పుష్పవతియౌ ప్రతిలతావధువును తరు ప్రియు కౌగిలించెను!
మమత నిండిన ప్రతిమనస్సును మల్లెపూవులమాల యయ్యెను!

గండుకోయిలగాన మాధురి గుండె గుండెను పలుకరించెను!
ప్రతి సుమమ్మును దరిసి భ్రమరము ప్రణయగీతము లాలపించెను!

కన్నెపూల యెడంద తుమ్మెద సన్నసన్నగ మరులు రేచెను!
అధరమున నవవధువు దాచిన మధుర సుధలను ప్రియుడు దోచెను!

నవ వసంత సందేశము నవలతాంత దరహాసము
విన్నారా? జనులారా! కన్నారా కనులారా?

కూరిమి జాలు, నెడదకొమ్మ క్రొత్త చిగురు తొడగాలని
చేదెక్కిన మనసులోన చెలిమితీపి పండాలని

ఎడదగుడిని బూజు దులిపి యెల్లరొకటి కావాలని,
అంతరములు పోవాలని అంతరంగ మరయాలని

మనిషితనం నిండాలని మంచితనం పండాలని
నాడే పండుగరోజని నాడే భువి స్వర్గంబని

జగజాతికి ఈ యుగాది నవయుగాది కావాలని
నవవసంత మంటున్నది! నవలతాంతమంటున్నది!

శిశిరహతవనప్రకృతిలోనే వసంతాలు పూస్తాయని
వసంతాలు వస్తూనే వలపుపూలు తెస్తాయని

[illegible]
విరులలాగే నరులు కూడా [illegible]

అందమైన నవ వసంతమందించే సందేశం!
స్పందించే హృదయాలను బంధించే మధుహాసం!

—వక్కలంక లక్ష్మీపతిరావు





# హత్య

కుచ్ఛితమూ ఉంచుకొని వ్యక్తి మధుసూదనం ఒక్కడే. ఎంత ప్రయత్నించినా— ఇవ్వాళ అతను హాస్పిటల్‌కి వెళ్ళటానికి కారణం తను నిన్న రెచ్చగొట్టటం కానేకాదని— సరిపెట్టుకోలేక పోయేడు.

మధ్యాహ్నం పూట ఒకసెలవు చీటి ఇచ్చేసి, అతన్ని ఏ ఆస్పత్రిలో చేర్చారో కనుక్కొని వెళ్ళి చూసొద్దామని రెండింటికి బయటపడ్డాడు. మధుసూదనం ఇంటికి వెళ్ళేసరికి— అతను ఆస్పత్రినుంచి తిరిగి వచ్చేడు—

భార్యా పిల్లలూ, తల్లిదండ్రులూ, చెల్లెలూ గొల్లున ఏడుస్తుండగా,...

—ఇంక మళ్ళీ ఎప్పుడూ పెదవి విప్పి మాట్లాడకుండా!

సుందరం ఊపిరి స్తంభించినట్లయింది.

* * *

మర్నాడు—సుందరం సరిగ్గా అయ్యగారి రూము ముందునుంచుని, హెడ్‌క్లార్కుని నిలేసి, పెదగా—ఆఫీసు అంతా వినపడేలా అంటున్నాడు.

'మనకన్నా — గాంధీజీని, కెనెడీని, లూథర్‌కింగ్‌ని హత్యచేసిన హంతకులూ, హిరోషిమామీద బాంబులువేసిన నరరూప రాక్షసులూ నయం సార్! నిన్న మధుసూదనం చచ్చిపోయాడని అనుకున్నారా? కాదుసార్, కానేకాదు! మీరూ, నేనూ, ఈ ఆఫీసు, ఈ పనీ, ఈ మనుషులూ— అందరూ కలసి హత్య ... కాదు...చిత్రవధ చేశాము. ఈ నేరం, ఈ దారుణం కంటికి కన్పించదు. దీనికి శిక్ష ఏ న్యాయస్థానంలో, ఏ కోర్టుల్లోనూ లేదు...దొరకదు సార్, వెయ్యిజన్మలెత్తినా దొరకదు! కోర్టుకీ, 'లా'కూ కళ్ళేకాదు — ఆలోచన గూడా లేదుసార్. లేదు మరిహ.!'

అంకితం:—

మానవత్వం నశించిపోతూ, ప్రభుత్వ పరిపాలనా యంత్రాంగంలో—మృగంకన్న హీనంగా— రాక్షసాధికారాల ఇనుప పాదాల క్రింద జీవితం కొట్టే దెబ్బల్ని సహిస్తూ, గోడువినే నాథుడులేక నలిగి నజ్జయి పోతున్న, దిక్కూ మొక్కూలేని తెలుగు గుమాస్తా సోదరులకు—!



# నేడు వనితాలోకం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య ఏమిటి?



రచన: బులుసు వేంకటసత్యకేదారేశ్వరి — మూడవ బహుమతి

వైవాహిక సమస్యంటే నా ఉద్దేశ్యం ఆడపిల్లలు పెళ్ళి సమస్య అనికాదు. అదే అర్థాన్ని తీసుకుంటే ఆ సమస్యని నేను కేవలం 'వివాహ సమస్య' అని మాత్రమే వ్యవహరించి ఉండేదాన్ని. స్త్రీకి వివాహం జీవితంలో అత్యంత ప్రాముఖ్యత గల సంఘటన. నిజంగా స్త్రీ జీవితం వివాహంతోనే ప్రారంభమై పరిణతి చెందుతుంది. పరిమిత దృక్పథం నుండి గాక విశాల దృష్టితో పరిశీలిస్తే వారి జీవనంలో ప్రతి సమస్య, ప్రతి ఆశయం ఆమె వైవాహిక జీవితంతో అంతర్భూతమై ఉంటుందేమో అనిపిస్తుంది.

స్వతంత్ర భావాలు కలిగి, అనేకాశయాలతో, కలలతో సిద్ధాంతాలతో ఒక నిర్దుష్ట మనస్తత్వాన్ని ఒక ప్రత్యేక వ్యక్తిత్వాన్ని పొందిన స్త్రీ పూర్తిగా పరాయివాడైన ఒక పురుషునితో వివాహమయ్యాక, అతని మనస్తత్వాన్ని వ్యక్తిత్వాన్ని, ఆశయాలను, భావాలను పూర్తిగా అర్థం చేసుకొని సహజంగా ఎదురయ్యే భావ, వ్యక్తిత్వ తారతమ్యాలను, సంఘర్షణలను ఎదుర్కొని సంసార స్వర్గాన్ని సృజింప చేసుకొనవలసిన ఆవశ్యకతే ఆ వైవాహిక సమస్య. ఈ సమస్యని అర్థం చేసుకొని పరిష్కరించగలిగిన స్త్రీ జీవితంలో వ్యక్తిగా, మాతగా, భార్యగా విజయాన్ని సాధించి జీవన మాధురిననుభవించగలుగుతుంది. లేనినాడు అన్నివిధాలా పరాజితమై ఆశాభంగాన్ని పొందుతుంది.

అయితే ఈ సమస్య క్రొత్త సమస్యేం కాదే కదా అనే ప్రశ్న ఉదయించడం సమంజసం. అవును. అనాది నుండి వివాహాలు, వైవాహిక సమస్యలు ఉంటూనే ఉన్నాయి. ఈ దృష్టితో చూచినట్లైతే నేడు స్త్రీలు ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య అని ఈ సమస్యని ఎట్లా వ్యవహరించగలం? ఇదీ ఒక అతి [పురాతన]మైన సమస్యే కదా? ఇది సత్యమే అయినప్పటికి మనం సునిశితంగా విమర్శించి నట్లయితే ఈ సమస్య పురాతనమైనదే అయినా, అనేక ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక పరిణామాల కారణంగా ఈ సమస్య ఒక నూతన ప్రాముఖ్యాన్ని, స్వరూపాన్ని నేడు దాల్చిందనవచ్చు. నాలుగైదు దశాబ్దాల క్రిందటి స్త్రీ వ్యక్తిత్వం వేరు. నేటి పరిస్థితి వేరు. ఆనాటి స్త్రీలకు నేడున్నంత విద్య, సాంఘిక సమానత్వం, స్వేచ్ఛ లేవు అంతేకాదు వారి భావాలు కూడా వేరు. అప్పుడు స్త్రీ కేవలం భర్తే భగవంతునిగా తలపోసి ఆవిధంగా విశ్వసించి జీవించేది. ఈ విశ్వాసంలో ఏ విధమైన సంశయాలు, అసంతృప్తి ఉండేవికావు. బహుశా అటువంటి నిశ్చల విశ్వాసంలో ఒక విధమైన ఆశయ సిద్ధిని, సుఖాన్ని పొంది ఉండేవారేమో. వారి మనస్సులో ప్రశ్నలు లేవు. జిజ్ఞాస లేదు. నేటి సమాజంలో స్త్రీ పరిస్థితి పూర్తిగా మారిపోయింది స్త్రీవిద్య పెంపొందడం వలన, పట్టణాలలో విద్యావంతులైన స్త్రీల సంపర్కం వలన నేటి స్త్రీలలో వచ్చిన ముఖ్యమైన మార్పు వారి ఆలోచనాశక్తి వికసించి విజృంభించింది ఆలోచనాశక్తి వికసించిన మనస్సుకు సున్నితత్వం ఎక్కువవుతుంది భర్త తనను ఎంత తీవ్రంగా నిందించినా ఆనాటి స్త్రీ పెద్ద విషయంగా తీసుకునేదికాదు. ఈనాటి స్త్రీకి అట్టి సంఘటన ఆమె భావనాకాశాన్ని కల్లోలితం చేసే ఉద్రేకతను కలిగించి వేస్తుంది. అంతేకాదు భార్యాభర్తలు ఒకరి భావాలు ఒకరినొకరు ఎంతగా ప్రేమించుకున్నా వారి వ్యక్తిత్వాల నడుమ నుండే 'విభిన్నత' వారి భావావేశాల నడుమ, వారి ఆశయ మనస్తత్వాల నడుమ తారతమ్య సంఘర్షణలు తప్పనిసరిగా శాశ్వతంగానే ఉంటున్నాయి దీనికి ముఖ్యమైన కారణమేమంటే, ఆనాడు వివాహాలు స్త్రీ, పురుషులకు విభిన్నమైన నిశ్చితమైన వ్యక్తిత్వాలు పెంపొందక ముందే జరిగేవి దాని వలన వారి నడుమ ఐక్యత ఏర్పడేది కాని నేడు వివాహాలు పూర్తిగా పెంపొంది నిశ్చితత్వాన్ని కలిగిన రెండు పూర్ణ వ్యక్తుల నడుమ జరగడం వలన వైవాహిక జీవనంలో ఈ తారతమ్యత చాలా కాలం వరకు ఉంటూనే ఉండడం సహజం.

ఈ పరిణామాల వలన వైవాహిక సమస్య నేడు పూర్వం కన్న ఎక్కువ ప్రాధాన్యత కలదని వేరే చెప్పనక్కరలేదు. ఇందువలననే మనదేశం కన్నా, స్త్రీలకు స్వేచ్ఛ మరింతగా వృద్ధినందిన పాశ్చాత్య దేశాలలో నేడీ సమస్య ఇంకా ఎక్కువ ప్రాధాన్యత కలదిగా పరిణమించడంలో విపరీతమేమీ లేదు. పైన వివరించిన తారతమ్యత మూలంగానే కదా ఆయా దేశాలలో విడాకులు ఇచ్చుకొనడం అతి సామాన్య విషయమయినది!

ఈ సంఘర్షణని సాధ్యమైనంతవరకు సంకుచిత పరచి, భార్యాభర్తల నడుమ వ్యక్తిత్వ, భావాల నడుమ, సాన్నిహిత్యతను, అవగాహనను పెంపొందించి కుటుంబములో మనశ్శాంతిని ప్రవర్తింప చెయ్యడానికి ఆ దేశాలలోని సామాజిక మనస్తత్వ శాస్త్రజ్ఞులు విపరీతమైన కృషిని జరుపుతున్నారు. అనేక వేల కుటుంబ పరిస్థితులని, విచారించి, సంభాషణలు జరిపి సమగ్రమైన సమాచారాన్ని సేకరిస్తున్నారు మనం స్థూలంగా పరిశోధనా ఫలితాలను సమీక్షిస్తే తెలిసేదేమంటే ఈ సమస్యను ప్రభుత్వంకాని, నిపుణులు కాని పరిష్కరించలేరని తెలుస్తుంది ఈ సమస్య ఆంతరంగికమైనది. దీనికి పరిష్కారం మనలో నుండే రావాలి. మన విద్యను మన వివేకాన్ని మన శక్తియుక్తులను ఉపయోగించి ఒకరినొకరు అర్థం చేసుకొని ఈ సంఘర్షణను తగ్గించుకుని సామాన్యతను పెంపొందించుకోవాలి ఒక సమగ్రమైన పరిష్కార మార్గాన్ని సూచించడానికి నే నశక్తురాలినే అయినా కొన్ని కొన్ని సూచనలను చేయ[illegible] ప్రయత్నిస్తాను.

నా ఉద్దేశమేమంటే ఈ సంఘర్షణను తొలగించడానికి పరిష్కారం సంఘంలో స్త్రీ విద్యను స్థానాన్ని, స్వేచ్ఛను, వ్యక్తిత్వాన్ని తగ్గించడంకాదు. మన స్త్రీకి నేడు కావలసినది నేటి అభివృద్ధే. ఒక ముక్కలో చెప్పాలంటే ఆమె వ్యక్తిత్వం మరింత సమగ్రమైనదిగా పెంపొందాలి

మనం చిన్ననాటి నుండీ కనే కలలకు, పెంపొందించుకునే ఆశయాలకు ఒక నిర్దుష్టతను, వాటిని

వనితాలోకం వ్యాసరచనపోటీలో మూడవ బహుమతి పొందిన వ్యాసం

## రచయితలకి మనవి

ప్రచురణకి స్వీకరింపబడని తమ రచనలు తిప్పిపంపగోరే వారు వ్రాతప్రతులతోబాటు తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామా కల కవర్లు పంపాలి. స్టాంపులు మాత్రం పంపిన రచనలు తిప్పిపంపటం సాధ్యం కాదు కనుక రచయితలు పై నిబంధనని గమనించ ప్రార్థన. (విడిగా స్టాంపులు అతికించిన, స్వంత చిరునామా కవరు పంపించినప్పటికీ రచనలు తిప్పిపంపటానికి వీలు కాదు.)

సం॥





## వనితాలోకం...

సఫలం చేసుకొనేందుకు ఒక దృఢమైన ఆత్మవిశ్వాసాన్ని, నైతికబలాన్ని, సహనశీలాన్ని, మనం ఎన్నుకునే మార్గంలో కలుగబోయే ఆటంకాలను తొలగించుకొనడంలో ఉద్రేకరాహిత్యాన్ని, సమదృష్టిని, తత్ఫలితాలను స్వీకరించడంలో ఒక విశాల హృదయాన్ని పెంపొందించుకొనడమే సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణమని నా అభిప్రాయం.

ఆశయాలని, ఆదర్శాలని వెకిలిగా భావించడమే కాని కళాశాలల్లో చదివే ఆడపిల్లల నడగండి వీరారు ఏ ఆశయంతో చదువుతున్నారు అని. వారికే తెలియదు. వారి విద్య జీవిత సమస్యల నెదుర్కొనడానికి ప్రయోజనాన్ని కలిగించకపోగా, వివేకాన్ని నాశనం చేసే అహాన్ని మాత్రం పెంపొందింపుతోంది. వారి ఆశయాల కొక నిర్దిష్టత లేదు. చాలమంది అసలు ఈ విషయాలను గురించి ఆలోచనే చేయరు. వారు కనే కలలకు వారు చదివే చదువులకు నిజజీవిత సమస్యలతో సంబంధం లేదు. ఇంత చదువు చదివి, ఇన్ని విషయాలను తెలుసుకుని వివాహమైన తరువాత ఒక్క చిన్నసమస్య ఉద్భవించేసరికే వారి మనసులు దారం తెగిన గాలిపటంలా కల్లోలితమై పోతాయి. అందుకే మన ఆశయాల కొక నిర్దిష్టత అనేది వుండాలి. మనం ఎటువంటి జీవితాలను వాంఛిస్తున్నామో కనీసం మనకైనా పూర్తిగా నిస్సందేహంగా తెలియాలి కదా!

సరే కేవలం నిర్దిష్టత ఉన్నంత మాత్రాన ఆశయాలు సఫలంకావు ఆత్మవిశ్వాసం నైతికబలం, సహనం ఉన్నప్పుడే కదా ఆ ఆశయాలను సఫలం చేసుకొనే అవకాశం వుంది నైతికబలం అంటే తప్పు చేయకుండా వుండడం కాదు. మనం చేస్తున్నది సరియైన పని అని గ్రహించేక ఆ పని పూర్తి చేసేందుకు ఏ పరిస్థితులలోనైనా, సంసిద్ధతను ప్రదర్శించడమే నిజమైన నైతికబలం. సహనం లేని ఆత్మవిశ్వాసం, మొండితనానికి దారితీస్తుంది కుటుంబంలో ఎవరికి వారే తాము చేస్తున్నదే సరియైనదనుకుంటుంటే కనీసం తల్లిగా స్త్రీ అత్యున్నతమైన సహనాన్ని వహిస్తేనే సంసార నౌక గమ్యాన్ని చేరుతుంది

ఉద్రేక పడకుండ సమస్యలను పరిష్కరించ గలగడం ఒక గొప్ప అదృష్టం. సాధారణంగా మనకి ఉద్రేకం రాకుండా సమదృష్టి కలగడానికి ఒక రెండు దశాబ్దాల సంసార యాత్రానుభవం కావాలి లేదా ముందే అన్నిటిని ఆలోచించి ఒక నిర్దిష్ట మనస్తత్వాన్ని ఏర్పరచుకొనగలగాలి. రెండవదే మేలైన పద్ధతి కదూ!..

ఇటువంటి వ్యక్తిత్వాన్ని పొందిన స్త్రీకి వైవాహిక సమస్యలు కేవలం తాత్కాలిక సంఘటనలుగా మారిపోతాయి. గాంభీర్యత ఏర్పడుతుంది. ఆశయ సిద్ధి కలిగి జీవితం సఫలమవుతుంది. సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణమే వైవాహిక సమస్యకు సరియైన పరిష్కార మార్గం ●

# సినిమా

మద్రాసు వాహినిస్టుడియోలో నాగేశ్వరరావు నటిస్తున్నాడని తెలిసి చకచకా నా పనులన్నీ ముగించుకుని మార్చి 1 వ తారీఖున ఉదయం ఏడుగంటలకే హాజరయ్యాను; అప్పటికే మేకప్‌తో రెడీగా వున్న అక్కినేని, కె ఆర్. విజయలకు సంబంధించిన కొన్ని ముఖ్య సన్నివేశాలను యువదర్శకుడు జి వి. ఆర్. శేషగిరిరావు రాకెట్ వేగంతో చిత్రీకరించడాన్ని గుర్తించాను; నిర్మాత రామానాయుడుదగ్గరికెళ్లి 'యేమిటండీ యీస్పీడు' అని ప్రశ్నించాను; 'అవును. నాగేశ్వరరావు యీరోజు మాత్రమే వుంటారు; రేపు ఆయన చిత్రకల్పన షూటింగులో పాల్గొనడానికై రాజమండ్రి వెళ్లాలి' అన్నాడు. మరి 1 నుండి 10 వరకు షెడ్యూలు వుందని విన్నాను, నిజమేనా?' 'వుంది; సత్యనారాయణ, విజయలక్ష్మిలకు సంబంధించిన దృశ్యాలను చిత్రీకరిస్తాము' అని చెప్పి రేపు తప్పకరండి అన్నాడు. సరేనని తలూపి మరో ఫ్లోర్‌లోకి వెళ్లాను.

* * *

ఆ ఫ్లోర్‌లోకి వెళ్లగానే ఎస్. ఎస్. లాల్ కన్పించాడు; ఏమిటండీ విశేషాలు అని అడిగాను. 'నిన్న సాయంకాలంవరకు ఏర్కాడ్‌లో తారకరామాపిక్చర్స్ షూటింగు జరిగింది;' 'ఎవరెవరు పాల్గొన్నారు' అని నేనడగకముందే 'రామారావు, విజయలకు సంబంధించిన యుగళగీతాన్ని, ప్రభాకర రెడ్డి రామారావును వెంటాడే దృశ్యాలను చిత్రీకరించాను' (బి ఎ. సుబ్బారావు దర్శకత్వంలో) అన్నాడు. ఈమధ్య 'సింగపూర్ సీమాన్' తమిళ చిత్రంలో మీ టైటిల్ ఫోటోగ్రఫీ బ్రహ్మాండంగావుంది, అన్నాను; 'ధ్యాంక్యూ, యిప్పుడు రామన్న నిర్మిస్తున్న 'తంగ సారంగం' చిత్రానికి తయారుచేస్తున్న టైటిల్స్ యిదివరకు మీరే భారతీయ చిత్రంలో చూచివుండని రీతిలో వుంటాయి...' అని మరేదో చెప్పబోతున్న సమయంలో నిర్మాత డి. వి. ఎస్. రాజు రావడం, 'ఏమిటి శ్రీనివాస్, పిక్చర్ రిపోర్ట్స్ యెలా వున్నాయి' అని ప్రశ్నించడంతో లాల్‌ను అంతటితో ఆపి, రాజు దగ్గరికి వచ్చేసాను; 'అదృష్టవంతులు', 'మూగనోము' 'కథానాయకుడు' బాగా కలెక్టు చేస్తున్నాయండీ అన్నాను. అంతలో దర్శకుడు విఠలాచార్య రెడీ సర్ షాట్ అనడం, అనడమే తరువాయిగా రాజబాబు నల్లరామ్మూర్తి, రమాప్రభ కెమరాముందు యాక్షన్‌లో నిమగ్నులవడం నిమేష మాత్రంలో జరిగిపోయింది;

రాజబాబు, రమాప్రభ ప్రేయసీ ప్రియులు; రమాప్రభ తండ్రి నల్లరామ్మూర్తి భోజనప్రియుడు; చాదస్తుడు ఒకరోజు రామ్మూర్తి యింట్లోకి వస్తాడు; రాగానే పూరీలు వడ్డించమంటాడు; రమాప్రభకూడ పూరీలను ఒక్కొక్కటి గా ప్లేటులో వేస్తూనే వుంటుంది; రమాప్రభ వేస్తున్న పూరీని, కూరను మంచంక్రింద దాక్కున్న రాజబాబు కాజేస్తూ వచ్చాడు; నల్లరామూర్తి తెల్లముఖం వేసాడు; రమాప్రభతో యేమన్నాడో తెలుసా ?

ఇదేం మాయమేతల్లీ, నీవు వేసిన పూరీలు, వడ్డించిన కూర యీ ప్లేటు యేమయినా కాళీ చేసిందా— ప్లేటు వం చూస్తాడు; అక్కడేముంటుంది— పాప నీళ్లు నమిలాడు; — 'గండికోట రహస్యం'లోనిది ఈ సన్నివేశం: విఠలాచార దర్శకత్వంలో సర్వాంగ సుందరంగా తయ రౌతున్న 'గండికోట రహస్యం' చిత్రాన్ని డి. వి. ఎస్. రాజు నిర్మిస్తున్నారు; విజయ సంపిణీ సంస్థద్వారా విడుదలకానున్న యీ చిత్రంలో వైవిధ్య స్వభావాలు గల్గి రెండు పాత్రలను ఎన్. టి. రామారావు సరికొత్త పంథాలో నటించారని నిర్మాత దర్శకుడు, రష్ చూసినవాళ్లు అభిప్రాయ పడుతున్నారు జయలలిత, దేవిక నాయి కలుగ నటిస్తున్న యీ చిత్రంలో యితర పాత్రలను రాజనాల, ప్రభాకరరెడ్డి మిక్కిలినేని పోషిస్తున్నారు.

* * *

వాహినినుండి గోల్డెన్ స్టుడియోకు వెళ్లాను. అక్కడ రవిచిత్రవారి 'ఒక్క



చిత్రకల్పన వారి సాంఘిక చిత్రంలో విజయనిర్మల, నాగేశ్వరరావు.

రాజబాబు; మీనాకుమారి ఒకర్నొకరు గాఢంగా ప్రేమించుకున్నారు; ప్రభాకర రెడ్డి పేరుమోసిన రౌడి. అతనంటే ఆ గూడెంలో అందరికీ అసహ్యం; అతనికి మీనాకుమారిపై మోజు; ఆమెను తన వైపుకు తిప్పుకుంటాడు; దానికి ఒక ప్లాను వేస్తాడు; చచ్చిపోయిన మీనా తండ్రి తనదగ్గర 500 రూపాయలు అప్పు తీసుకున్నట్టు, అది తీర్చకపోతే మీనానిచ్చి తనకు కట్టబెడ్తానని మాట యిచ్చినట్టే ఒకపథకం వేస్తాడు; అప్లాను పారుతుంది—తనమాట చెల్లుబడి అవుతుంది—మీనా అన్న రామచంద్రరావు 500లు యెక్కడ తెస్తాడు ? దానికి బదులు తన చెల్లెల్ని తనకిస్తాడు అని పిచ్చిపిచ్చిగా వూహించుకున్న ప్రభాకరరెడ్డికి యేం జరిగింది ? తనకన్ను తనే పొడుచుకున్నాడా ? లేక రామచంద్రరావు వెన్నును పొడిచి మీనాను పొందాడా? ఈ సందేహాలను 'విచిత్ర కుటుంబం' నివృత్తిచేస్తుంది అన్నారు పాణి. కె. ఎస్. జి. కథను భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలు, టి. వి. రాజా సంగీతం, చిత్ర విజయానికి కారణం కాగలిగిన స్థాయిలో ఉన్నాయి. మేటి నటీనటులయిన సావిత్రి, రామారావు, నాగభూషణం, శోభన్‌బాబు, కృష్ణ, ప్రభాకరరెడ్డి, రాజబాబు, విజయనిర్మల, మీనాకుమారి కొంగొత్తపాత్రలను ధరించి, కొత్తతరహా నటనచే మిమ్మల్ని అలరించడానికి శాయశక్తులా ప్రయత్నించారు. కె. ఎస్. ప్రకాశరావు దర్శకత్వంలో త్వరితగతిన తయారౌతున్న యీ చిత్రం ఆంధ్రాలో విజయవ్వారా విడుదలౌతుంది; సంపత్ ఛాయాగ్రహణాన్ని, నాగరాజన్ అండ్ కృష్ణారావు కళాదర్శకత్వాన్ని హీరాలాల్ నృత్య దర్శకత్వాన్ని నిర్వహిస్తున్న యీ చిత్రం మే 30 న విడుదలకాగలదని శ్రీరాజ్ ఆర్ట్ ఫిలింస్‌కు సంబంధించిన ప్రముఖ వ్యక్తి వెల్లడించాడు.

* * *

మరుసటిదినం నుంగంబాకం హైరోడ్డుకు వెళ్లాను; ఎందుకో తెలుసా? మీకు కొత్త చిత్రంయొక్క వివరాలను అందించడానికే. ఎవరు, ఎక్కడ, యెప్పుడు నిర్మిస్తున్నారని మీరు అడుగుతారుగా. మీకు తెలిసినవారే, యిక్కడే. యీ నెలలోనే షూటింగు ప్రారంభిస్తున్నారు. ఆయన మరెవ్వరో కాదు;

'విందు మనసులు', 'కలసొచ్చిన అదృష్టం' చిత్రాలను నిర్మించిన జగన్నాధరావే; ఆయన తన మూడవ కానుకగా తమిళ కధారచయిత పద్మనాభన్ వ్రాసిన కథను తెలుగులో రామారావు నాయకుడిగ నిర్మిస్తున్నారు; సముద్రాల జూనియర్) సంభాషణలు వ్రాసారు; టి. వి. రాజా సంగీతాన్ని, రామకృష్ణారావు ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్న యీ సాంఘిక చిత్రాన్ని కె. విశ్వనాథ్ డైరెక్టు చేస్తున్నారు. నేను వెళ్లిన టైంకు జగన్నాధరావు, విశ్వనాథ్, పద్మనాభన్, మిక్కిలినేని యేదో సంభాషణలో నిమగ్నులైవున్నారు. నేను వెళ్లగానే జగన్నాధరావు సాదరంగా ఆహ్వానించి, 'ఏంకావాలి మీకు?' అన్న ప్రశ్నకు 'మరేంలేదు—నాయకుడు ఎన్. టి. ఆర్. అని తెలుసు, మరి నాయిక, యితర తారాగణం చెప్పగలరా' అని ప్రశ్నించాను; నాయిక పాత్రకు కృష్ణకుమారిని బుక్‌చేసాము; షూటింగు

## మీకు తెలుసా?

ప్రముఖ హిందీ నటి రాజశ్రీ (శాంతారాం కుమార్తె) తన భర్తతో బొంబాయినుండి రహస్యంగా పలాయనం చిత్తగించిన వార్త మీకు యిదివరకే తెలుసు వాళ్లిద్దరు ప్రస్తుతం కాలిఫోర్నియా నగరంలో ఎగుమతి, దిగుమతి వ్యాపారం చేస్తున్నారట.

ప్రఖ్యాత నటి వహీదా రహ్మాన్ రంగు ఫోటోలను తియ్యడంలో సిద్ధహస్తురాలు ఆమె ఫోటోలను తీసేటప్పుడు 'పుర్కా' అనెడి ఫోషాపద్ధతిని అవలంబిస్తారట.

ప్రముఖ వంగ, హిందీ నటిషర్మిలా టాగూర్ పటౌడీనవాబును పరిణయమాడింటగదా. ఇప్పుడామె పేరు ఆయేషాబేగం.

మలయాళ చిత్రాల బాక్సాఫీస్ కధానాయిక శ్రీమతి శారద యిప్పుడు తెలుగు, తమిళ, హిందీ చిత్రాల్లో (తులాభారం) నాయికగా నటిస్తూంది

నేటి తమిళచిత్రాల బిజీనటి, తెలుగునటి షావుకారు జానకి, ఇప్పుడామె మాటికి, ఎనభైచిత్రాల్లో నటిస్తున్నదట.

వివాహానంతరం నటి విజయలక్ష్మి సురేష్‌మూవీస్ 'ప్రొడక్షన్ నెం 2'లో నటించింది.



'టక్కరి దొంగ చక్కని చుక్క'లో కృష్ణ, విజయనిర్మల.

మార్చి 28 నుండి ప్రారంభమౌతుంది. మిగతా నటీనటుల వట్టి మరో పది రోజుల్లో యిస్తాను అన్నాడు; పాటల రికార్డింగు జరిగినట్టు విన్నాను; ఆ పాటలను విన్పిస్తారా అన్నాను; ఓ ఎస్ అంటూ టేబిల్‌మీదనున్న టేప్‌రికార్డరును ఆన్ చేసాడు;

1 (ఒకటి) 2 (రెండు) 3 (మూడు)
విడి విడిగా వుంటే అంతే
ఒకటిగా కలిపి చూడు
అది నూట యిరవైమూడు (123)
ఎవరికి వారయితే ఏముంది, ఏముంది
ఒకటై కలసుంటే బలముంది, బలముంది.

ఈ పాటను నారాయణరెడ్డి వ్రాసారు; పాటలో నిండి నిబిడీకృతమై వున్నభావాన్ని మీరు గ్రహించగలర్గారా? దేశం సుభిక్షం కావాలంటే ఐకమత్యం కావాలి అనేది వుత్తమ సందేశాన్ని కవి సి.నా.రే. వ్యక్తం చేశారు.

ఆ పాటయొక్క ఔన్నత్యాన్ని ఘంటసాల, ఎల్. ఆర్. ఈశ్వరి తమ గానమాధుర్యంతో మరింత శోభింపచేసారు; టి. వి. రాజు 1969 లో కూర్చిన బాణీలన్నిటికన్నా యిది మిన్నగా వుందనిపించింది. 'నా పని పూర్తయింది; యిక నాకు శెలవా' అని వచ్చేశాను.

* * *

మధ్యాహ్నం హేన్స్‌మ్యాన్ రోడ్డుకు వెళ్ళాను. అక్కడ రామకృష్ణ పిక్చర్స్ ఆఫీసు వుంది; 'తారాశశాంకం' చిత్రనిర్మాత కె. సత్యనారాయణ అప్పుడే యెక్కడికో ప్రయాణ మౌతున్నట్టువుంది; కారు యెక్కబోయి, నన్నుచూచి పైకి దారి తీసాడు; 'కాఫీ, టీ, కూల్‌డ్రింక్ ఏం కావాలిమీకు?' అన్నాడు. నాకు అవేం వద్దు; మీ పిక్చరు యెంతవరకు వచ్చింది? యెప్పుడు విడుదలవుతుంది? యివి చెప్తే చాలన్నాను;

'పరమపూజ్యులు, దివంగతులయిన కవి సామ్రాట్ సముద్రాల రాఘవాచార్య 'తారా శశాంకము'ను ఒక రసమయ రచనాకావ్యంగా వ్రాసియిచ్చారు; వారి రచనకు చిత్రంలోని నటీనటులందరూ పరిపూర్ణ న్యాయాన్ని చేకూర్చారు. నా చిత్రంలోని పాటలను కీ. శే. సముద్రాల, కవి నారాయణరెడ్డి, కొసరాజు, రాజశ్రీ చక్కగా వ్రాసారు. ఆ పాటలకు టి. వి. రాజు, విభిన్న రాగాల మేళవింపుతో ఒక కొత్తరూపాన్ని తీసుకొచ్చారు; చిత్రానికి (కథాంశంయొక్క ఔచిత్యాన్నిబట్టి) రాజేంద్రకుమార్ కళా ప్రతిభ యీ చిత్రంలోని ప్రతిసెట్టు నిరూపిస్తుంది. నటీనటుల హావ, భావాలను, ముఖారవిందాలను సుముఖంగా వుండడానికి సత్యనారాయణ (కెమరామెన్) తీసుకున్న శ్రమ చిత్రంచూస్తే తెలుస్తుంది; చిత్రాన్ని ప్రేక్షక జనరంజకంగా వుండడానికి దర్శకుడు మానాపురం కనబర్చిన ప్రజ్ఞ, ప్రాగివాలు నేను చెప్పడంకన్నా ప్రేక్షకులు చెప్తేనే బాగుంటుంది' అన్నాడు నిర్మాత కె. సత్యనారాయణ.

యం. సుబ్బరాయలు నిర్మాణ నిర్వహణలో నిర్మితమయిన యీ చిత్రానికి చి. హరి నారాయణ (అజంతా పిక్చర్స్ దర్శకుడు) కూర్పు. 'ఇదంతా బాగానేవుంది; మీ చిత్రంలోని నటీనటు లెవరో చెప్పారు కారు' అని ప్రశ్నించాను. 'బృహస్పతిగా గుమ్మడి, చంద్రుడిగ శోభన్‌బాబు, తారగా దేవిక, శుక్రాచార్యుడిగ ధూళిపాళ నటించారు. మిగతా ముఖ్యపాత్రలను కాంతారావు, హరనాథ్, వాణిశ్రీ, నాగయ్య, మిక్కిలినేని, బాలకృష్ణ, అల్లు రామలింగయ్య, సుకన్య, జ్యోతి, రాధిక ధరించారు' అన్నాడు; 'పిక్చర్ యెప్పుడు విడుదలవుతుందో చెప్పగలరా' అని అడిగాను; 'ఏప్రిల్‌లో కావచ్చు' అన్నాడు. సరే, వస్తానండీ అని చెప్పి అక్కడ్నుంచి వచ్చేశాను.

—శ్రీనివాస్

# ఆంధ్రసచిత్రవారపత్రిక

ఉత్తమ నటి



జమున

ఉత్తమ హాస్యనటుడు



పద్మనాభం

ఉత్తమ నటుడు



ఎన్. టి. రామారావు

సినిమా బాలట్‌లో పాల్గొని దానిని విజయవంతం చేసిన పాఠకు లందరికీ మా కృతజ్ఞతలు.

బాలట్ ఫలితాలు ఈ కింద వేస్తున్నాము. 10 శాతం తక్కువ వచ్చిన చిత్రాల, వ్యక్తుల వివరాలు ఇవ్వటంలేదు.

ఉత్తమ చిత్రం ఎన్నికని పరిశీలిస్తే వోట్లు బాగా పంచబడ్డాయని తెలుస్తుంది !

ఉత్తమ నటిగా ఎన్నికఅయిన శ్రీమతి జమునగారికి 78.8 శాతం వోట్లురాగా తక్కినవారెవరికీ 10 శాతం మించి వోట్లు రాలేదు.

ఉత్తమనటుడు ఎన్నికలో 'పోటీ' తీవ్రంగా ఉన్నట్లు గ్రహించవచ్చు. ఈ ఏడు 48.9 శాతంవచ్చిన శ్రీ ఎన్. టి. రామారావుగారికి పోయిన సంవత్సరం బాలట్‌లో 64 శాతం వోట్లువచ్చాయి. చాలా కొద్ది తేడాతో రెండవ స్థానంవచ్చిన శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారికి పోయిన సంవత్సరం 31.6 శాతం వోట్లువస్తే ఈసారి 46.2 శాతం వచ్చాయి. ఈ ఏడు మిగతా వారందరికీ కలిపి 4.9 శాతం వోట్లుమాత్రమే వచ్చాయి.

ఉత్తమ దర్శకులలో శ్రీ ఆదుర్తి సుబ్బారావుగారికి 40.7 శాతం. శ్రీ సి. ఎస్. రావుగారికి 28.9 శాతం వోట్లు వచ్చాయి.

ఉత్తమ హాస్యనటుడుగా ఎన్నిక అయిన శ్రీ పద్మనాభగారికి 50.5 శాతం. రెండవస్థానం వచ్చిన శ్రీ చలంగారికి 25.6 శాతం, మూడవవారుగా వచ్చిన శ్రీ రాజ్‌బాబుగారికి 19.9 శాతం వోట్లువచ్చాయి

ఉత్తమ సంగీత దర్శకుల ఎన్నికలో మొదటి, రెండుస్థానాల మధ్య తేడా 0.5 శాతం మాత్రమే !

మొదటిస్థానం వచ్చిన శ్రీ కోదండపాణిగారికి 29.5, రెండవ స్థానం వచ్చిన శ్రీ కె. వి. మహదేవన్‌గారికి 29 శాతం, మూడవస్థానంవచ్చిన శ్రీ టి.వి. రాజుగారికి 17.3 శాతంవోట్లువచ్చాయి.

ఉత్తమ సహాయ నటుడు ఎన్నికలో మొదటిస్థానం వచ్చిన శ్రీ శోభన్ బాబుగారికి 32 శాతం, తర్వాత వచ్చి

ఉత్తమ సహాయనటుడు



శోభన్ బాబు

# 1968 సినీహెరాల్డ్ ఫలితాలు

### ఉత్తమ సహాయనటి



విజయనిర్మల




### ఉత్తమ దర్శకుడు



ఆదుర్తి సుబ్బారావు

శ్రీకృష్ణకి 24 శాతం వోట్లు వచ్చాయి.

ఉత్తమ సహాయనటి ఎన్నికలో శ్రీమతి విజయనిర్మలకి 45.9 శాతం, కుమారి వాణిశ్రీ 20.4 శాతం, కుమారి గీతాంజలికి 11 శాతం వోట్లు వచ్చాయి.

**ఉత్తమనటి-జమున, ఉత్తమ హాస్యనటుడు-పద్మనాభం, ఉత్తమ నటుడు-ఎన్ టి రామారావు, ఉత్తమ సహాయనటి-విజయనిర్మల, ఉత్తమ చిత్రం-సుడిగుండాలు, ఉత్తమ దర్శకుడు-ఆదుర్తి సుబ్బారావు, ఉత్తమ సహాయనటుడు-శోభన్‌బాబు, ఉత్తమ సంగీత దర్శకుడు-కోదండపాణి.**

*అందరికీ మా అభినందనలు!*

### ఉత్తమ సంగీత దర్శకుడు



**కోదండపాణి**

### సుడిగుండాలు

అక్కినేని నాగేశ్వరరావు, ఆదుర్తి సుబ్బారావు కలసి స్థాపించిన చక్రవర్తి చిత్ర సంస్థ నిర్మించిన మొదటి ప్రయోజనాత్మక చిత్రం ''సుడిగుండాలు'' పద్మశ్రీ నాగేశ్వరరావు, గుమ్మడి, రాంమోహన్, మాస్టర్ రాజా, పుష్పకుమారి, సుకన్య, సంధ్యారాణి, ప్రసన్నరాణి ముఖ్యపాత్రలను పోషించిన యీ చిత్రానికి ఆంధ్రప్రదేశ్ బంగారు నంది బహుమతి, కేంద్రప్రభుత్వ రజతపతకం (రాష్ట్రీయస్థాయిలో) లభించాయి ఆదుర్తి సుబ్బారావు నిర్దేశకత్వంలో నిర్మితమయిన యీ చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని, రామకృష్ణారావు ఛాయాగ్రహణాన్ని నిర్వహించారు.

### ఆదుర్తి సుబ్బారావు

''అమరసందేశం'' చిత్రంనుండి [illegible] ''మన్—కా—మీత్'' వరకు ఆదుర్తి దర్శకత్వం వహించిన చిత్రాల్లో 75 శాతం విజయవంతమయినాయి కొత్త తారలను పరిచయం చేసిన ఆదుర్తియే ''సుడిగుండాలు'' వంటి ప్రయోజనాత్మక చిత్రానికి దర్శకత్వం నెరపి తెలుగు చిత్రాల స్థాయిని యినుమడింప చేసారు. తెలుగు చిత్రాలకు మాత్రమేగాక హిందీ చిత్రాలకు కూడ ఆదుర్తి హస్తవాసి బాగా పనిచేసింది, ప్రస్తుతం బాబా ఇంటర్నేషనల్ బ్యానర్‌లో వహీదారహ్మాన్, సునీల్‌దత్ నాయికా నాయకులుగ ఒక హిందీ చిత్రానికి, చక్రవర్తి సంస్థ నిర్మించనున్న ''మరో ప్రపంచం'' తెలుగు చిత్రానికి దర్శకత్వం చేసేందుకు అంగీకరించారు ★



ఎస్. ప్రభావతి, చింతలపూడి.

ప్ర: 'సతీ సక్కుబాయి' వంటి పాత్రలో మిమ్మల్ని చూసే అవకాశం మాకు వుంటుందంటారా ?

జ: నాకుకూడ అలాంటి అవకాశం రాకపోతుందా; ఆ పాత్రలో రాణించి మీ మెప్పును పొందకపోతానా అని ప్రతి రోజూ అనుకుంటూ వున్నాను,

జి. జయసుబ్రహ్మణ్యం, బెటూల్.

ప్ర: ఈ తరం సినిమా వారిలో, పాత్రలో లీనమై నటించడంలో మీకు మీరేసాటి అని నా అభిప్రాయం; ఇలాంటప్పుడు మిమ్మల్ని అర్థం లేకుండా వ్యాఖ్యానించే వాళ్లను ఏమనమంటారు ?

జ: మీ అభిప్రాయానికి నా వందనం; నా మంచిని కోరేవాళ్లే వ్యాఖ్యానించగల ధైర్యం గలవాళ్లు అనేది నా అభిప్రాయం.

ఆర్. బి. రాజు, హైదరాబాదు.

ప్ర: మీరు, మీ ఆరోగ్యాన్ని కాపాడుకోవటానికి ఏ ఆహారము తీసుకుంటారు ?

జ: మీ అభిమానమే నా ఆరోగ్యాన్ని కాపాడుతూ వుంది.

వి. నర్సిములు, తుర్కల్‌చాందా.

ప్ర: మీరు శతచిత్ర సుందరి అయినప్పుడు మీ అభిమాన ప్రేక్షకులకు టీపార్టీ ఇస్తారా ?

జ: టీపార్టీ మాత్రం కాదు.

ప్రేమకుమారి కేశవన్, విజయవాడ.

ప్ర: మనిషికి కావలసింది అందమా, డబ్బా, పర్సనాల్టీనా ? — లేక మంచి మనసా ఏది ?

జ: మనిషికి కావలసింది అందమయిన మనస్సు—చందమయిన పర్సనాలిటీ.

పి. శ్రీమన్నారాయణ, రాజమండ్రి.

ప్ర: మీరు చిత్రాలలో నటించిన సన్నివేశములలో యే సన్నివేశమయిన మీ నిజ జీవితములో సంభవించినదా ?

జ: ఇంతవరకు జరుగలేదు— ముమ్ముందు జరుగుతుందో, జరుగదో తెల్పడానికి నేనెవర్ని చెప్పండి—అంతా విధివిలాసం.

ఎస్. శ్రీనివాసు, అమ్ముగూడ.

ప్ర: ఈనాటి యువతీ యువకుల యెడలగల మీ అభిప్రాయం ఏమిటి ?

జ: సదభిప్రాయమే; నా సోదరి; సోదరుడ్నిగురించి నాకేం అభిప్రాయం వుంటుంది.

కోకా రామకృష్ణ కుమార్, వైజాగ్.

ప్ర: ముద్దంటే చేదా ? అసలా వుద్దేశం లేదా?

జ: ముద్దంటే మోజే; యిపుడా వుద్దేశం లేదే!

ముంకరరాంబాబు, ఎలమంచిలి.

ప్ర: సెన్సార్ కత్తెర మీ చేతుల్లో వుంటే సినిమాలలో సెక్సు ఎలాగుండేదంటారు ?

జ: 'సెక్సు' నాటిది నేటిది కాదు బ్రదర్; భగవంతుడు ఆడ, మగను సృష్టించినప్పుడే సెక్సు యేర్పడింది.

ఎన్. మేఘనాథ్, రేపల్లె.

హాలీవుడ్ చిత్రాల్లో, తెలుగు చిత్రాలుంటే; వాటిల్లో నటించడానికి మీరు ఒప్పుకుంటారా ?

జ: అవకాశం వస్తే, యే భాషా చిత్రంలోనయినా నటించడానికి అంగీకారమే.

## బహుమతి పొందిన ప్రశ్న

వి. ఆర్. రాజు, వైజాగ్:

ప్ర: అమ్మాయిలు కనపడగానే నాకు పెదవులమీదికి చిరునవ్వు వస్తుంది. ఎందుకు ?







జ: పువ్వులాంటి అమ్మాయిని చూసినప్పుడు, మీ పెదవులు విరియడం విడ్డూరంగానే వుంది; మంచి సర్జన్‌ను సంప్రదించండి. ●

"మనసున మల్లెలూగించే మనోహర ప్రణయగాధ"



తప్పక చూడండి!







వాహినీవారి

# బంగారు పంజరం

నిర్మాత-దర్శకుడు: బి.యన్.రెడ్డి

విజయ రిలీజ్

# 1969 సినిమా డైరీ

## నటులు

అక్కినేని నాగేశ్వరరావు 'అన్నపూర్ణ' బేగంపేట, హైదరాబాద్-16. ఫోన్: 72029.

అల్లు రామలింగయ్య, 6 జి. యన్. చెట్టి రోడ్, మద్రాసు-17.

అర్జా జనార్దనరావు 21, నాగేశ్వరయ్యర్ వీధి, నుంగంబాకం, మద్రాసు—34,

ఎన్. టి. రామారావు 63, బజుల్లారోడ్, మద్రాసు—17. ఫోన్: 441589.

ఎస్. వి. రంగారావు 90, హబీబుల్లారోడ్, మద్రాసు—17. ఫోన్: 444713.

ఎస్. వి. జగ్గారావు 5, సౌత్ బోగ్‌రోడ్, మద్రాసు—17.

ఏడిద నాగేశ్వరరావు 12, వెంకటరత్నంరోడ్, మద్రాసు—18.

ఓ. యస్. ఆర్. ఆంజనేయులు 17, పట్టమ్మాళ్ వీధి, ఎం. జి. ఆర్.నగర్, మద్రాసు—26.

కాంతారావు 6, సెకండ్ లేన్, విజయరాఘవాచారి రోడ్, మద్రాసు—17. ఫోన్: 442349.

కాకరాల 80, హబీబుల్లారోడ్ మద్రాసు—17.

కె.వి.చలం 61బి., ఉస్మాన్‌రోడ్,మద్రాసు-17.

కొంగర జగ్గారావు 31, భగీరథమ్మాళ్ వీధి, మద్రాసు—17.

కృష్ణ 18, నార్త్ బోగ్‌రోడ్, మద్రాసు-17.

కృష్ణంరాజు 2, ఆనందంవీధి, మద్రాసు—17.

కోళ్ళ సత్యం 12, రాజాబాదర్ వీధి, మద్రాసు—17.

గుమ్మడి వెంకటేశ్వరరావు 37, హబీబుల్లా రోడ్, మద్రాసు—17. ఫోన్: 442241.

చలం 1, నాగార్జుననగర్, మద్రాసు—24. ఫోన్: 440926.

చంద్రమోహన్ 42, ఉస్మాన్‌రోడ్, మద్రాసు—17.

గణేష్ 14, నాగార్జుననగర్, మద్రాసు—24.

జగ్గయ్య విద్యోదయాకాలనీ, మద్రాసు—17. ఫోన్: 76243.

జయకృష్ణ 6, సారథివీధి, మద్రాసు—17.

జి. ఆనందమోహన్ 2, కృష్ణస్వామి అయ్యంగార్‌వీధి, మద్రాసు—17.

ధూళిపాళ సీతారామశాస్త్రి 9, రామకృష్ణ వీధి, మద్రాసు—17.

నెల్లూరు కాంతారావు 21, రాజాబాదర్‌వీధి, మద్రాసు—17. ఫోన్: 441018.

నాగయ్య 1, లక్ష్మీనరసింహన్‌వీధి, మద్రాసు—17. ఫోన్: 442295.

నాగభూషణం 30, మురళీవీధి, మహాలింగపురం మద్రాసు—17. ఫోన్: 86719.

పద్మనాభం 9, నాగార్జుననగర్, మద్రాసు—24. ఫోన్: 443047.

ప్రభాకరరెడ్డి 14/1, రాజాబాదర్ వీధి, మద్రాసు—17.

బాలకృష్ణ, 7 హనుమర్తి వీధి, రంగరాజపురం మద్రాసు—24.

బాలయ్య 29 న్యూబోగ్‌రోడ్, మద్రాసు-17.

మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి 22, నాగార్జుననగర్, మద్రాసు—24.

ముక్కామల కృష్ణమూర్తి 19, సరోజిని వీధి, మద్రాసు—17.

ముదిగొండ లింగమూర్తి 12, నానారావు నాయుడు వీధి, మద్రాసు—17. ఫోన్: 442978.

మోదుకూరి సత్యం 34, నాగార్జుననగర్, మద్రాసు—24.

రాజనాల 12, సరోజినివీధి, మద్రాసు—17. ఫోన్: 441841.

రామ్మోహన్ 5, జి. యన్. చెట్టిరోడ్, మద్రాసు—17.

రాజ్‌బాబు 31, మురళీవీధి, మహాలింగపురం, మద్రాసు—17.

రామకృష్ణ 14,రాజమన్నార్‌వీధి,మద్రాసు—17.

రావి కొండలరావు 6, పి. బ్లాక్ టర్ఫ్ క్లబ్ రోడ్, నందనం, మద్రాసు—35.

రావు గోపాలరావు 3, [illegible] రోడ్, మద్రాసు—17.

రాఘవయ్య 35, బజుల్లారోడ్, మద్రాసు-17.

రాజ్‌కుమార్ 16, పట్టమ్మాళ్ వీధి, ఎం. జి. ఆర్. నగర్, మద్రాసు—26.

రమణారెడ్డి 12, వ్యాసారావువీధి, మద్రాసు-17

రేలంగి 20, నీలకంఠ మెహతావీధి, మద్రాసు-17. ఫోన్: 443311

శోభన్‌బాబు లక్ష్మీనివాస్, రాజారావ్ మెహతా నగర్, అమింజికరై, మద్రాసు—29.



అక్కినేని నాగేశ్వరరావు



యన్. టి. రామారావు



కాంతారావు



సావిత్రి

సత్యనారాయణ 9, పాయస్ రోడ్, మద్రాసు—18.

సాక్షి రంగారావు 9, మొదటవీధి, విశ్వనాథపురం, మద్రాసు 24

సారథి 63, సౌత్ వెస్ట్ బోగ్ రోడ్, మద్రాసు—17.

త్యాగరాజా ఫోర్త్ మెయిన్ రోడ్, సి. ఐ. టి. నగర్, మద్రాసు—35

హరనాథ్ 14, హెబ్బిమన్ రోడ్, మద్రాసు—17.

## నటీమణులు

అంజలీదేవి 2, వర్క్స్ రోడ్, మద్రాసు 28— ఫోన్: 72898.

ఆశామోహన్ (శైలశ్రీ) 38—, శివ పెరుమాళ్ పురం, మద్రాసు 28—. ఫోన్: 76556.

ఉదయ చంద్రిక 7 ఏ, పాల్ అప్పాస్వామి



కృష్ణకుమారి



కె. ఆర్. విజయ

వీధి, మద్రాసు—17.

ఉదయలక్ష్మి, అండవర్ నగర్, మద్రాసు-24.

ఋష్యేంద్రమణి 17, వెంకటరత్నంవీధి, మద్రాసు—18.

ఎస్ వరలక్ష్మి [illegible] హెచ్. డి. రాజానగర్, మద్రాసు—18.

కళ్యాణి 2/45 రాయపేట హై రోడ్, ఫోన్: 811392

కాంచన 5, మ్యాగిరి రోడ్, మద్రాసు—17. ఫోన్: 444712.

కృష్ణకుమారి 37, ఫస్ట్ మెయిన్ రోడ్, గాంధి నగర్, మద్రాసు-20. ఫోన్: 73634.



[illegible]



బి. సరోజాదేవి

కె ఆర్. విజయ 29, రామన్ స్ట్రీట్, మద్రాసు—17, ఫోన్: 442605.

కె ఆర్. సావిత్రి 2, రామకృష్ణనగర్, అన్నామలైపురం, మద్రాసు-28, ఫోన్: 71758.

కుమారి పద్మ 17 ఏ, సెకండ్ [illegible] స్ట్రీట్, రోజరి చర్చ్ రోడ్, మద్రాసు—4 ఫోన్ 72695.

గీతాంజలి 5, న్యూ లే అవుట్, [illegible] మద్రాసు—18, ఫోన్. 440233.

చంద్రకళ 1, కోదండరాం [illegible] మద్రాసు-34. ఫోన్: 83594.



భారతి



హరనాథ్ — శోభన్‌బాబు — కృష్ణ

# సినిమా డైరీ

జమున 30, తిరుమలపిళ్ళై రోడ్, మద్రాసు–17, ఫోన్ 444123

జయలలిత 8/1, శివజ్ఞానంరోడ్, మద్రాసు–17, ఫోన్ 440394.

జయంతి 2, తిరుమూర్తివీధి, మద్రాసు–17, ఫోన్ 442364

జానకి 16, గిరిరోడ్, మద్రాసు–17. ఫోన్: 443682.

జి. వరలక్ష్మి 2, చామియర్స్ రోడ్, మద్రాసు—17.

జూనియర్ భానుమతి 17 'ఇ' బ్లాక్, టర్న్‌బుల్స్‌రోడ్, నందనం, మద్రాసు—35

జ్యోతిలక్ష్మి 27, సారంగపాణివీధి, మద్రాసు—17, ఫోన్: 441404

దేవిక 14, విజయరాఘవాచారిరోడ్, మద్రాసు—17.

టి. జి. కమలాదేవి 75 సి, ఫస్ట్ ఈస్ట్ మెయిన్‌రోడ్, షెనాయ్‌నగర్, మద్రాసు-30, ఫోన్ 62790

పద్మాంజలి ఫ్లాట్ నెం 114, నందనం, మద్రాసు—35

పుష్పవల్లి 16, రామన్‌స్ట్రీట్, మద్రాసు 17, ఫోన్ 441149

పుష్పకుమారి 4, వసుమర్తివీధి, రంగరాజపురం, మద్రాసు—24

పద్మలక్ష్మి 5 ఏ, సైదాపేట రోడ్, వడపళని, మద్రాసు—26

భానుమతి భరణి గార్డెన్స్, ఆర్కాట్‌రోడ్, మద్రాసు—26. ఫోన్ : 442767.

భారతి 9, పోర్ట్ క్రాస్‌స్ట్రీట్, సి. ఐ. టి. కాలనీ, మద్రాసు—4

బి. వి. రాధ 30/2, శ్రీనివాసరావు రోడ్, మద్రాసు—4.

బేబీ పద్మిని 18, రాజాబాదర్‌వీధి, మద్రాసు—18, ఫోన్. 444785

బేబీ రోజారమణి 12, విజయరాఘవాచారి రోడ్, మద్రాసు—17 ఫోన్ 442440

బేబీ మల్లిక 92/96, దేవరాజముదలివీధి, మద్రాసు—3.

బేబీ రాణి, బేబీ శాంతికళ 16, అనసూయ స్ట్రీట్, నాగార్జుననగర్, మద్రాసు—24.

మీనాకుమారి 8, అనంతాచారి వీధి, మద్రాసు—18. ఫోన్. 73606

రాజశ్రీ 17, పోరూర్ సోమసుందర ముదలి వీధి, మద్రాసు—17, ఫోన్: 442877.



వాణిశ్రీ — భానుమతి — రాజశ్రీ



జ్యోతిలక్ష్మి

రాజసులోచన 5, సెకండ్‌లేన్, విజయరాఘవాచారిరోడ్, మద్రాసు—17, ఫోన్: 440147.

రాధిక 24, చెల్లమ్మాళ్ వీధి, అమింజికర్రై, మద్రాసు—29.

రమాప్రభ 16, కోపరేటివ్‌కాలనీ, మద్రాసు—18.

రాధాకుమారి 6 'పి' బ్లాక్, టర్న్‌బుల్స్‌రోడ్, నందనం, మద్రాసు—35.

రాజేశ్వరి 124 ఏ, హబీబుల్లారోడ్, మద్రాసు—17.

లక్ష్మి 10, లావ్‌రాన్స్‌స్మిత్‌రోడ్, గోపాలపురం, మద్రాసు—6.

వాణిశ్రీ 17, లక్ష్మణన్‌స్ట్రీట్, మహాలింగపురం. మద్రాసు—34.



చలం



సంధ్యారాణి

విజయనిర్మల 6, పెరూర్ సోమసుందరముదలి వీధి, మద్రాసు—17.

విజయలలిత 3, ఫస్ట్ క్రాస్ స్ట్రీట్, యు. ఐ. కాలనీ, మద్రాసు—24. ఫోన్: 440259.

విజయశ్రీ 1, భగీరథిరోడ్, శ్రీనివాస అవెన్యూ మద్రాసు—28. ఫోన్: 76234.

విజయభాను 22, గోవిందుస్ట్రీట్, మద్రాసు—17.

వెణ్ణిరఆడై నిర్మల 21, దేవనాథన్ స్ట్రీట్ మందవెల్లి, మద్రాసు—4, ఫోన్: 74186.

శారద 16, మహాలింగచెట్టిస్ట్రీట్, మహాలింగపురం, మద్రాసు—34.

శశిరేఖ 9, వారెన్‌రోడ్, మద్రాసు—4.

శాంతకుమారి 13/2 రత్నాచెట్టిస్ట్రీట్, మద్రాసు—14.



పద్మనాభం



గీతాంజలి

సరోజాదేవి 26, సెకండ్ మెయిన్‌రోడ్, గాంధీనగర్, మద్రాసు—20, ఫోన్: 71951.

సంధ్యారాణి 4, థర్డ్‌స్ట్రీట్, లక్ష్మీపురం, మద్రాసు—14.

సావిత్రి 11, హబీబుల్లారోడ్, మద్రాసు—17, ఫోన్: 444903.

సుకన్య 11, లింక్‌వీధి, మద్రాసు—17, ఫోన్: 441928.

సుమ 22, రంగయ్యర్‌వీధి, మద్రాసు—17.

సూర్యకాంతం 8, సెకండ్ మెయిన్‌రోడ్, సి. ఐ. టి. కాలనీ, మద్రాసు—4, ఫోన్: 72761.

హేమలత 1, అనూయవీధి, నాగార్జుననగర్, మద్రాసు—24.

హేమమాలిని 22, సెకండ్‌స్ట్రీట్. బాలాజీ



రాజ్‌బాబు

టార్, మద్రాసు 14, ఫోన్: 82455.

శీలా 10, ఫస్ట్ క్రాస్ స్ట్రీట్, సి. ఐ. టి. కాలనీ, మద్రాసు—4.

మణిమాల 85, భట్స్‌రోడ్, సెంట్‌థామస్ మవుంట్, మద్రాసు—16.

జూనియర్ శ్రీరంజని, 15, విజయరాఘవాచారి స్ట్రీట్, టి. నగర్, మద్రాసు—17.

వాసంతి 14 అరుళమ్మాళ్ స్ట్రీట్, టి.నగర్, మద్రాసు—17.

## దర్శకులు

అక్కినేని లక్ష్మీవర ప్రసాదరావు (ఎల్. వి. ప్రసాద్) 53, థర్డ్ మెయిన్‌రోడ్, గాంధినగర్ మద్రాసు—20, ఫోన్: 71578.

అబ్బి (వి.వి. సుబ్బారావు) 1/32 రత్నాచెట్టి వీధి, మద్రాసు—14.

ఆదుర్తి సుబ్బారావు 38 సారంగపాణి వీధి, మద్రాసు—17, ఫోన్, 442484.

అమంచర్ల శేషగిరిరావు 28, సెకండ్ స్ట్రీట్ వార్ట్ బోగ్ రోడ్, మద్రాసు—17.

ఎస్. డి. లాల్ 3 ఫస్ట్ క్రాస్ స్ట్రీట్ యునైటెడ్ ఇండియా కాలనీ మద్రాసు—24.

ఎం. మల్లికార్జునరావు రిపబ్లిక్ గార్డెన్స్ 15 విజయరాఘవాచారి రోడ్, మద్రాసు—17.

ఐ. యస్. మూర్తి 1, 'అబ్దుల్ అజీజ్ స్ట్రీట్ మద్రాసు—17.

కె. యస్. ప్రకాశరావు 9, రాధాకృష్ణ వీధి మద్రాసు - 17.

కె. ప్రత్యగాత్మ 46, సెకండ్ మెయిన్‌రోడ్, రాజా అన్నామలైపురం, మద్రాసు—28, ఫోన్: 72784.

కె. హేమాంబరధరరావు 61, భారతీనగర్, మద్రాసు—46.

కె. కామేశ్వరరావు 13, మ్యాబజార్ స్ట్రీట్, మద్రాసు—17.

కె. బి. తిలక్ మహాలింగపురం, మద్రాసు—34



జ య ల లి త

# సినిమా డైరీ

కె. యస్. ఆర్. దాసు, రవిచంద్ర ఫిలిమ్సు, 6, మురుగేశముదలియార్ రోడ్, మద్రాసు—17.

కె. విశ్వనాథ్ 11, ఫోర్త్ క్రాస్ స్ట్రీట్ యు.ఐ. కాలనీ, మద్రాసు—24

కె. వి. రెడ్డి 3, మురుగేశ్ ముదలియార్‌రోడ్, మద్రాసు—17.

కె. వి. నందనరావు, యస్. వి. ఆర్. ఫిలిమ్స్, జి. యన్. చెట్టి రోడ్, మద్రాసు—17.

జి. విశ్వనాథం, సురేష్ మూవీస్ 19, వార్ట్ బోగ్‌రోడ్, మద్రాసు—17.

గిడుతూరి సూర్యం, 32, సెకండ్ మెయిన్‌రోడ్, సి. ఐ. టి. నగర్, మద్రాసు 35.

జి. వి. ఆర్. శేషగిరిరావు, శివజ్ఞానం రోడ్, మద్రాసు—17.

జి. రామినీడు 17 బర్కిట్‌రోడ్, మద్రాస్—17.

జి. వరలక్ష్మి 2 ఫామియర్స్ రోడ్, మద్రాసు—28.

టి. ప్రకాశరావు 14 బి, విజయరాఘవాచారిరోడ్, మద్రాసు—17, ఫోన్: 442072

డి. యోగానంద్ తిరుమలపిళ్లై రోడ్, మద్రాస్—17.

పి. పుల్లయ్య, 13/2, రత్నాచెట్టివీధి, మద్రాసు—14, ఫోన్: 81205.

పి. సాంబశివరావు 3, రాజాంబాళ్ స్ట్రీట్, మద్రాసు—17.

పేకేటి శివరాం 2 తిరుమూర్తి వీధి మద్రాసు—17 ఫోన్: 442364.

బి. యస్. రెడ్డి 5 సౌత్‌బోగ్ రోడ్, మద్రాసు—17, ఫోన్: 441839.

బి. విఠలాచార్య 63 జి. కోయిల్ స్ట్రీట్, మద్రాసు—7.

బి. వి. శ్రీనివాస్ 63 జి. కోయిల్ స్ట్రీట్ మద్రాసు—7.

తాతినేని రామారావు 9 మూసాసేట్ వీధి,



చ ం ద్ర క ళ



జమునా రమణారావు

మద్రాసు—17.

బి. ఏ. సుబ్బారావు 5 అశోకారోడ్, మద్రాసు—18, ఫోన్: 72009.

బాపు 1సి, పి. పి. రామస్వామిఅయ్యర్ రోడ్, మద్రాసు—18, ఫోన్: 75158.

టి. కృష్ణ, బాబూ మూవీస్ 18 ఫస్ట్ మెయిన్ రోడ్, సి. ఐ. టి. కాలనీ మద్రాసు—4.

యస్. వి. రంగారావు 90 హబీబుల్లా రోడ్ మద్రాసు—17.

ఆర్. సుందరం 7 అశోకారోడ్ మద్రాస్—18.

వేదాంతం రాఘవయ్య 19 వెంకట్రామయ్యర్ వీధి, మద్రాసు—17.

సి. వి. శ్రీధర్ 13 వెంకట్రామయ్యర్ వీధి, మద్రాసు—17.

సావిత్రి 11 హబీబుల్లారోడ్, మద్రాసు—17.

వి. మధుసూదనరావు 9 సర్ సి. వి. రామన్ రోడ్, మద్రాసు—18.

వి. రామచంద్రరావు 59 బి, కోడంబాకం హైరోడ్, మద్రాసు—17.

సి. యస్. రావు 5 సెకండ్‌లేన్ విజయరాఘవాచారి రోడ్, మద్రాసు—17.

మానాపురం అప్పారావు, రామకృష్ణా పిక్చర్స్, హెన్స్‌మన్ రోడ్, మద్రాసు—17.

పద్మనాభం 9 నాగార్జున నగర్, మద్రాస్—24.

పాలగుమ్మి పద్మరాజు 3 ఏ, థర్డ్‌స్ట్రీట్, లక్ష్మీపురం, మద్రాసు—14.

రామకృష్ణ, భరణి గార్డెన్స్ 9 ఆర్కాట్ రోడ్, మద్రాసు—26.

తాపీచాణక్య 11 ఫస్ట్ క్రాస్ స్ట్రీట్, వెస



విజయలలిత

వీరియా, మద్రాసు—34

యస్. టి రామారావు 63 బజుల్లా రోడ్, మద్రాసు—17

## రచయితలు

ఆత్రేయ 8 అశోకా రోడ్, మద్రాసు—18, ఫోన్ 73711

ఆరుద్ర 1 శివప్రకాశముదలి స్ట్రీట్, మద్రాస్—17, ఫోన్ 443146

ముళ్లపూడి వెంకటరమణ 1 ఏ, సి పి రామస్వామి అయ్యర్ లేన్, మద్రాసు—18 ఫోన్ 75158

మద్దిపట్ల సూరి 5/2, శివప్రకాశముదలి వీధి, మద్రాసు—17,

భమిడిపాటి రాధాకృష్ణ, దానవాయిపేట, రాజమండ్రి—3

జూనియర్ సముద్రాల 12 సెకండ్ స్ట్రీట్, ఆకరియా కాలనీ, మద్రాసు—24

సి నారాయణరెడ్డి వివేక్‌నగర్ చిక్కడ్‌పల్లి, హైదరాబాద్—20

దాశరధి 90 బి, వెంకటాచలముదలి వీధి, మద్రాసు—4, ఫోన్ 73744

జి కె మూర్తి 116/2 ఆళ్వార్‌పేట స్ట్రీట్ మద్రాసు—18

వీటూరి 5 కార్క్‌టాక్ రోడ్ మద్రాసు—17

రాజశ్రీ శ్రీ రమణచిత్ర 1 నాగార్జుననగర్, మద్రాసు—24

విశ్వప్రసాద్ జి కె హౌస్ రెండవ వీధి మద్రాసు—24.

కొసరాజు నార్త్ బోగ్ రోడ్ మద్రాసు—17 ఫోన్ 44 826

మహారధి 9 ఫోర్త్ మెయిన్‌రోడ్ సి ఐ టి నగర్, మద్రాసు—35

శ్రీ శ్రీ 12 కె నార్త్ బాంక్ రోడ్ మద్రాసు—28

డి వి నరసరాజు 7 కాల్వారేషన్ హైస్కూల్ రోడ్, మద్రాసు—34

పాలగుమ్మి పద్మరాజు లక్ష్మీపురం మద్రాసు—14

జి వి జి 2/27 రాయపేట హైరోడ్, మద్రాసు—14

## సంగీత దర్శకులు

టి చలపతిరావు 14 లక్ష్మి కాలనీ, నార్త్ క్రీసెంట్‌రోడ్, మద్రాసు—17 ఫోన్ 440189

టి వి రాజు 9 పోయస్ రోడ్, మద్రాసు—18

యస్ రాజేశ్వరరావు ఎల్డామ్స్ రోడ్ మద్రాసు—18

పెండ్యాల నాగేశ్వరరావు 10 బజుల్లారోడ్, మద్రాసు—17, ఫోన్ 443907

కె వి మహదేవన్ 39 జి యన్ చెట్టిరోడ్ మద్రాసు—17, ఫోన్ 443671

కోదండపాణి నాగార్జుననగర్, మద్రాసు—24

ఎం ఎస్ విశ్వనాధం, శాంతోమ్ హైరోడ్, మద్రాసు—4

ఎం పూర్ణచంద్రరావు 11, దీనదయాళ్ స్ట్రీట్ మద్రాసు—17

మాస్టర్ వేణు 1 నార్త్‌బోగ్ రోడ్, మద్రాసు—17

ఎస్ హనుమంతరావు రామస్వామి నాయకర్ వీధి, ఆళ్వార్‌పేట, మద్రాసు—18

ఘంటసాల 35 ఉస్మాన్ రోడ్, మద్రాసు—17

శివారెడ్డి— ఉదయభాస్కర్ పిక్చర్స్ 6 ఫస్ట్ క్రాస్ స్ట్రీట్, లేక్ ఏరియా, మద్రాసు—34

సత్యం కె—1, టర్న్‌బుల్స్ రోడ్ నందనం మద్రాసు—35

## ఛాయగ్రాహకులు

ఎం ఏ రెహమాన్—ఆర్ ఆర్ పిక్చర్స్ 4 నార్త్‌బోగ్ రోడ్, మద్రాసు—17

కమాల్‌ఘోష్ 169 ఫోర్త్ మెయిన్ రోడ్, మద్రాసు—30

రవికాంత్ 7 వీరభద్రయ్యర్ స్ట్రీట్ నుంగంబాకం మద్రాసు—34

యస్ వెంకటరత్నం— మధుపిక్చర్స్ 34 గిరి రోడ్, మద్రాసు—17

వి యస్ ఆర్ స్వామి బి—5, టర్న్‌బుల్స్ రోడ్ నందనం మద్రాసు—35

సెల్వరాజు—శ్రీ సారధి స్టూడియోస్ అమీర్‌పేట, హైదరాబాద్—16

జాగీర్దార్—వాహినీ స్టూడియోస్' ఆర్కాట్ రోడ్, మద్రాసు—26

ఎస్ ఎస్ లాల్ 5 సౌత్ శివన్ కోయిల్ స్ట్రీట్ మద్రాసు—24

కన్నప్ప కారంబాక్కం సెంట్‌థామస్ మవుంట్ పోస్ట్ మద్రాసు—16

కె యస్ రామకృష్ణరావు 18 నాగేశ్వరయ్యర్ వీధి, నుంగంబాకం మద్రాసు—12, ఫోన్ 88119

అన్నయ్య 12 రాజమన్నార్ స్ట్రీట్, మద్రాసు—17

ఎం కె. రాజు 15, కృష్ణారావునాయుడువీధి, మద్రాసు—17 ★

సేకరణ · మోహన్ కుమార్



ఎస్. వి. రంగారావు



ఎం. చంద్రమోహన్

## న్యూఢిల్లీ లేఖ

(7వ పేజీ తరువాయి)

తోరయిలు లమని దోచేస్తున్నారని కొందరి నమ్మకం. కలకత్తాలోని కమ్యూనిస్టు నాయకులని కొందరిని తూర్పుబెంగాలులోని తోటిబెంగాలీలు అభినందించారు, ఎన్నికలతర్వాత ఇది గమనార్హం. దారిద్ర్యానికి మతం అడ్డురాదు. తూర్పు పశ్చిమ బెంగాలులు ఏకమయితే పాకిస్తాన్, భారత దేశాలకి రెండిటికీ పెద్ద దెబ్బ. కమ్యూనిస్టులు మూడుసంస్థలద్వారా అధికారంలోకి చొచ్చుకుపోతారు. ఒకటి, కార్మిక సంస్థ. రెండు విద్యార్థి సమాజాలు, మూడు రక్షణశాఖ. మొదటిది ఎలాగూ కమ్యూనిస్టుల చేతుల్లో ఉంది. రెండవ రకం కమ్యూనిస్టుల, జనసంఘం ప్రభావానికి గురి అవుతున్నాయి. ఇక రక్షణశాఖ మిగిలింది. ఇంతదాకా అది సుస్థిరంగానే ఉంది కాని వర్గ, పక్ష విభేదాలు అక్కడ కూడా ప్రారంభం అయ్యాయి.

**అవురంగజేబు తర్వాత...**

అవురంగజేబు తర్వాత ఏర్పడిన పరిస్థితే నేడు ఢిల్లీలో ఏర్పడుతోంది. అయితే, ఇంకా రక్షణశాఖ, ఆర్థికాధికారమూ కేంద్ర ప్రభుత్వం చేతుల్లోనే ఉన్నాయి.



యుద్ధం వల్ల కంట్రోళ్లు వచ్చాయి. ఇప్పుడు ప్లానింగ్ వల్ల అవి అవసరం అవుతున్నాయి. కాంగ్రెసు రకం ప్రణాళికలని కేరళ, పశ్చిమ బెంగాలులు విమర్శిస్తున్నాయి. ఎందుకు? కేంద్రం ఎంత బలహీనంగా, అయికమత్య రహితంగా ఉందో కమ్యూనిస్టులకి తెలుసు ముందు జరగపోయేది ఏమిటో అందరికీ తెలుస్తూనే ఉంది. బెంగాలులో బాలట్ పెట్టెలవని అయిపోయినట్లే...

శ్రీ ధర్మవీర ఉపసంహరణ విషయమయి రాజీ కొంత కుదిరింది.

విచిత్రం ఏమిటంటే, బెంగాలులో కమ్యూనిస్టులు అధికారంలోకి రావటాన్ని పీకింగ్ తీవ్రంగా విమర్శించింది. శ్రీ జ్యోతిబాసు 'సామ్రాజ్యవాదుల వేటకుక్క' అన్నది పీకింగ్! సంయుక్త ప్రభుత్వాలు చెయినా ప్రభువులకి ఇష్టం లేదు కార్మిక వర్గం యొక్క నియంతృత్వం కావాలంటారు వారు. ●

---

## అవీ - ఇవీ...

### మద్రాసు నాటక కళా పరిషత్తు

ప్రఖ్యాత చలన చిత్ర నటీనట దర్శక, నిర్మాతలు, పుర ప్రముఖుల సమక్షంలో మద్రాసులో నిర్వహించే ఈ పోటీలు మే నెలలో జరుగుతాయి. ఈ పోటీలలో ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతములలోని తెలుగు ఔత్సాహిక నాటక సమాజాల వారు, నటీ నటులు పాల్గొనవచ్చును. వెంటనే నిబంధనావళి, దరఖాస్తు ఫారములకు ఈ క్రింది అడ్రసుకి వ్రాయండి.

కార్యదర్శి, మద్రాసు నాటక కళాపరిషత్,
మద్రాసు—35.

### అపొల్లో '8'

అమెరికన్ కాన్సులేట్ ఇంఫర్మేషన్ ఆఫీసర్ శ్రీ క్రిస్టొఫర్ షెరాల్స్ ఇంటిఆవరణలో 'అపొల్లో 8' గురించిన వార్తాచిత్రాన్ని పత్రికా ప్రతినిధులకు చూపించారు. రాకెట్ ప్రయోగము, అంతరిక్ష యాత్ర, చంద్రుని ఆకార వివరాలు మొదలైన వాటిని ఇందులో వివరంగా పొందుపరిచారు. ఆసక్తి జనకంగాను, అద్భుతంగానువున్న ఈ చిత్రం ప్రేక్షకుల్ని ఉత్తేజితుల్ని చేస్తుంది. ●

**వంటలు:**

## నువ్వులపప్పుతో వంటలు

నువ్వుల పప్పు విశాఖజిల్లాలో విరివిగా వాడతారు. దీనితో చేసిన పచ్చళ్లు, కూరలు, బూరెలు చాల రుచిగా ఉంటాయి. నువ్వుల పప్పు రెండు ఎండు మిరపకాయలు వేసి ఎర్రగా వేయించి పొడి కొట్టి ఉప్పు కలిపి సీసాలో పెట్టుకోవచ్చు. ఈ పొడిని అన్నంలో కలుపుకొని వంకాయ పులుసులోనో పచ్చడితోనో, టొమేటో పచ్చడితోనో నంచుకొని తింటే రుచిగా ఉంటుంది. నువ్వులపప్పు ఉప్పు, కారం వేయకుండా ఎర్రగా వేయించి పొడికొట్టి సీసాలో పెట్టుకొని అప్పుడప్పుడు కూరల్లో వేయవచ్చు.

ఆనపకాయ, బీరకాయ, బెండకాయ, బచ్చలి కూర, క్యాబేజీ, కాలీఫ్లవరు, నూల్‌కోల్, తెల్ల బూడిద గుమ్మడి, తీపి గుమ్మడి, పొట్ల, దొండ, అరటిదూట, అరటి పువ్వు, అన్నిరకాల చిక్కుళ్లు —వీటిని ఉడికించి తీసి పోపులోవేసి నువ్వులపొడి జల్లవచ్చు. ఆనప, బీర, బచ్చలికూరలు తప్ప మిగతా వాటిని పోపులో వేశాక చిక్కని చింతపండు పులుసు కొద్దిగా వేసి యిగిరేక పొడివేసి కలియబెట్టి దించాలి.

నువ్వుల పప్పును చిటికెడు పసుపు, ఉప్పు, కొద్దిగా చింతపండు, పచ్చిమిర్చివేసి మెత్తగా రుబ్బుకోవాలి నిమ్మరసం పిండి, ఆవాలు, జీలకర్ర, మెంతులు పోపు పెట్టాలి ఈ పచ్చడి కాస్త జారుగా ఉండి ఇడ్లీ, దోసెలోకి కూడ బాగుంటుంది

నువ్వులపప్పు రెండు నీరుల్లిపాయలు, ఎండు మిరపకాయలు, ఉప్పు వేసి గట్టిగా రుబ్బుకోవాలి. ఆవాలు, మెంతులు పోపు పెట్టాలి. అన్నంలోకి బాగుంటుంది.

వేయించి కొట్టిన నువ్వుల పప్పు పొడిని పెరుగులో కాని, మజ్జిగలోగాని కలిపి పోపు పెట్టవచ్చు. నువ్వులపప్పు, మామిడికాయ—ఉప్పు, ఎండుమిరపకాయలు, ఇంగువ వేసి రుబ్బుకుంటే చాల రుచిగా ఉంటుంది పప్పును అప్పడాల ఉండలకు అద్ది ఒత్తుకోవచ్చు.

నువ్వుల పప్పు వేయించి మెత్తగా దంపి బెల్లం చేర్చి నిమ్మకాయలంత ఉండలు చేయాలి వరి పిండి, సెనగపిండి కలిపి చిటికెడు సోడావేసి జారుగా కలుపుకొని ఉండలను తోపులో ముంచి వేయించాలి ఇవి రెండురోజులు నిలువ ఉంటాయి.

నువ్వులపప్పును జంతికల పిండిలోవేసి మురుకుల గొట్టంతో పిండివేయిస్తే కమ్మగా ఉంటాయి.

—జి. సరస్వతి. ●

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.